సుబ్బమ్మ అను నామెను గోవిందప్పకు వివాహము చేసిరి. ఇంక గోవిందప్ప సంసారియై స్థిర పడెను.

*ప్రథమ రంగస్థల నాటక ప్రదర్శనము*

క్రీ. శ. 1895 వ సంవత్సరము శ్రీ వనారస వారి కుటుంబ చరిత్రలో సువర్ణ ఘట్టమని చెప్ప వచ్చును. ఆ సంవత్సరము కడపజిల్లా, రాయచోటి తాలూకా, "సురభి" గ్రామ వాసులైన శ్రీ రామిరెడ్డి, శ్రీ చెన్నారెడ్డి అనెడు సంపన్న గృహస్థుల ఇంట జరిగెడు వివాహ సందర్భములో తోలు బొమ్మలను ప్రదర్శించ వలసినదిగా వనారస సోదరులు ఆహ్వానింప బడిరి; అందులకు వారు అంగీకరించిరి. కాని, ఇంకను తోలుబొమ్మలను ప్రదర్శించుట గోవిందప్పకు ఇష్టములేదు. అందుచేత వీధి నాటక మొకదానిని ఆడుటకు సమకట్టెను. వెంటనే తక్కిన వారికి పాత్రలు నేర్పి పాటలు చెప్పి, నంద్యాలనుండి సేకరించి తెచ్చుకొనిన పూసలు, రంగులు మొదలగు పరికరముల నుపయోగించి, చెన్నారెడ్డిగారి ఇంటిలోనున్న చీరలు, నగలు, మొదలగునవి వాడుకొని జయప్రదముగా "కీచక వధ"ను ప్రదర్శించెను. ఆ ప్రదర్శనమునందు క్రిందివారు పాల్గొనిరి. కీచకుడు: కృష్ణప్ప; భీముడు: పెద్దరామయ్య; కంకభట్టు: వెంకప్ప; బృహన్నల: పెద్దరామయ్యగారి కుమారుడు వజీరప్ప; నకులుడు: గోవిందప్ప; సహదేవుడు: చిన్నరామయ్య; సైరంధ్రి: పాపాబాయి; ఉత్తర: చిన్నసుబ్బమ్మ (గోవిందప్ప సుఊదలు) ఈ ప్రదర్శనమందు తమకు పాత్ర లేనప్పుడు కృష్ణప్పగారు మృదంగమును, రామయ్యగారు తాళమును, వెంకప్పగారు ఫిడేలును వాయించెడివారు; వజీరప్ప, పాపాబాయిగార్లు ప్లేబాక్ పాటలు పాడెడివారు,

*సురభి వారు*

ఈ కీచక వధ ప్రదర్శనమును గాంచి గ్రామవాసు లందరును, ముఖ్యముగా చెన్నారెడ్డి; రామిరెడ్డి గార్లును చాల అభినందించిరి. ఆనాడచ్చటకు వచ్చిన పులివెందల సబు మేజిస్ట్రేటు శ్రీ టి. యన్. గోవిందరాజులు నాయుడుగారు కూడ కీచక వధను తిలకించి, ఆనందించి, వారినెల్ల పులివెందలకు పిలిపించి, అదే నాటకమును మరల ఆడించి వారి నెక్కువగా గౌరవించుటయే కాక ఒక నాటక సమాజమును స్థాపించ వలసినదిగా కూడ ప్రోత్సహించిరి. చెన్నారెడ్డి, రామిరెడ్డిగార్లకు ఇది నచ్చి, ధనసహాయ్యము చేయుటకు అంగీకరించిరి. అంతటితో వనారసవారు "సురభి" గ్రామములో స్థిరపడిరి. నాటినుండియే వారికి "సురభివారు" అని పేరు.

*శ్రీ శారదా మనోవినోదినీ సంగీత నాటక సభ :*

ఆ సమయములో చిత్తూరు జిల్లా, చంద్రగిరి కాపస్థుడు రామారావు అనునతడు నృత్య ప్రదర్శనము లిచ్చుచు సురభి గ్రామమునచ్చెను.



శ్రీ సుబ్బదాసుగారు

రంగస్థల నాటకములను నేర్పవలసినదిగా వారిని కోరినారు. కాని, వారంగీకరించియు ప్రారంభిం

చకముందే ఎవరికిని చెప్పక వెడలిపోయినారట. అప్పుడే పదిరోజులు ఇంచుమించులో అనంతపురం తాలూకా, ధర్మవరం గ్రామవాసులు శ్రీ నా ప్రాతి సుబ్బదాసుగారి హరికథలు చెప్పుచు నా గ్రామము వచ్చుటసంభవించెను. ధర్మవరము లోని ఒకనాటకసమాజములో శ్రీసుబ్బదాసుగారు సామాజికులట; తరువాత వారు హరికథలు ప్రారంభించిరి. రామిరెడ్డి, చెన్నారెడ్డి గార్లు శ్రీ సుబ్బదాసుగారిని ఆహ్వానించి, వనారస వారికి రంగస్థలనాటకములు నేర్పవలసినదిగా కోరిరి. శ్రీ సుబ్బదాసుగారు అందులకు అంగీకరించి, హరిశ్చంద్ర, సారంగధర, శకుంతల నాటకములను ప్రదర్శన యోగ్యములుగా రచించి, రిహార్సల్సు చేయించినారు. పెద్ద ప్రదర్శనము నకు వలయు పరికరములను సేకరించి, నాటకశాలను - అనగా ఒక పెద్దతాటాకులపాకను - నిర్మించిరి. చుట్టును లంబాడిపట్టలు కట్టిరి. మద్రాసునుండి తెరలు, రంగనాయకులు అను ఇరువురను రప్పించి పది పన్నెండు తెరలు వ్రాయించిరి. గాజుపూసలతో దుస్తులు కుట్టించిరి. 14 నెంబరు లైట్లుసిద్ధముచేసిరి. మేకప్‌నకు పసుపురంగు, సిందూరము, సుద్ద, నల్లమసి ఉపయోగించిరి. శ్రుతికొరకు చంకతిత్తి, తంబుర ఉపయుక్తములయ్యెను. మృదంగమును, తాళములను ఉపయోగించిరి. (ఇవి రంగస్థలముమీదనే సైడువింగులలో ఉండెడివి.)

ఈ క్రొత్త నాటక సమాజమునకు "శ్రీ శారదా మనోవినోదినీ సంగీత నాటక సభ" అను పేరు పెట్టిరి. సుబ్బదాసుగారు కూడ సారంగధరుడు, అర్జునుడు, దుష్యంతుడు, హరిశ్చంద్రుడు, కణ్వుడు మొదలగు వేషములను ధరించెడివారు. ఆంధ్ర నాటక పితామహ శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులుగారి నాటకములలో తెలుగుదేశమందు పాటలకు మోజుహెచ్చినది. అందుచే సుబ్బదాసుగారు కూడ పాటలు రచించి నేర్పినారు. సంగీతమందు వారంతరికున్న అభిమానము సమాజమునకు పెట్టుకొన్న పేరును బట్టియే వ్యక్తమగుచున్నది. సుబ్బదాసుగారు ప్రార్థనగీతము నొకదానిని రచించిరి. ప్రతి ప్రదర్శన ప్రారంభమందును దానినే విధిగా పాడెడివారు; నేటికిని సురభి సమాజములవారికి అందరకు అదియే ప్రార్థనగీతము — (విఘ్నేశ్వర స్తుతి - రూపకతాళము - కాఫీరాగము).

> "శ్రీశైలజాసుత, రజితపథరసాధన,
> మత్తేభవదన కాత్యాయనీనందన,
> సుబ్బదాస నమోస్తుతే త్వచ్చరణ పద్మముల్
> పరిపాలయ మాం సిరితో త్వమాశ్రయమ్.
> సత్కార్యధురీణ సంసత్కల్పావనీ.
> సుకవిసుత శ్రీ శారదామనోవినోదినీ"

పై ప్రదర్శనములు రక్తికట్టి, ప్రజల నెక్కువగా నాకర్షింపసాగెను. పిదప సురభిలో అనేక నాటకములు ప్రదర్శించి, విస్మృత సంచారము నకు బయలుదేరిరి. ప్రప్రథమముగా సురభినుండి రాయచోటి వెళ్ళినారు. అచ్చట ఒక నాటక సమాజమువారు గడ్డితో వేసిన ఒక నాటక శాలలో నాటకములాడుచుండెడివారు. సురభి వారు కూడ అందులోనే తమ నాటకములను ప్రదర్శించిరి. అచ్చట సురభివారు మొదటి సారిగా టికెట్టు పద్ధతిని మొదలుపెట్టిరి. ఆ రోజులలో ప్రదర్శనమునకు నందరూపాయలు వచ్చినచో అది చాలా "పెద్ద కలెక్షను" అన్నమాట! పై ముగ్గురి కుటుంబములలోను మొత్తము సుమారు 30 మంది ఉండెడివారు. వచ్చిన ఆదాయమును ముగ్గురును సమముగా పంచుకొనెడివారు. పంచుకొనుట అనునది మాటవరుసకే కాని మరల అందరును ఏకకుటుంబముగానే జీవించెడివారు; ఆ అన్నదమ్ముల కుటుంబముల మధ్యగల ఐకమత్యము, సామరస్యము అపూర్వమైనవని చెప్పుదురు.

*సురభివారి విశిష్టత :*

ఆ రోజులలో బళ్ళారి కృష్ణమాచార్యులుగారి నాటకములు, వారి ప్రదర్శనములు చాలా

ప్రసిద్ధిలో నుండెడివి. ఏదేని ఒక నాటకమును తమకు వ్రాసి ఇవ్వవలసినదిగా ఈ సురభివారు వారిని అర్థించినారు; కాని వారంగీకరించలేదు. చివరకు "నేనొక పాట ఇచ్చుచున్నాను; దానిని రాగతాళములకు సరిపోవునట్లు పాడి చూపించండి"ని వారాదేశించినారట. వీరట్లే సంతృప్తికరముగా పాడి చూపించినారు. అయినను ఏ కారణముచేతనో వారు వీరి కోర్కెను మన్నించలేదు. ఇంక సురభివారు పట్టుదలతో తమ నాటకములనే బహుళముగా ప్రదర్శింపసాగిరి.

కృష్ణమాచార్యులుగారి సమాజమునందు కాని, తెలుగుదేశములోని ఇతర సమాజములందుకాని నాడు స్త్రీ భూమికలనుగూడ పురుషులే నిర్వహించుచుండెడివారు. నాడు తెలుగు దేశమున కొన్ని కేవల "స్త్రీ నాటక సమాజములు" కూడ బయలుదేరినవి. అందు పురుష భూమికలను గూడ స్త్రీలే నిర్వహించుచుండెడివారు. పైవిధముగా కాక సురభి నాటక సమాజమందు స్త్రీ భూమికలను స్త్రీలు, పురుష భూమికలను పురుషులు వయోరూపగుణానుకూలముగా ధరించుచుండెడివారు. ఇందువలన సురభివారి ప్రదర్శనములు ఎక్కువ రక్తికట్టి, ప్రజలను విశేషముగా ఆకర్షించెడివి.

ప్రాచీన సంస్కృత నాటక ప్రస్తావనలందు కన్పట్టెడి ముఖ్యాంశములు రెండును–1. నటులందరును ఏక కుటుంబములోనివారు అగుట; 2. పురుషభూమికలను పురుషులు, స్త్రీ భూమికలను స్త్రీలు ధరించుట; వయోరూపగుణానుకూలముగా ధరించుట అనెడివి - సురభి నాటక సమాజమందే కలవు. తెలుగుదేశమున సంసార స్త్రీలచే నాటకములను వేయించిన ప్రథములు సురభివారే.

వనారససోదరులు ముప్పదిగను విజయముతో సురభి తిరిగివచ్చి, మరల బయలుదేరి కడప వెళ్ళినారు. ఈసారి వారు "సాంతడేరా"ను సిద్ధము చేసికొన్నారు. శ్రీ సుబ్బదాసుగారు నేర్పించిన నాటకములు కడపలో సరిపోలేదు. ఈసోదరులు పండితులగుటచేతను, కృష్ణప్పగారు కవికూడ అగుటచేతను స్వయముగా నాటకములను కల్పించుకొనసాగిరి (improvisations). అట్లు తయారైనవాటిలో సుభద్రాపరిణయము, రుక్మాంగద మొదలైనవి ముఖ్యములు. నలుగురూ కూర్చుండి ఆ యాసంభాషణములను కూర్చుకొనుట, రిహార్సల్సు చేయుట, ప్రదర్శించుట కూడ రోజులలో జరిగిపోయెడివి. ఆనాడు హరికథలు చెప్పుచు రాయలసీమజిల్లాలలో సంచారములు చేసిన శ్రీ బాలాజీదాసుగారు, శ్రీ నారాయణదాసుగారు వీరి నాటకములను చూచి, ఆనందించి తమకుతాముగా వేడ్కగా వీరికి కొన్ని కీర్తనలు నేర్పినారు. నేటికిని నారాయణదాసుగారి కీర్తనలు కొన్ని వీరి ప్రదర్శనములందు వినవచ్చును.

*సంచారములు*

పిమ్మట 1901లో సురభివారు పెద్ద సంచార క్రమముతో బయలుదేరినారు. రాయలసీమ గ్రామములలో చాలచోట్ల ప్రదర్శించి, సర్కారు జిల్లాలలో ప్రప్రథమముగా నరసరావుపేట లో ప్రదర్శన మిచ్చినారు. అచ్చటినుండి గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్టణము, విజయనగరము, బరంపురములలో వరుసగా ప్రదర్శనము లిచ్చినారు. బరంపురములో 3 నెలలపాటు ప్రదర్శనములు జరిగెను. ఈ ప్రయాణములలో కాంతామతి, భల్లాణరాజు చరిత్ర మొదలగు నాటకములను ఈ సోదరత్రయమే కల్పించుకొని ప్రదర్శించిరి.

నరసరావుపేటలో ప్రథమముగా వీరు రెండు వత్తుల గాస్‌లైట్లు చూచినారు. గుంటూరులో ఒక చిన్న హార్మోనియంపెట్టె కన్పించినది. వెంటనే వీరు మద్రాసునుండి ఆ రెండింటిని

తెప్పించుకొని, ఉపయోగింప నారంభించిరి. నాడు హార్మోనియం కేవలము శ్రుతికొరకే ఉపయుక్తమయ్యెడిది; హార్మోనియం వాయించుట నాటికింకను తెలుగుదేశములో ప్రారంభము కాలేదు.

రాజమండ్రిలో సురభివారి ప్రదర్శనములను శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు చూచి తమ స్వీయ చరిత్రలో ఈ క్రిందివిధముగా వ్రాసినారు: "1901 వర్షాకాలములో సురభినాటక సమాజమువారు రాజమండ్రి వచ్చి, మెరకవీధిలో ఒక దొడ్డిలో డేరా వేసి కొన్ని నాటకములాడిరి. ఆ సమాజములో స్త్రీలు స్త్రీపాత్రములను, ఒక వ్వుడు పురుషపాత్రములను గూడ ధరించి రూపకములను ప్రదర్శించుటచే, వారి నాటకములు జనుల నాకర్షించెను. మాపై గిట్టనివారు కొందరు సురభినాటకములను, మా నాటకములను పోల్చి పత్రికలలో దూషణ పూర్వకములైన విమర్శలను చేయజొచ్చిరి. మేము లెక్కచేయలేదు." (చిలకమర్తివారి 'స్వీయచరిత్ర' పుట. 172)

విశాఖపట్టణములో శ్రీ కలాభిలాషక సమాజ స్థాపకులగు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు (కవిగారు) పారిజాతాపహరణమును, బిల్హణీయమును రచించి వీరికిచ్చినారు. "ఇది 1901 సం॥ మొదలిడి, మూడు గంటలలోపున ప్రదర్శింపఁ దగినట్లు వ్రాసితి 1902 సం॥ మున సురభి నాటకులు కోర మఱికొంత కథ పెంచి, ముగించితి." అని పారిజాపహరణ పీఠికలోను; "ఇది, సురభినాటకులు కోరగా, 1902 సం॥న వ్రాసితి. నాటకానుకూలముగా ఉండుటకై ప్రబంధములోని కథ కొంత పెంచి, కొంత మార్చితి" అని బిల్హణీయ పీఠికలోను శ్రీ కవిగారు వ్రాసికొనినారు. (శ్రీ కలాభిలాషక నాటక సమాజములోని వాడగు తడకలూరి కుప్పస్వామి ఇచ్చిన మట్లననుసరించి శ్రీ కవిగారు పాటలనుకూడ రచించి ఇందు చేర్చినారు.)

బరంపురమునుండి తిరుగు ప్రయాణములో శ్రీకాకుళము, పాలకొండ, విశాఖపట్టణము, బందరు, బెజవాడ, వరంగల్, సికింద్రాబాదు లలో ప్రదర్శనములొసంగి 1903 చివర సురభికి తిరిగి వెళ్ళినారు.

శ్రీకాకుళములో వఝ్ఝుల చింతామణి శాస్త్రి గారు తమ చంద్రకాంత నాటకమును (ఇది పునహా, ధార్వాడవారలకు చాల ప్రీతికరమైనది) సురభివారికిచ్చివేసి, వీరిచే ప్రదర్శింపజేసినారు. వర్షాకాలములో బందరులో మూడు నెలలపాటు ప్రదర్శనములిచ్చిరి. అచ్చట కాంతామతి, చంద్రకాంత అనెడి నాటకములను రెండింటిని చెరి 22 సార్లు ప్రదర్శించినారట! కాంతామతిలో ముఖ్య ఆకర్షణము కృష్ణప్పగారి దత్తపుత్రులైన చిన్నరామయ్యగారి దొంగవేషము. దీనినిబట్టియే ఆ చిన్నరామయ్యగారికి "దొంగరాము"డను పేరుకూడ స్థిరమయ్యెను. ఇంక చంద్రకాంతలో ముఖ్య ఆకర్షణము మొదటి రామయ్యగారి మనుమరాలు (లక్ష్మమ్మగారికుమార్తె) అయిన అంజనమ్మ 'చంద్రకాంత' వేషము చిన్న రామయ్యగారు, అంజనమ్మ చాల అద్భుతముగా నటించెడివారట.

బందరులో సురభివారి ప్రదర్శనముల ప్రభావమును గూర్చి ఒక పురవాసి 18-6-1903 తేదీ కృష్ణాపత్రికలో ఒక సంపాదకలేఖను క్రింది విధముగా ప్రకటించెను—"కృష్ణాపత్రికాధిపతులకు, అయ్యలారా! మన పట్టణమున కొందరు సురభి వాసన తగిలి యున్మత్తులగుచున్నారని తెలియజేయ మిక్కిలి చింతిల్లు చున్నాను. ఇది ఎట్టి వాసనయో గాని ముదిమి చెందినవారిని సహా యౌవనులని భ్రమింపజేయుచున్నది. ఎన్నడు నాటకములు వీక్షించ నపేక్షలేనివారికి కూడ ప్రతిరోజును నాటకములేదను చింతకలుగజేయు చున్నది. మరికొందరు యౌవనపురుషులు సురభి సామాజికులలో చేర ప్రయత్నించుచున్నారట.

ఒకవేళ సురభివారు ఎన్నడైన వారి పూర్వపు నాటకములాడవలసివచ్చిన మీరు బొమ్మల దుమ్ము దులపవలసి వచ్చునేమోయని భయపడుచున్నాను—బందరు పురవాసి.''

బందరులో ఉండగానే అన్నదమ్ములు మువ్వురిలో కొంత అభిప్రాయభేదము పొడసూపినది. సురభివారు తామింకొక సమాజములో చేరరు; ఇంకొక సమాజమువారిని తమ సమాజములో చేర్చుకొనరు. అయినను తక్కినవారి మీదికోపములో పెద్దరామయ్యగారు బందరు గొడుగుపేట కంపెనీవారితో కలిసి కొన్ని నాటకములను ప్రదర్శించినారు. పెద్దరామయ్యగారితో పాటు పాపాబాయికూడ గొడుగుపేట కంపెనీలో వేషములు వేసెను. తక్కిన సురభివారందరును అయ్యంకివారి హాలులో నాటకములు ప్రదర్శించిరి. మొత్తమునకు రామయ్యగారు తామనుకొన్న విజయము నేమీ సాధించలేక పోయినారు. అంతట పాపాబాయితో కలిసి తిరిగి వచ్చి అన్నగార్లతో కలిసిపోయి బెజవాడ ప్రయాణమునకు సిద్ధమైనారు. అసలు ఆ అన్నదమ్ముల అనురాగము, అన్యోన్యత చాలా విశిష్టమైనది. ఏవో అల్ప అభిప్రాయభేదములు వచ్చినను వారలు వెంటనే సర్దుకొని పోగల్గినారు.

శ్రీ కోటయ్య దేవర :

బందరులో శ్రీ గరికిపర్తి కోటయ్యదేవర అనెడి గొప్ప కర్ణాట సంగీతవిద్వాంసుడు సురభి నాటకములను చూచుట తటస్థించెను. అసలు అప్పటికి సురభివారి సంగీతము తోలుబొమ్మలాటల సంగీతపుకత్తు; ఎంత అభివృద్ధిని సాధించినను ఆ వాసన పోలేదు. కోటయ్యదేవరగారి సంగీతముచే వీరాకర్షింపబడిరి. ఆయనకును వీరియందభిమానము కలిగెను. అంతట ముఖ్యముగా కృష్ణప్పగారి కుమారుడు ఆంజనేయులను (చిన్న అంజనప్పను), వెంకటప్పగారి కుమారుడైన హనుమంతరావును, పాపాబాయిగారి కుమారుడైన అవేటి పుల్లయ్యను, గోవిందప్ప కుమార్తె అయిన అంజనమ్మను, అవేటి వేంకటస్వామిగారి పుత్రికయగు బొజ్జాబాయిని, మొదట రామయ్యగారి కుమారుడు పెద్దఅంజనప్పను, కుమార్తె పెద్దఅంజనమ్మను, ఇంకను మరికొంతమందిని కోటయ్యదేవరగారియొద్ద సంగీతాభ్యాసమునకై విడిచి వెళ్ళిరి. 4 లేదా 5 సంవత్సరములపాటు వీరందరును బందరులో కర్ణాట సంగీతమును అభ్యసించిరి. హనుమంతరావు ఫిడేలును, ఆంజనేయులు హార్మోనియమును సాధనముచేసి నిపుణులైరి.

సికిందరాబాదులో కూడ వీరి ప్రదర్శనములు చాల రక్తికట్టినవి. అచ్చట ఒక బహిరంగ సభలో శ్రీ ధర్మవరం గోపాలాచార్యులుగారు కృష్ణప్ప భార్య వెంకూబాయికి “జంఝూటి వెంకూబాయి” అను బిరుదు నిచ్చి సత్కరించిరి. ఆమె జంఝూటి రాగమును ఎంతసేపైనను అలుపు లేకుండా, విసుగు కలిగించకుండా మనోహరముగా పాడెడిదట.

సికిందరాబాదునుండి సురభి తిరిగివచ్చిన తరువాత కొంత కాలము విశ్రాంతి తీసికొని పిమ్మట మద్రాసు, మైసూరు మొదలగు ప్రదేశములలో విజయవంతముగా ప్రదర్శనములిచ్చిరి. 1910 ప్రాంతముల మద్రాసులో విక్టోరియా పబ్లిక్ హాలులో నాటకములను ప్రదర్శించిన సమయములో హార్మోనియం మొదలగు వాద్యములను ప్రక్కతెరలలో కాక ముందుభాగమున “పిట్”లో పెట్టినట్లుగా చెప్పుదురు. ఇది తెలుగుదేశమున నాటి కింకనూ ప్రచారమునందు లేదు. 1. స్త్రీసాహసము, 2. జగన్మోహన, 3. అభినవమోహన, 4. కాంతామతి, 5. సుభద్రాపరిణయము, 6. లంకాదహనము, 7. చంద్రకాంత, 8. కీచకవధ అనునవి ఆనాడు సురభివారి ప్రసిద్ధనాటకములు.

అన్నదమ్ములు విడివడుట :

క్రమముగా ముగ్గురు సోదరుల కుటుంబములును పెరిగినవి. అందుచే మద్రాసు మొదలగు ప్రదేశములందు సంచారము ముగించుకొని వచ్చిన తరువాత 1910 ప్రాంతముల అన్నదమ్ములు ముగ్గురును సమ్మతితో విడిపోయి వేర్వేరు కంపెనీలు పెట్టుకొనినారు — అయినను కష్ట సుఖములలో పరస్పరము కలిసిమెలసి ఉండవలెనని ఏర్పాటుకూడ చేసికొనినారు. ముగ్గురును మూడు దిశలుగా కూడ సంచారము చేయుటకు కూడ అప్పటికే నిర్ణయించుకొనినారట — కృష్ణయ్యగారు మైసూరు, రాయలసీమ జిల్లాలు; వెంకయ్యగారు తెలంగాణా; పెద్దరామయ్యగారు సర్కారు జిల్లాలు.

సురభివారి కట్టుబాట్లు:

క్రీ. శ. 1914–15 ప్రాంతముల పెద్దరామయ్యగారి కుటుంబము బర్మా వెళ్ళి రంగూన్, మాండలే మొదలగు ప్రదేశములందు విజయవంతముగా ప్రదర్శనము లొసంగి గొప్ప సన్మానమును పొందిరి; అప్పుడు వీరితో పాపాబాయి, చిన్నరామయ్య మొదలగువారుకూడ బర్మా వెళ్ళి వచ్చినారు.

ఇచ్చట వీరి కుటుంబములనుగూర్చియు, నిత్య జీవితమునుగూర్చియు కొంత వివరించుట న్యాయము. వీరిలో బహుభార్యాత్వము సర్వసాధారణము. మొదట భార్యవలన సంతానము లేకపోవుటచేతనుగాని, నాటక ప్రదర్శనములకు స్త్రీలు అవసరమై కళాదృష్టితోకాని వీరు ఒకటిని మించి వివాహములు చేసికొనెడివారు. ఈ వివాహములనుగూర్చి ముందు వివరింతును.

సురభివారందరును యజ్ఞోపవీతమును ధరించెడివారు. అక్షతలబొట్లు పెట్టెడివారు. శైవమతస్థులు. అంబపూజ చేసెడివారు. వీరి మూలపీఠము ధార్వాడలోని విఠోభాపీఠము. వీరికి అసలు ఇలవేలుపు ఆంజనేయస్వామి. అందుచేతనే ఎక్కువమంది పేర్లలో ఆ చిహ్నము సాధారణముగా కన్పట్టుచుండును.

సింధే, అవేట్, అటోక్, రేకాందార్ అను ఇంటిపేర్లు గలవారు అన్నదమ్ముల వరుసవారు. వీరి అందరకును వనారసవారితో బంధుత్వము కలదు. నేటికిని వీరిలో వీరే వివాహములు చేసుకొనుచుందురు. ఈ ఐదు ఇళ్ళపేర్లును మహారాష్ట్రమందలి గ్రామనామములు. వీరందరును మహారాష్ట్రదేశమునుండి వచ్చి తెలుగుదేశమందు స్థిరపడినవారే. ఆదిలో వీరి భాషకూడ మరాఠీ భాషయే. శివాజీ కాలమునుండియు ఆంధ్రులమీద మహారాష్ట్ర ప్రభావము కలదు. ఆనాడు తెలుగుబ్రాహ్మణులు ఇక్కడనుండి వెళ్ళి మహారాష్ట్రమందు స్థిరపడి ఉన్నతపదవుల నాక్రమించినారు. పింగళి మోరోపంతు మొదలగువా రిట్టివారే. అట్లే మహారాష్ట్రమునుండి వచ్చి ఇచ్చట స్థిరపడినవారిలో సైకుటుంబములవారు ముఖ్యులు. పరిశీలించి చూచినచో వీరిలో నేటికిని మరాఠీ పోకడలు కానరాగలవు.

భూమికా ధారణము :

పిల్లలకు చిన్నతనమునుండియు సంగీతమును, సాహిత్యమును విధిగా చెప్పించెడివారు. మొదటి రోజులలో వీరికి భాషాజ్ఞానము తక్కువగుటచే తక్కిన సమాజమువారు కొంచెము చిన్నచూపు చూచెడివారట. అందుచే వీరు ఆ విషయములో ఎక్కువగా శ్రద్ధవహించెడివారు. ఇంక సంగీత విషయమునుగూర్చి వేరే చెప్పనక్కరలేదు. హార్మోనియమును స్త్రీలే ఎక్కువగా వాయించెడివారు. తరువాతి కాలములో వారు "త్రొక్కుడుహార్మోనియము"నుకూడ రెండుచేతులతో వాయించెడివారు. వేషధారణమునుగూర్చి లోగడ చెప్పియేయున్నాను. పురుషులు పురుష

భూమికలను, స్త్రీలు స్త్రీభూమికలను, బాలబాలికలు బాలబాలికాభూమికలను వృద్ధులు వృద్ధభూమికలను వయోరూపగుణానుసారముగా ధరించెడివారు. ఇది నాట్యశాస్త్రమునకు అనుకూలమైన చక్కని పద్ధతి. ఇంక భార్యాభర్తలే నాయికా-నాయకభూమికలను ధరించవలె ననెడి నియమము లేదు. రంగస్థలము మీద నున్నప్పుడు తప్ప, తక్కిన కాలములందు స్త్రీలు ఘోషాపద్ధతినే అనుసరించెడివారు. స్త్రీలుసాధారణముగా [illegible]; ఇంటి పనులు వారే చక్కబెట్టుకొనెడివారు; గృహకృత్యములనెల్ల స్వయముగా చేసికొనెడివారు; వారికి అలసట అనునదియే ఉండెడిదికాదు. రాత్రి అగునప్పటికి మరల వేషధారణమునకు సిద్ధము! స్త్రీలు స్త్రీభూమికలనేకాక పురుషభూమికలను కూడ ధరించెడివారు. గోవిందప్పగారి భార్య నాయికాభూమికను ధరింపగా పెద్దరామయ్యగారి భార్య నాయకభూమికను ధరించెడివారు. ఒక గర్భవతి హరిశ్చంద్ర భూమికను ధరించి చక్కగా నిర్వహించుట నేను చిన్నప్పుడు చూచియున్నాను. ఇట్టివి ఆవశ్యకతను బట్టియు ఆకర్షణముకొరకునుకూడ జరుగుచుండెడివి. పురుషులు మాత్రము స్త్రీభూమికల నెప్పుడును ధరించినట్లు కన్పట్టదు. నిజమున కట్టి ఆవశ్యకతయును లేదు.

ఇంకొక ముఖ్యవిషయము. ఫలాని వారికి ఫలాని భూమిక అని ఖచ్చితముగా నిర్దేశింపబడుటయును, వారు దానినిమాత్రమే సాధనము చేయుటయును ఎన్నడును లేదు. అందరును అవసరమునుబట్టి ఏ భూమికను ధరించుటకైనను సిద్ధముగా నుండవలెను. అనారోగ్య సమయములలో, ప్రసవసమయములలో పురుషులుగాని స్త్రీలుగాని వేషధారణము చేయజాలనప్పుడు లోటు కన్పించకుండ, సమర్థముగా ఆ భూమికలను నిర్వహించుట కింకొకరు ఎల్లప్పుడును సిద్ధముగా నుండెడివారు. సోమరితనమును వారెన్నడును సహించెడివారు కారు.

మేకప్ విషయములో చిన్నపిల్లలకు కూడ ఇంకొకరి సహాయ్య మక్కరలేదు. నిర్దిష్టసమయమునకు ముందే ఎవరి మేకప్ వారు చేసికొని సిద్ధముగా ఉందురు. వారి సుశిక్షణ అట్టిది. ఇంక వీరియందలి ఐకమత్యము అపూర్వమైనది. అల్పభేదము లప్పుడప్పు డంకురించినను వెంటనే సర్దుకొనిపోయెడివారు. రాబడి విషయములో ఎట్టి తగవును లేకుండుటకై "షేర్ల" పద్ధతిని పెట్టుకొనినారు. సమాజమునకు ఎవరిని 'పెద్ద' అని అనుకుందురో వారి అడుగుజాడలలో తక్కినవారందరు విధిగా నడిచెడివారు.

"సురభి నాటకసమాజ" మనగా స్వయం సమగ్రమైన నాట్యశాస్త్రలక్షణవిహితమైన నాటక సమాజమునకు ఉదాహరణ మని చెప్పుటలో అతిశయోక్తి లేదు. తరువాతి కాలములో, కంట్రాక్టు నాటకముల రోజులలో నాటక కళను స్వచ్ఛముగా నిలిపినది కొంతవరకు వీరే అని చెప్పవచ్చును.

ఆంధ్రనాటక కళోద్ధారక

శ్రీ వనారస గోవిందరావు:

1910 ప్రాంతముల వనారస సోదరత్రయము విడిపోయినట్లు చెప్పియున్నాను. ఈ ముగ్గుర సంతానములోను బహు ప్రసిద్ధికన్నది గోవిందప్ప అనబడెడి గోవిందరావుగారు; వీరు వెంకోజీరావుగారి దత్తులని వెనుక చెప్పియున్నాను. మరొక ముఖ్యవిషయము గమనార్హము. వెంకోజీగారు గోవిందరావుగారితో చెన్నయ్యగారినికూడ పెంచుకొనిరి. చెన్నయ్యగారు మంచి చిత్రలేఖకులు. కుంచ బట్టి రంగులు కలిపి యెన్నో సీనులు - సెట్టింగులు అనతికాలంలో శిల్పింపగలవారు. వారి భార్య దుర్గమ్మగారు రాణీపాత్రలు ధరించెడిది. వారి పుత్రుడే పెయింటర్ హనుమంతరావుగారు. వీరు ప్రసిద్ధ

చిత్రకారులు. ఈనాడు పెద్ద సురభి కంపెనీలన్నిటికి నాటకములనుబట్టి సెట్టింగులూ, సీనరీలూ చిత్రించి ప్రేక్షకుల ప్రశంస లందుచున్నారు. శ్రీ హనుమంతరావుగారి పుత్రులు చిరంజీవి నాగేశ్వరరావు, కేశవరావుగార్లు కూడ తండ్రితో సరిసమానముగు ప్రతిభ గలవారు. ఈ వనారసవారి అసలు గోత్రము తెలియకపోవుటచే పెద్దల అనుమతితో "కాశ్యప" గోత్రమును స్వీకరించినారు; చిన్నప్పటినుండియు బ్రాహ్మణభక్తియు, దైవభీతియు కలవారు. మంచిచెడ్డలయెడ చక్కని వివేచనాశక్తి యున్నది. ప్రతి పనికి సుముహూర్త నిర్ణయము చేయించి మరీ ఆరంభించెడివారు. వీరు మంచి ఆంజనేయభక్తులు. కడపజిల్లా వేంపల్లి దగ్గర ఉన్న 'గండి' లోని ఆంజనేయస్వామి వీరి ఉపాసనాదైవము. ఉపాసనాబలముతో వీరు వ్యాఘ్రములనుకూడ కదిల్చెడివారట. శ్రీరామనవమి ఉత్సవములను తొమ్మిదిరోజులు ఉపవాసము ఉండి భక్తితో చేయించెడివారట. ఎక్కడైనా ఆంజనేయస్వామిగుడి కన్పించినచో ఏదో కొంత సమర్పించకుండ వచ్చెడివారు కారట. ప్రతి శివరాత్రికి కోటప్పకొండలో సంతర్పణము చేయుచుండెడివారట. సోదరత్రయము సికింద్రాబాదు నుండి తిరిగివచ్చి, వరల సంచారములకు బయలుదేరినప్పటినుండియు గోవిందరావుగారు ప్రాముఖ్యమునకు వచ్చిరి. ఏలూరు ముకామలో 1908 లో గోవిందరావుగారు గంగిరెడ్డిగారి రెండవ కుమార్తె యగు లక్ష్మమ్మను (లక్ష్మి బాయిని) వివాహము చేసికొనిరి. మొదటిభార్య యగు సుబ్బమ్మగారు అంత గాయకురాలు కాదు. నాటకములందు గోవిందరావుగారు ప్రముఖ భూమికలను ధరించుచుండెడివారు; తన ప్రక్కను నాయికగా వేషములు వేయుటకు యింకొకవ్యక్తి ముఖ్యావసరమయ్యెను. అందుచే కళాదృష్టితో గోవిందరావుగారు లక్ష్మమ్మను రెండవభార్యగా స్వీకరించినారు.

1910 లో కుటుంబములు విడివడగానే గోవిందరావుగారి బాధ్యత ఎక్కువైనది. ఎవ్వరి సహాయమును లేకయే తన కుటుంబముతోనే నాటకములను సమర్థముగా ప్రదర్శింపసాగిరి. ఇట్లు ఆంధ్రదేశమున తన ప్రదర్శనములతో విజయయాత్ర చేయుచు 1917 సంవత్సరమున డిసెంబరు నెలలో భీమవరము చేరిరి. ఒక శనివారమునాడు "లంకాదహనము"ను ప్రదర్శింపవలసివచ్చెను. గోవిందరావుగారు అసలే ఆంజనేయస్వామి భక్తులు; శనివారమునాడు క్రొత్త బట్టలను ధరింపరాదను నియమము వారికున్నది. కాని ఆనాడు హనుమంతుని వేషముకొరకు వారు



శ్రీ గోవిందరావుగారి "బొంగి" వేషము.

ప్రత్యేకముగా కుట్టించిన క్రొత్త బొచ్చుదుస్తులు తప్పనిసరిగా ధరించినారు. ప్రదర్శన సమయములో వారికి ఆంజనేయస్వామి పూనెను. ఆ సమయములోనే దుస్తులు అంటుకొన్నవి. కాని

వారు దానిని గ్రహించకయే "రామ, రామ" అనుచు తన్మయత్వముతో భజన చేయుచుండిరి. మంటలు వచ్చుచున్నను, అది అంతయును నటనయే అని ఇతరులు భావించిరి. దుస్తులు అంటుకున్నట్లు భార్యలు గుర్తించునప్పటికే గోవిందరావుగారి శరీరము చాలావరకు కాలినది. అతి కష్టముమీద మంట ఆర్పబడెను. అసలు గోవిందరావుగారు బ్రతకడనుకొనిరి. కుడిచేయి బాగుగా దెబ్బతిన్నది. కలం పట్టుకొనుటకు వీలైతే జన్మాంతము వరకును "శనివారాలు ఉంటా" నని కోటప్పకొండ కోటీశ్వరస్వామికి మొక్కుకొన్నారట.

ఇది జరుగునాటికి లక్ష్మమ్మ గర్భవతి. 1918 ఫిబ్రవరి మాసాంతమందు గోవిందరావుగారు సకుటుంబముగా తెనాలి నుండి అత్తిలి రాదారి బోటులో ప్రయాణము చేయుచుండగా 1-3-1918 తేదీన లక్ష్మమ్మగారు ప్రసవించి ఆడపిల్లను కనెను. ఆ ఆడపిల్లయే నేటి ప్రసిద్ధనటి శ్రీమతి అవేటి పూర్ణిమ. అప్పటికింకను గోవిందరావుగారికి నయము కాలేదు. నయమైన తరువాతకూడ గోవిందరావుగారు వేషధారణమును మానివేసినారు. కాని ప్రదర్శనములందు విశ్రాంతి సమయములలో హాస్యమును చెప్పుచుండెడివారు. కాంతామతిలో మాత్రము 'దొంగ' వేషమును ధరించెడివారు. కరపత్రములలో చివర "కంపెనీ ప్రొప్రయిటరు గారిచే దొంగవేషము ధరింపబడును" అని ప్రకటించెడివారట. ఆ వారి వేషము ఎక్కువ ఆకర్షణీయముగా నుండుటచే దానిని చూచుటకే పలువురు వచ్చెడివారట.

1919 వరకును గోవిందరావుగారికి స్థిరనివాసమనేడిది లేదు. ఆ సమయములో ఏలూరు దగ్గర ఉన్న పోలసానిపల్లి అగ్రహారము వారిని ఆకర్షించినది. ఆ సంవత్సరమే సకుటుంబముగా, తల్లిదండ్రులతోసహా పోలసానిపల్లి చేరి ఒక పెద్ద మామిడితోట ప్రక్కను ఇల్లు కట్టుకొని అచ్చటనే స్థిరపడినారు. అచ్చట వీరనేక ధర్మకార్యములు చేసినారు. ఆ అగ్రహారమందలి శివాలయమున పూజాపురస్కారములకు పెక్కు వీల్లు కలిగించిరి. ఆ అగ్రహారమున బాలబాలికల విద్యావ్యాప్తికొరకు ఒక పాఠశాలను స్థాపించిరి. మంచినీటికొరకు ప్రజలెంతయో ఇబ్బంది పడుచుండగా 2, 3 బావులను త్రవ్వించి ప్రజలకెంతయో మేలు చేకూర్చినారు. ఆ అగ్రహారము ద్వారకాతిరుమలకు (చిన్నతిరుపతి) పోవు మార్గమందున్నది. యాత్రికుల సౌకర్యార్థమై ఒక సత్రమును నిర్మింప పూనుకట్టిరి కాని, అది నెరవేరినట్లు లేదు. సంపూర్ణముగా ధనసహాయ్యము కావించి పెక్కుమంది పేద విద్యార్థులను చదివించిరి. అనేక గ్రంథాలయములకు విరాళముల నొసంగిరి. పెక్కు స్థలములలో దేవాలయముల పునరుద్ధారణమునకు తోడ్పడిరి. పలువురి పేదలకు తమ సొంతఖర్చులతో వివాహము చేయించిరి. పెక్కుచోట్ల అనేక సంస్థలకు విరాళము లొసంగిరి. ఆంధ్రదేశమునందలి పలువురు ప్రముఖులను రప్పించి సన్మానించిరి. నాటకరంగమునుండి విరమించి, పేదస్థితిలో నున్న చాలమంది నటులకు ధనసహాయ్యము కావించిరి. యుద్ధసమయములో ప్రభుత్వమునకు విరాళము లొసంగుటయేకాక భారత దేశోద్ధారణమునకై పాటుపడు కుటుంబముల పోషణార్థమై పెక్కుసార్లు ధనసహాయ్యము కావించిరి. "తన సమాజమును నాట్యకళాశిక్షణ పాఠశాలగా నొనర్చి, తాను నాట్యాచార్యుడుగా వర్తించెడివా" డని ప్రముఖుల ప్రశంసల నందుకొనిరి.

చిన్నరామయ్యగారు :

స్వయముగా ప్రముఖ పాత్రలను ధరించుట మానివేసినను గోవిందరావుగారు తాను పైనుండి పెత్తనముచేయుచు తన సమాజమువారిచే నిర్విరామముగా పని చేయించినారు. 1919 నుండి

కృష్ణాజీరావుగారి దత్తపుత్రులును, నాట్యవిద్యావిచక్షణులును, సౌమ్య ప్రవర్తనులును, చిత్రలేఖనదక్షులును, 'నాటకకళావిశారద' బిరుదాంకితులును అయిన చిన్నరామయ్యగారు గోవిందరావుగారికి తోడుగా నిలిచినారు. ఈ చిన్నరామయ్యగారు ప్రధాన భూమికలను ధరించుచు స్వీయప్రతిభావిశేషములచే సమాజము నత్యున్నతస్థితికి గొని తెచ్చిరి. వీరును, గోవిందరావుగారును కలిసి శ్రీ మల్లాది విశ్వనాథ కవిరాజుగారిచేతను, శ్రీ చక్రావధానుల మాణిక్యశర్మగారిచేతను, శ్రీ పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేతను ప్రత్యేకముగా నాటకములు వ్రాయించి ప్రదర్శనములిచ్చినారు. శ్రీ బులుసు సీతారామశాస్త్రి (బొబ్బిలి)గారిచే "దశావతారములు" వ్రాయించి, ప్రప్రథమముగా ప్రదర్శించినారు చిన్నరామయ్యగారే. కవిరాజుగారి "వసంతసేన"ను చిన్నరామయ్యగారు ప్రత్యేక శిక్షణ యిచ్చి ప్రదర్శించినారు. వీరికి రాముడు, యముడు, శకారుడు, ప్రహరిసేనుడు, దొంగ (కాంతామతిలో) అనునవి అభిమాన భూమికలు. వీరు చిన్నప్పుడు సత్యభామ, మాతంగకన్య, కలహాకంఠి, మొదలగు వేషములను కూడ ధరించినారట. రామయ్యగారు ఆజానుబాహువులు; వారిది మంచి నిండైన విగ్రహము.



చిన్నరామయ్యగారు

1920 లో రామయ్యగారి సలహాతో గోవిందరావుగారు టిన్ రేకుల డేరాను సిద్ధము చేసికొనినారు; 1924 లో డైనమో తెచ్చుకొనినారు. సురభివారి పైడేరాను వేయుటకు మూడు రోజులు పట్టగలదు. తీసివేయుటకు ఒకపూట పట్టును. 1929 ప్రాంతములలో చిన్నరామయ్యగారు గోవిందరావు కంపెనీనుండి విడిపోయినారు.



ప్రహరిసేనుడు
చిన్నరామయ్యగారు

శ్రీ గోవిందరావుగారిచే బాల్యమునుండియు పోషింపబడి వారి కెక్కువ విశ్వాస పాత్రులుగా ఉన్న శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్యగారు 1927 ప్రాంతముల నుండియు గోవిందరావుగారి సంఘ

ములకు కార్యదర్శులై వారికి కుడిభుజముగా పని చేయుచొచ్చిరి. 1929 తరువాత గోవిందరావు గారు "శ్రీ శారదా మనోవినోదినీ సంగీత నాటక సమాజము" అనెడి పూర్వపు పేరును మార్చి వేసి "శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి" అను పేరు పెట్టుకొనిరి.

### ఆంధ్ర నాటక కళాపరిషత్తు :

1929 వ సంవత్సరము ఆంధ్ర నాటకరంగ చరిత్రలో సువర్ణ ఘట్టము. ఆ సంవత్సరము జూన్ నెలలో తెనాలిపురమునందు ప్రథమాంధ్ర నాటక కళాపరిషత్తును సమావేశపరచుటలో గోవిందరావుగారు అతి ప్రధానమైన పాత్రను వహించినారు. గోవిందరావుగారు తెలుగు నాటక రంగమునకు చేసిన సేవను గుర్తించి మొదటి పరిషత్తువారే వారికి "ఆంధ్రనాటకకళోద్ధారక" అనెడి బిరుదు నొసంగి సన్మానించిరి.

1928-30 ప్రాంతములు గోవిందరావుగారు తమ సమాజముతో రంగూన్ వెళ్ళి అచ్చట పెక్కు నాటకములను ప్రదర్శించి అచ్చటి ప్రజలచే బహుళ సన్మానములను గాంచి వచ్చిరి. అచ్చటినుండి విజయముతో తిరిగివచ్చిన తరువాత 1931-33 ప్రాంతముల నైజాము రాష్ట్రములో సంచారము మొనర్చిరి. అప్పుడు శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు కూడ వీరితో కలిసి తెలంగాణా జిల్లాలలో సంచారము మొనర్చియున్నారు. 1933 లో తృతీయాంధ్రనాటక కళాపరిషత్తు మద్రాసులో జరిగినప్పుడు సకలమైన ఖర్చులన్నియును ఆహ్వానసంఘముతరఫున గోవిందరావుగారే భరించినారట. ఆంధ్ర నాట్యకళాభిమానులందరును ఏలూరులో 20—12—1937 తేదీన గోవిందరావుగారి సప్తతిమహోత్సవమును మహా వైభవముతో నిర్వహించి ఏనుగుపై నూరేగించి గొప్పగా సన్మానించిరి. ఆనాడు తెలుగు దేశములోని కవి పండితులెల్లరును గోవిందరావుగారిని ప్రశంసించియున్నారు. ఆ ప్రశంసలన్నియు ఒక గ్రంథరూపమున ప్రకటింపబడియున్నవి. ఆ సందర్భముననే గోవిందరావుగారి శిలాప్రతిమ ఏలూరులో హిందూ యువజనసంఘం ఆవరణములో ప్రతిష్ఠింపబడినది. సుప్రసిద్ధమైన "గుబ్బి వీరన్న కంపెనీ" ప్రొప్రయిటరు శ్రీ జి. హెచ్. వీరన్నగారు ఈ శిలా విగ్రహమును ఆవిష్కరించినారు. ఆ నాడు శ్రీ మల్లాది విశ్వనాథకవిరాజుగారు "కాళిదాసు" నాటకమును గోవిందరావుగారికి అంకితమిచ్చిరి.

### కుటుంబ చరిత్రలు - సమాజములు :

ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ధ్రువతార అయిన శ్రీ వనారస గోవిందరావుగారు 17—12—1953 తేదీన స్వర్గస్థులైనారు. నేడు పోలసానపల్లిలో గోవిందరావుగారి భార్య సుబ్బమ్మగారు, చిన్నరామయ్యగారి కుమారులు నివసించుచున్నారు.

ఇంతవరకును వెంకోజీరావుగారి దత్తపుత్రులగు శ్రీ గోవిందరావుగారిని గూర్చి కొంత విపులముగా వివరించియున్నాను. ఇప్పుడింక తక్కిన వారి కుటుంబములను గూర్చి కూడ కొంత సంగ్రహముగా వివరింతును. సంజీవరావుగారి పెద్దభార్య పుత్రులు ఆరుగురిని ఇంతకుముందు తెలిపియున్నాను. వారినిగూర్చియే ఇప్పుడు వరుసగా వివరింతును.

### మొదటి రామయ్యగారి కుటుంబము :

ఆరుగురిలోను పెద్దవారు రామయ్యగారు. వీరికి వజ్రరావు, వీరయ్య, హనుమంతరావు, రంగప్ప అను నలుగురు కుమారులును, రామానుజలమ్మ అనెడి కుమార్తెయును కలరు. రామానుజలమ్మ అందరికంటె పెద్దది. ఈమె గంగిరెడ్డిగారి కోడలు; అవేటి వెంకటస్వామిగారి భార్య. వజ్రరావుగారు కొంతకాలము ఒక నాటక సమా

జమును నడపెను. వజ్రరావుగారు 1955 లో చనిపోయిరి. తరువాత వారి కుమారుడు వి. రామయ్య (రామన్న)గారు శ్రీరమా సత్యనారాయణ నాట్యమండలి అను పేరుతో ఆ సమాజమును నడుపుచున్నారు. రామయ్యగారు విలన్ భూమికలను ధరించుచుందురు. వారి చెల్లెలు సుబ్బమ్మగారు నాయికాభూమికలను, ఆమె భర్త రేకందార్ వేంకటేశ్వరరావుగారు నాయకభూమికలను ధరించుచుందురు. ప్రస్తుతము ఈ సమాజము తెలంగాణాలో ప్రదర్శనము లిచ్చుచున్నది.

చిన్న రామయ్యగారిని గూర్చి ఇదివరకే కొంత చెప్పియున్నాను. వీరు గోవిందరావుగారితో కలిసి కొంతకాలము, విడిగా కొంతకాలము, మొత్తము మీద 1916 నుండి 1940 వరకును నాటకములాడి విరమించిరి. 1948 లో అవేటి శ్రీకృష్ణబాబూరావు అనువారు చిన్న రామయ్యగారి పరికరము లన్నియును కొని వేసినారు. కాని, తరువాత చిన్న రామయ్యగారి రెండవకుమారుడు అబ్బాజీరావు గారు వేరే కంపెనీ పెట్టుకొని 1948 నుండియు నడుపుచున్నారు. దీని పేరు "శ్రీ శారదా మనో వినోదిని నాట్యసభ". ఇప్పుడు పేరు మరింత సంక్షిప్తమైనదట. ఈ సమాజము ప్రస్తుతము శ్రీకాకుళం జిల్లాలో పర్యటించుచున్నది. కంపెనీ ప్రొప్రయిటరు శ్రీ అబ్బాజీరావు నాయకభూమికలను, వారి భార్య సీతామహాలక్ష్మమ్మ నాయికా భూమికలను ధరించుచుందురు. వారి కుమారుడు షణ్ముఖరావు హాస్యనటుడు.

చిన్న రామయ్యగారు తమ చివరిదశలో హైదరాబాదులో శ్రీ అవేటి నాగేశ్వరరావు గారితో కలిసియుండెడివారు. నేను వారిని కలిసికొని సురభివారిని గూర్చి అనేక విషయములు తెలిసికొనినాను. (వీరు క్రిందటి వేసవిలోనే చనిపోయినారు. చనిపోవు నాటికి సురభివారిలో వారే వయోవృద్ధులు.)

కృష్ణాజీరావుగారి కుమార్తె కమలాబాయి సుప్రసిద్ధ సినిమానటి సురభి కమలాబాయి. ఈమె భర్త సింధే సంజీవరావుగారు. వీరు నిస్సంతులు.



వెంకయ్య

*వెంకోజీరావుగారి కుటుంబము :*

ఐదవ వారైన వెంకోజీరావు (వెంకయ్య) గారు మొదట్లో దుష్యంతుడు మొదలగు భూమికలను ధరించెడివారు. వీరు క్షయవ్యాధితో మదనపల్లి వెళ్ళి అచ్చటనే 1924లో చనిపోయినారు. వెంకోజీరావుగారికి నలుగురు భార్యలు. మొదటిభార్య చెన్నమ్మగారికి హనుమంతరావు అను కుమారుడు, అమ్మాయమ్మ అను కుమార్తె; రెండవభార్య సుంకమ్మగారికి అంజమ్మ అను కుమార్తె కలిగిరి. మూడవభార్య చిన్నసుబ్బమ్మ గారికిని, నాలుగవభార్య రామానుజులమ్మగారి

కిని సంతానం లేదు. వెంకోజీరావుగారు చనిపోయిన తరువాత చిన్న సుబ్బమ్మగారు (గంగయ్యగారి 2వ కుమార్తె) 1924 నుండి 1940 వరకును ప్రత్యేకముగా ఒక సమాజమును నడిపినారు. ఈమె రాణివేషములకు చాల ప్రసిద్ధి. సుంకమ్మగారు మొదట గోవిందరావుగారిని పెంచుకొనిరి; పిమ్మట అంజనమ్మ జనించెను. హనుమంతరావుగారినే "ఫిడేలు హనుమంతరావు" అందురు. వీరు కోటయ్య దేవర శిష్యులు. వరంగల్‌లో ముదిగొండ శంకరాచార్యుల వారి ఎదుట పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు ఈ హనుమంతరావుగారికి పండితశాలువలు బహూకరించినారు. అమ్మాయమ్మగారి భర్త సికందార్ రామకృష్ణరావుగారు వీరి కుమారుడు. చిన వెంకటరావు "శ్రీ వేంకటేశ్వర నాట్యమండలి" అను పేరుతో 19[illegible] నుండి ఒక సమాజమును నడుపుచున్నారు. ప్రస్తుత మీ సమాజము పశ్చిమ గోదావరి జిల్లాలో పర్యటించుచున్నది. ప్రొప్రయిటరు చిన వెంకటరావుగారు మంచి హార్మోనిస్టు. వారి చెల్లెలు శారదాబాయి, భార్య అమ్మాయమ్మ ప్రధాన స్త్రీభూమికలను, చెల్లెలుభర్త తులసీరావు నాయకభూమికలను నిర్వహించుచుందురు. ఈ సమాజమందు చిన్న వెంకటరావుగారి కుమారుడు కోటయ్య, వారి భార్య మనోరమ కూడ మంచి నటులు.

*గోవిందరావుగారి కుటుంబము, అల్లుళ్ళు.*

వెంకోజీరావుగారి దత్తపుత్రులు గోవిందరావుగారికి ఇరువురు భార్యలు—పెద్ద సుబ్బమ్మ, లక్ష్మీబాయి; ఇరువురును గంగయ్యగారి కుమార్తెలే. వీరిలో పెద్దసుబ్బమ్మగారికి ముగ్గురు మగపిల్లలు, ఐదుగురు ఆడపిల్లలు కలరు. మగవారిలో పెద్ద అయిన హనుమంతరావుగారు విజయనగరం మ్యునిసిపల్ ఇంజనీయరుగా పని చేయుచున్నారు. వీరి సోదరులు సుబ్బారావు, కోటీశ్వరరావుగార్లు ఇరువురును "శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి"ని నిర్వహించుచున్నారు. ఈసమాజము ప్రస్తుతము కర్నూలు జిల్లాలో పర్యటించుచున్నది. సుబ్బారావుగారు కంపెనీ మేనేజరు. వీరు నాయకభూమికలను, వీరి భార్య నారాయణమ్మ నాయికాభూమికలను ధరించుచుందురు. కోటీశ్వరరావుగారు మంచి చిత్రకళా నిపుణులు.

ఇంక పెద్దసుబ్బమ్మగారి కుమార్తెలలో పెద్దవారు అంజనమ్మ. వీరిభర్త సహదేవరావు చనిపోయెను. రెండవ కుమార్తె బాలోబాయి; వీరి భర్త మల్లయ్యగారు. మూడవ కుమార్తె ధనలక్ష్మీబాయి, ఈమె భర్త పుల్లయ్యగారు. నాలుగవ కుమార్తె సరసమ్మ; వీరిభర్త సింధే వెంకటప్ప, ఐదవ కుమార్తె చెల్లాయమ్మ; వీరి భర్త నాగేశ్వరరావుగారు. మల్లయ్య, పుల్లయ్యగార్లు ఇరువురును గంగయ్యగారి కుమారులు; వెంకటస్వామిగారి సోదరులు. నాగేశ్వరరావుగారు వేంకటస్వామిగారి కుమారులు.

పుల్లయ్యగారికి 5 గురు కుమారులు కలరు. శ్రీకృష్ణబాబూరావు, ప్రకాశరావు. చంద్రరావు, లీలాపాపారావు, కృష్ణారావు, సురభి బాలసరస్వతి—వీరి సోదరియే. అన్నదమ్ములందరును కలసి బాబురావుగారి యాజమాన్యమున "శ్రీ శా ర ద వి జ య నా ట్య మం డ లి" అనెడి పేరుతో 1948 నుండి ఒక సమాజమును నడుపుచున్నారు. వీరే చిన్నరామయ్యగారి కంపెనీ పరికరములను కొనుక్కొనినవారు. ఈ సమాజము ప్రస్తుతము గుంటూరుజిల్లాలో పర్యటించుచున్నది. అన్నదమ్ములలో ప్రకాశరావు నాయకభూమికలను, వారి భార్య శకుంతల నా యి కా భూ మి క ల ను ధరించుచుందురు. చంద్రరావుగారు హాస్యనటులు; వీరు విలన్ భూమికలను ధరింతురు. బాబూరావు, లీలాపాపారావుగార్లు హార్మోనిస్టులు; నటులు కూడాను. ఈ సమాజమువారు కురుక్షేత్రము, మాయా

బజారు, భూకైలాస్, దేవదాసు మొదలగు నాటకములను ప్రత్యేక శిక్షణముతో చక్కగా ప్రదర్శింతురు.

ఇంక నాగేశ్వరరావుగారు... "మ్యాం పూర్ణానంద డ్రమెటిక్ థియేటర్సు" అను పేరుతో 1943 నుండి ఒక సమాజమును నడుపుచున్నారు. ఇది ప్రస్తుతము గుంటూరుజిల్లాలో పర్యటించుచున్నది. నాగేశ్వరరావుగారు నాయకభూమికలను, వారి భార్య చెల్లాయమ్మగారు నాయికాభూమికలను ధరించుచుందురు. నాగేశ్వరరావుగారి చెల్లెలు జానకమ్మ ముఖ్య స్త్రీభూమికలను నిర్వహించును; ఈమె కృష్ణపాత్ర నిర్వహణలో ప్రసిద్ధివహించినది. జానకమ్మగారి భర్త వనారస ఈశ్వరరావుగారు హార్మనిస్టు. ఈ సమాజము వారుసతీఅనసూయ, సత్యహరిశ్చంద్ర, మాయలమరాఠి, కురుక్షేత్రం మొదలగు నాటకములను ప్రత్యేక శిక్షణముతో చక్కగా ప్రదర్శింతురు. ఇదికూడ మంచి సుశిక్షణగల సమాజము; నాగేశ్వరరావుగారువిద్యావంతులు; అభ్యుదయ భావములు కలవారు. వీరికి సింహపురి (నెల్లూరు) లలితకళామండలివారు 1947లో "నాట్యకళాధురీణ" అను బిరుదునిచ్చి సత్కరించినారు. వీరికి ముషీరాబాదు (హైదరాబాదు)లో సొంతభవనముకలదు; అచ్చటనేస్థిరపడినారు. "సురభి నాటకకళాసంఘము"నకు వీరు నేడు కార్యదర్శులు; సురభి నాటకసమాజ సప్తతి స్వర్ణోత్సవ సంచికను ప్రకటించు ప్రయత్నములో ఉన్నారు.

గోవిందరావుగారి రెండవభార్య లక్ష్మీబాయికి ఐదుగురు కుమార్తెలు కలరు—పెద్దకుమార్తె సుభద్రమ్మ, రెండవకుమార్తె పూర్ణిమ, మూడవ కుమార్తె శాంతమ్మ, నాలుగవ కుమార్తె నాగలక్ష్మి, ఐదవకుమార్తె షణ్ముఖమ్మ (వసుంధర).

సుభద్రమ్మగారి భర్త రేకందార్ చిన్న వెంకటరావుగారు వీరు "శ్రీ వెంకటేశ్వర నాట్యమండలి" అను పేరుతో ఒక సమాజమును నడుపుచున్నారు. ఇది ప్రస్తుతము తూర్పు గోదావరి జిల్లాలో ఉన్నది. ఈ సమాజమందు సుభద్రమ్మ నాయికా భూమికలను ధరించుచుందురు. చిన్నవెంకటరావుగారు హాస్యనటులు; వీరిపుత్రులలో దాశరథిరావుహార్మనిస్టు; భోజరాజు విలన్ భూమికలను ధరించును. ఇతడు సమాజకార్యకలాపము లన్నింటి యందును నిపుణుడని చెప్పవచ్చును.

పూర్ణిమగారి భర్త ఆవేటి రామయ్యగారు "శ్రీ పూర్ణిమా నాటకమండలి" అని వీరి సమాజమునకు పేరు. కాని, ప్రస్తుత మిది ఒక ప్రత్యేక సమాజముగా పనిచేయుటలేదు. పూర్ణిమగారు శ్రీ బళ్ళారి రాఘవాచార్యులవద్ద శిక్షణను పొంది ఉత్తమ నటిగా ప్రసిద్ధిగనెను. వీరిప్పుడు సకుటుంబముగా ఏలూరులో స్థిరపడినారు. పూర్ణిమగారికి 30-3-1958 తేదీన హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ నాటక సన్మాన సంఘసభ్యులు సన్మానపత్రమును సమర్పించి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ సచార్ గారి అధ్యక్షతలో సువర్ణకంకణమును బహూకరించినారు.

శాంతమ్మగారి భర్త ఆవేటి ప్రసాదరావు (వెంకటస్వామిగారి కుమారుడు). వీరు అన్నదమ్ములతో కలిసి కొంతకాలము సమాజమును నడపి ప్రస్తుతము గజపతినాట్యమండలి పేర సమాజము నడుపుచున్నారు.

నాగలక్ష్మిభర్త చలపతిరావుగారు. వీరు "శ్రీ గోవర్ధన నాట్యమండలి" అనెడి పేరుతో 1943 నుండి ఒక సమాజమును నడుపుచున్నారు. ఈసమాజము ప్రస్తుతము కడప జిల్లాలో ఉన్నది. ఇందులో కోటేశ్వరరావు అనువారు నాయక భూమికలను, నాగలక్ష్మి గారు నాయికాభూమికలను ధరించుచుందురు.

షణ్ముఖమ్మ (ఇప్పటిపేరు వసుంధర) గారి భర్త శ్రీ అవేటి రామచంద్రరావుగారు. వీరు శ్రీ వసుంధరానాట్యమండలి" అనెడి పేరుతో ఒక సమాజమును 1953 నుండి నడుపుచున్నారు. ప్రస్తుతి మీ సమాజము విశాఖమండలములో ఉన్నది. ఇందు సింధే నారాయణరావు అను వారు నాయకభూమికలను, వసుంధరగారు నాయికాభూమికలను ధరించుచుందురు.

గోవిందరావుగారు ఒక్కొక్క కుమార్తెకే వివాహముచేసి, కొంతకాలము వారికి నాటక ప్రదర్శనములందు శిక్షణ యిచ్చి, తరువాత విడి పోవుట కంగీకరించెడివారట. నేడు సమాజము లను నడుపుచున్నవారిలో అనేకులు గోవింద రావుగారి సంతానమే అగుట గమనార్హము.

పెద్దరామయ్యగారి కుటుంబము :

ఆరవవారైన పెద్దరామయ్యగారు 1914 లో లాల్‌గుడాలో (సికింద్రాబాదు) చనిపోయి నారు. మెట్టుగడ్డలో వీరి సమాధి ఉన్నది. పెద్ద రామయ్యగారి భార్య రామాబాయి 1914 నుండి 1938 వరకును ప్రత్యేకముగా ఒక సమా జమును నడిపెను. రామాబాయిగారు పురుష వేషములనుకూడ ధరించెడివారు.

రామయ్యగారు మంచి నటులుగా ప్రసిద్ధి చెందినారు. మంచి మాటకారి. కార్యశూరులు. ఎంతటి వారైనను ఎదుటివారిని వశముచేసి కొనగల శక్తి వీరి కుండెడిదని చెప్పుదురు. చిన్న వేషము మొదలు పెద్దవేషము వరకును దేనినైనను సరే అతి సమర్థతతో నిర్వహించెడి వారట. (సారంగధరలో రాజరాజు వేసి చివరి దృశ్యములో తలారి వేషము వేసెడివారట). ఇంతటి మహావ్యక్తి ఆ వంశములో ఇంకొకరు లేరని చిన్నరామయ్యగారు అనుచుండెడివారు. సురభి పాపాబాయి వీరి సమాజములోనుండుచు, వారి మరణానంతరము 1914 నుండి 1923 వరకును ప్రత్యేకముగా ఒక సమాజమును నడపి నారు. పెద్దరామయ్యగారికి ఇరువురు కుమా రులు గలరు-అంజనప్ప, శ్యామారావు. అంజ నప్పగారు తండ్రి మరణానంతరము 1914 నుండి 1930 వరకును ప్రత్యేకముగా సమాజమును



పెద్దరామయ్యగారు

నడపినారు. వీరి బావమరది రేకందార్ శంభు లింగంగారు 1930 నుండి కొంతకాలము ఆ సమాజమును నడిపిరి. పిమ్మట శంభులింగంగారి తమ్ముడు కోటయ్యగారు 1947 నుండి "శ్రీవిజయ నాట్యమండలి" అను పేరుతో ఒక సమాజము నడుపుచున్నారు. ఈ సమాజము ప్రస్తుతము వరం గల్ జిల్లాలో ఉన్నది. ఇందులో అందెల మల్లి ఖార్జునరావు అనువారు నాయకభూమికలను, కోటయ్యగారి భార్య అంజమ్మ నాయికభూమి కలను ధరించుచుందురు. కోటయ్యగారి అల్లుడు దత్తాంజనేయులు హార్మోనిస్టు. శంభులింగంగారి

కుమారుడు పుల్లయ్యగారు 1954 నుండి ప్రత్యేకముగా ఒక సమాజమును నడపుచున్నారు. ఇందులో పుల్లయ్యగారు నాయకభూమికలను, వారి భార్య నాయికాభూమికలను ధరించుచుందురు.

*అవేటి గంగయ్యగారి కుటుంబము :*

పెద్దరామయ్యగారికి అంజనమ్మ అను కుమార్తెకూడ గలదు. ఈమె అవేటి వెంకటస్వామిగారి భార్య. ఇచ్చట అవేటివారిని గూర్చి కొంత వివరించవలసియున్నది. వనారసవారికి అవేటివారు వియ్యంకులు. అవేటి గంగయ్య (కొచ్చెర్ల గంగిరెడ్డి) గారికి నలుగురు భార్యలు కలరు-పాపాబాయి, గోవిందమ్మ, అచ్చమ్మ, నాగమ్మ. గంగయ్య మూడవభార్య సురభి పాపాబాయి; ఈమె కుమారుడే పుల్లయ్యగారు (గోవిందరావుగారి అల్లుడు). పుల్లయ్యగారి కుమార్తెయే సురభి బాలసరస్వతి. దీనినిగూర్చి ఇంతకుముందే వివరించియున్నాను.

గంగయ్యగారి రెండవభార్య గోవిందమ్మగారి కుమారుడే వెంకటస్వామిగారు. వీరు మంచిహాస్యనటులు. 19-12-1950 తేదీన అనంతపురములో చనిపోయినారు. వెంకటస్వామిగారికి ఇద్దరు భార్యలు కలరు-మొదటి భార్య రామానుజులమ్మ; మొదటి రామయ్యగారి కుమార్తె. ఈమె కుమారులే ప్రసాదరావు, చలపతిరావుగార్లు. రెండవ భార్య అంజనమ్మ పెద్దరామయ్యగారి కుమార్తె; ఈమె కుమారులే రామయ్య, నాగేశ్వరరావుగార్లు. (గోవిందరావుగారి అల్లుళ్ళు) వీరినిగూర్చి ముందే వివరించియున్నాను.

గంగయ్యగారి ముగ్గురు కుమార్తెలలోను ఇరువురిని పెద్దసుబ్బమ్మ, లక్ష్మీబాయిలను గోవిందరావుగారు వివాహమాడినారు; మూడవ కుమార్తె చిన్నసుబ్బమ్మను వెంకోజీరావుగారు వివాహమాడినారు.

*సురభినాటక కళాసంఘము :*

ప్రస్తుతము నాటకములను ప్రదర్శించుచున్న పది సురభి నాటక సమాజముల పేర్లను పైన పేర్కొనియున్నాను. ఇందులో రెండు చిన్న సమాజములు; తక్కినవన్నియును పెద్దసమాజములు. ఇవికాక ఇంకను ఒక పెద్దసమాజము, 25 చిన్నసమాజములును పనిచేయుచున్నట్లు వారు ఇటీవల ప్రకటించిన కరపత్రములో కలదు. అనగా మొత్తము 36 సురభి నాటక సమాజములు నేడు కలవన్నమాట! ఇవి అన్నియును సంచార నాటక సమాజములే అగుట గమనార్హము. కావుననే ప్రస్తుత విలాసములను మాత్రమే తెలిపియున్నాను. ఒకనాడు కడప జిల్లా, రాయచోటి తాలూకా సురభిగ్రామములో "శ్రీ శారదా మనోవినోదిని సంగీత నాటకసభ" అను పేరుతో ప్రారంభమైన ఒకానొక సమాజము జీవనదివలె నేటికి ఇన్ని శాఖోపశాఖలై వికసించినది. "ప్రతిరాత్రి ఆంధ్రదేశమున ఎచ్చటనో సురభినాటకము ఉండియే తీరుననుట అతిశయోక్తి కానేరదు. ఆధునిక ఎలక్ట్రిక్ ధ్వనియంత్రములతో, వైరువర్కులు, ఫోకసింగులు, అశేషజనాకర్షణీయములగు సీనరీలు, సెట్టింగులతో, అయిదు మొదలు పదిలారీల స్టేజి సామాగ్రితో సంచారయోగ్యమగు ప్రేక్షకాగారముతో డెబ్బదిమంది స్త్రీపురుష బాలవృద్ధులతో నెల కొక గ్రామముచొప్పున గ్రామమునకు పదినుండి పదిహేను నాటకములు ప్రదర్శించుచు సంచరించు సమాజములు భారతదేశమున ఒక్క సురభివారివే" అని వీరు కరపత్రములలో వివరించిన విషయములు సత్యసమ్మతములు; అతిశయోక్తి రహితములు.

పై ముప్పది ఆరు సమాజములమధ్యను పరస్పర సహకారమును, ఐకమత్యమును పెంపొందించవలె ననెడి ఆశయముతో వారినెల్ల సంఘటితపరచుటకు ప్రయత్నములు జరిగినవి. తత్ఫలముగ 1956 మే నెలలో సురభినాటక కళా

సంఘము అవతరించినది. దీనికి నిబంధనావళి సిద్ధము చేసికొనినారు ఈ సంఘమునకు ఇంచుమించుగా 6 వేల రూపాయల నిధి కలదు. ఈ సంఘమునకు శ్రీ రేకందార్ చిన్న వెంకటరావు గారు అధ్యక్షులు; శ్రీ అవేటి నాగేశ్వరరావుగారు కార్యదర్శి. ఒక్క సురభిసంచార నాటక సమాజములనే కాక ఆంధ్రదేశములో ఉన్న తక్కిన సంచార నాటకసమాజములను కూడ చేర్చుకొని సురభినాటక కళాసంఘములను "The Andhra Pradesh Touring Dramatic Theatres' Association" గా విస్తృతము చేయవలెనని సంకల్పము వారికున్నది. అది నెరవేరుగాక.

*స్వర్ణోత్సవము :*

ఇంచుమించుగా డెబ్బది ఏండ్లనుండి తెలుగు నాటకరంగమునకు అమోఘమైన సేవనొనర్చిన సురభి నాటక సమాజము నేడు స్వర్ణోత్సవము జరుపుకొన నుండుట ఆనందకరమైన విషయము. ఈ స్వర్ణోత్సవము జయప్రదము కావలయునని నటరాజస్వామిని ప్రార్థించుచున్నాను.

*సురభివారు ప్రదర్శించు నాటకములు*

ఈ వ్యాసమును ముగించుటకుముందు సురభి నాటకసమాజములవారు ప్రదర్శించెడి నాటకములను పేర్కొ౦దును. ఇందులో కొన్ని కేవలము సురభివారి కొరకె వ్రాయబడినవి; కొన్ని ఇంకనూ అముద్రితములే.

కీచకవధ—గోవిందరావుగారి కల్పన (ఇది సురభివారి ప్రథమ రంగస్థల నాటము).

సారంగధర, శాకుంతలము, హరిశ్చంద్ర— రాప్తాటి సుబ్బదాసుగారు రచించి నేర్పినవి.

స్త్రీసాహసము, జగన్మోహన—కృష్ణాజీరావు గారు కల్పించినవి.

పారిజాతాపహరణము, బిల్హణీయము-మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి) గారు వ్రాసి వీరికిచ్చినవి.

కాంతామతి, భళ్ళాణ చరిత్ర, మైరావణ— తడకలూరి కుప్పుస్వామి గారు నేర్పినవి (improvisations).

చంద్రకాంత— వఝ్ఝల చింతామణిశాస్త్రి గారు (శ్రీకాకుళం) వ్రాసి ఇచ్చినది.

దశావతారములు — చిన్నరామయ్యగారి ప్రేరణముచే బులుసు సీతారామశాస్త్రిగారు (బొబ్బిలి) వ్రాసిఇచ్చినది.

కాంతామతి, శూర్పణఖాగర్వభంగము— శ్రీరాములు సచ్చిదానందశాస్త్రిగారు వ్రాసి ఇచ్చినది.

జగన్మోహన — వల్లాది అచ్యుతరామశాస్త్రి గారు వ్రాసి ఇచ్చినది.

సీతాకళ్యాణము — చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి రచన.

సంపూర్ణ మహాభారతము—పండిత బళ్ళారి కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచన.

కుమారవిజయము, రావణచర్యలు—చక్రావధానుల మాణిక్యశర్మగారిచే గోవిందరావు గారికి వ్రాసిఇచ్చినది.

భక్తకబీరు—చక్రావధానుల మాణిక్యశర్మ గారిచే చిన్నరామయ్యగారు వ్రాయించినది.

సతీసావిత్రి, సత్యహరిశ్చంద్ర, మహానంద, కాళిదాసు—విశ్వనాథ కవిరాజుగారిచే గోవిందరావుగారు వ్రాయించినవి.

శ్రీకృష్ణావతారము, లవకుశ, వసంతసేన— విశ్వనాథ కవిరాజుగారిచే చిన్నరామయ్యగారు వ్రాయించినవి.

జమీందార్ — విశ్వనాథకవిరాజుగారిచే వెంకటస్వామిగారు వ్రాయించినవి.

స్త్రీసామ్రాజ్యము—కొప్పరపు సుబ్బారావు గారిచే 1932 లో గోవిందరావుగారు వ్రాయిం

చినది. సురభివారి ప్రథమ సాంఘిక నాటక మిదియే; ఇది నేటికిని అముద్రితమే. విశ్వనాథ కవిరాజుగారి నాటకములుకూడ అముద్రితములే.

సంపూర్ణ రామాయణము, సంపూర్ణ మహాభారతము, బొబ్బిలి యుద్ధము — హరిపురుషోత్తం (భీమవరం) గారిచే వెంకటస్వామిగారు వ్రాయించినవి.

బాలనాగమ్మ, పలనాటి యుద్ధము, ఫస్టు క్లాస్ బి. ఏ., కాంతామతి — హరిపురుషోత్తం గారినాటకములు. ఇవన్నియును అముద్రితములే.

అభాగిని, కాలాపహాడ్ — మల్లాది వేంకట కృష్ణశర్మగారిచే వేంకటస్వామిగారు వ్రాయించినవి.

ప్రతిజ్ఞ, అలెగ్జాండర్, బాలనాగమ్మ — మల్లాది వెంకటకృష్ణశర్మగారిచే సుబ్బారావుగారు వ్రాయించినవి.

దేవదాసు, భూకైలాస్, మాయాబజార్ — మల్లాది వేంకటకృష్ణశర్మగారిచే బాబూరావుగారు వ్రాయించినవి.

దక్షయజ్ఞం, మాయలమరాఠి — మల్లాది వేంకట కృష్ణశర్మగారిచే నాగేశ్వరరావుగారు వ్రాయించినవి. పై నాటకములలోని సురభినాటక సమాజముల వారందరును బాలనాగమ్మ (మాయల మరాఠి), కురుక్షేత్రం నాటకములను తప్పక ప్రదర్శింతురు; వాటికే ఎక్కువ 'కలెక్షన్' వచ్చునుండునట.

*మొదటి రెండు తరముల నటీ నటులు :*

మొదటి రెండు తరములలోనూ సుప్రసిద్ధులైన సురభి నటీనటులు — వెంకోజీరావు, వారి భార్య చిన్న సుబ్బమ్మ; పెద్దరామయ్య, వారి భార్య రామాబాయి; సురభి పాపాబాయి; జంఘూటి వెంకూబాయి; సురభికమలాబాయి, చిన్నరామయ్య; గోవిందరావు, వారి భార్యలు, పెద్దసుబ్బమ్మ, లక్ష్మీబాయి, అవేటి వెంకట స్వామి మొదలగువారు

*సురభివారి విశిష్టతలు :*

సురభి నాట్య మండలులలోని విశిష్టతలను క్రింది విధముగా పేర్కొనవచ్చును. (1) నటీనటులందరును ఏకకుటుంబమువారగుట (ప్రాచీన సంస్కృత నాటక ప్రస్తావనలందిట్టి సత్యమే గోచరించును). (2) నటీనటు లందరును ఐకమత్యముతో భేషజము లేకుండ తమ పనులన్నింటిని తామే చేసికొనుచుండుట. (3) వేషధారణములో చిన్న - పెద్ద వేషములు అనెడి భేదములు కాని, అసూయలుకాని లేకుండుట. (4) నాటకములే వృత్తిగా కలిగియుండుట (Profession). (5) స్త్రీలు, బాలురు, పురుషులు, వృద్ధులు వయో, రూప, గుణానుకూలముగా భూమికా ధారణము చేయుట. (6) సుశిక్షణ, స్వయం సమగ్రత, నాటకకళయందు అభినివేశము కలిగి యుండుట.

సురభి నాటక సమాజములచరిత్రనుండి తెలిసినంతవరకు కొంత విపులముగాను, కొంత సంగ్రహముగాను వివరించియున్నాను. ఇందులో ఏవేని దోషములు దొరలినచో తెలుపవలసినదిగా సహృదయులను కోరుచున్నాను. పై చరిత్రను తెలిపిన వారందరికిని' ఫోటోలను, బ్లాకులను పంపించిన శ్రీమతి పూర్ణిమ గారికిని చిన్న రామయ్యగారి కుమారులకును కృతజ్ఞుడను.

[సంపూర్ణము]

# * మహానటుడు *

"పండిత హరికథకహంస" శ్రీ పాతూరి మధుసూదనరావు.

శ్రీమంతమైన ప్రపంచ రంగములో సృష్టికర్తయైన బ్రహ్మ కొన్ని కోట్లు పుట్టినరోజు పండగలు చేసుకున్నాడు భారతీదేవి సామనిగమగానం చేస్తూనేవుంది వాహీభూతములైన పరమహంసలు భారతభారతీ సామమును పద్మవనంలో కేవలానందంతో అనుభవిస్తూనేవున్నై భారతీస్వామికి తెలియకుండానే కాలం గడిచి నిద్రాసమయం వచ్చింది.

ఆ రోజు మహాశివరాత్రి సంధ్యాసమయం తేజోరాశికి ప్రతీచీన విచిత్రారుణారుణ కాంతులు ఆక్రమించి భారతీస్వామి నిష్ఠలో కూర్చున్నాడు మందేహాభ్యంతరం లేకుండా సూర్యునకు మంత్రార్ఘ్య మిచ్చాడు సూర్యుడు స్వేచ్ఛగా విశ్రాంతి భవనంలోకి వెళ్ళబోతున్నాడు బ్రహ్మకు సమాధినిష్ఠలో పెద్దకేకతో ఎవరో పిల్చినట్లు వినిపించింది భారతునిలో అందాకా లీనమైవున్న భారతి భయంతో గడగడలాడుతూ బయటకు వచ్చింది ... బ్రహ్మకు నిష్ఠ తప్పింది మళ్ళీ పిలుపు బ్రహ్మకుకూడా భయం వేస్తోంది.

"ఓ చతుర్ముఖా! లే! లే! యివ్వేళ చతుర్దశి! కాలానికికూడా కళ్ళుమూసే మహాకాళి కాలకాలనాట్యంకోసం అదిగో కపాలమాల ధరించి లాస్యం చేస్తోంది అది కథాకలి కాదు కళాకాళి కాలకాలస్వామి తన నాట్యభంగిమలతో ఆమెను ముగ్ధను చేసేసమయం ఆ దంపతుల సమైక్యాభినయమునకు బ్రహ్మాండమంతా రంగస్థలం నీవు సృష్టించిన పంచభూతాలూ భౌతికజీవాలూ చరాచరాలూ దృశ్యాదృశ్యాలూ ఏవీ లేకుండా చక్కఁగా తుడిచివేయాలి నాట్య రంగస్థలములో ఈ పర్వతాలూ గిర్వతాలూ పలుగురాళ్ళలాగా గుచ్చుకుంటూ వుంటే నాట్యం సాగదు త్వరగా తుడిచివేయాలి ఈ సముద్రాలూ గిముద్రాలూ స్వామి మండల నృత్యం చేస్తుంటే ముఱుగు గుంటలులాగా అడ్డు రాకూడదు అవిగో ఆపైన చుక్కలు ఆకాశకేళి తాండవంచేస్తే తలకు తగుల్తూ వుంటై ఈ నభోవితానం (పందిరి) కట్లు తెంపి దూరంగా పారవేయాలి భారతీదేవిచేత కనబడకుండా పాడమని చెప్పు కాళీకాళ మహానందనాట్యంలో అర్ధనారీభంగిమం ప్రదర్శించేవేళ నీవుకూడా వుండరాదు విష్ణుమూర్తికికూడా చెప్పాను ఆయనకూడా అప్పుడు వుండడు లే! త్వరగా నీ సృష్టినంతా తుడిచివేసి రంగస్థలం నిర్మలంగా సిద్ధంచేయ్.

బ్రహ్మగుండె గుభుక్కుమని "తండ్రీ! నమస్కారం! అలాగే చేస్తాను నీవెవరవో చెప్పి నన్ను ధన్యుణ్ణి చెయ్యాలి" అన్నాడు వెంటనే "నేను నందీశ్వరుణ్ణి, వెళ్ళుతున్నాను, నీతో చెప్పినపని క్షణంలో కావాలి జాగ్రత" అని వినిపించింది.

బ్రహ్మ తన సంకల్పంతో ఈ సృష్టినంతా ఎట్లా చేశాడో అట్లా సంకల్పంతోనే మళ్ళీ నాశనం చేస్తున్నాడు అదేమిటో అన్నిదిక్కులూ అగ్నిశిఖ లాక్రమించి ముంచుకువస్తున్నై ఆ యెఱ్ఱని కాంతుల మధ్య పొగలు గ్రమ్మిన నల్లరంగులు అలుముకున్నై మబ్బులు పట్టిన సంధ్యాసమయములాగావుంది ప్రపంచమంతా భగ్గుమనేదాఁకా వుండి పెద్దగా విసరిన గాలికూడా సర్దు

కుంది ఇంకేముంది ఏమీ లేదు అంతాశూన్యం అదివరకులేని మహాశబ్దం ఒకటేదో "ధణకు ధణకుధిమిత, ధీంతధీంతదిరుగుడుతక" అంటూ ఖంగున చెవులు గింగురులెత్తేటట్లు వినిపిస్తుంది అది ధక్కా-మోత అని బ్రహ్మ గ్రహించాడు మహాకాళస్వామి నాట్యంలో ప్రపంచలయంతో తాళలయపాదవిన్యాస సహకారిగా ఘాతలు చూపిస్తున్నది, బ్రహ్మ, భారతి, తప్ప ఎవ్వరులేరు.

భారతి లయగీతిని విలంబకాలంలో ఉపక్రమించింది మహానటుడా కాలమును పల్లవము చేసికొని చరణములకు ద్రుతగతి నవలంబింపజేస్తే కాళీదేవి రాగలలిత అవుతుందని నిశ్చయించి ప్రవేశమవుతున్నాడు.

పాదక్షేపములో కాలిగజ్జెల సవ్వడి వినిపిస్తున్నది నిరామయ ప్రదేశమున నటుడుగా ప్రవేశించే శివుడు ఆనాడు భయంకరముగా వున్నాడు మోచేయి భుజముల కెదురుగా హస్తము పతాకసంజ్ఞితమై మోచేతి కెదురుగా ముందుకు జాపి దక్షిణహస్తము నెత్తి ధక్కా-మోగిస్తూ రోమ్ము శీర్షము నిక్కించి యెడమకాలు నేలమోపి యెత్తిన కుడికాలు అప్పుడే దించుతూ ప్రవేశించుతున్నాడు ఆయన దేహకాంతులు ఆయన ప్రవేశంతో ఉత్తరమునుండి దక్షిణమునకు ప్రసరిస్తున్నై ఆదే సమయములో దక్షిణమునుండి విస్తృతాంజలిబంధముతో రెండుచేతులు చాచి స్వామికి స్వాగత మిస్తూ మహాకాళి ప్రవేశిస్తున్నది ఆ మహాదేవి రజోమయియై యెఱ్ఱనికాంతి దక్షిణమునుండి ఉత్తరమునకు ప్రవహిస్తున్నది ఆ యిరువురి ప్రవేశములో కాంతులు కలిసిన చోట ఒక నల్లగీత గీసినట్లు రేఖ గంగాయమునా సంగమస్థానంలాగా కనిపిస్తున్నది.

భారతీదేవి పాట చతురశ్రధృవములో ఎప్పుడూ శాంతిమయంగా వుండేది ఇప్పుడు సంకీర్ణధృవములో తాను కనబడకుండా పాడుతున్నది అది ముక్తిప్రదమైన తారాస్థాయి।

మహాకాళి, కాలకాలస్వామి పునః పునః పార్శ్వభంగిమలతో కాంతి ప్రసారాలు కలిసి పోతూవుండగా రంగమధ్యములోకి వస్తున్నారు వారి రూపములు ప్రవేశమున భయంకరము లయ్యూ సాన్నిధ్యములో ప్రసన్నములవుతున్నై ప్రసన్నములైన కొలదీ విస్తృతమూ సూక్ష్మమూ అవుతున్నై మహానటుని కాలికి గండపెండేరములాగా వున్న శేషమూర్తి దీప్తి ఫణామణి కాంతులతో సహా శివకాంతిలో కలిసి కనబడకుండా పోయినాడు మహానటుడు నాట్యానందంలో తన్నుతాను మరచి నటిస్తూ

"నాలో నేనే వున్నాను" అన్నాడు ఆ కళాకాంతకూడా
"నీలో నేనె వున్నాను" అన్నది, చతుర్ముఖుడు
"నేనంటేనే యేమో తెలియక నీదాసుడనై యున్నాను"

అంటూనే ఆ యానందావేశంలో కర్పూరంలాగా హరించిపోయినాడు.

కాలకాలుడు నాట్యానందంలో పెరిగిపెరిగి ఆకాశమైనాడు మహాకాళి ఆ యాకాశంలో నైల్యమైంది భారతిపాట వినబడటంలేదు ఏమైందో మహానటు డొకసారి "నేను" అన్నాడు ఆ మహానటి మారాడలేదు ఆ మహానటుడూ మహానటీ మహత్వంలో వున్నారు ఆ మహానటుడూ మహానటీ సచ్చిదానందంలో వున్నారు

అప్పుడు వారర్ధనారీశ్వరులు అప్పుడు వారికి అభిన్నరూపం ఆ నాట్యములో విశ్వానందం ఆ యైక్యములో ఒకటేసత్యం అది సచ్చిద్రూపమహానందం అప్పుడు అదే ఒకతత్వం

ఓం తత్సత్.

—♦—

# శ్రీ విజయ నాట్యమండలి



శ్రీ విజయ నాట్యమండలి నటబృందము - నిర్వాహకులు: శ్రీ ఆర్ కోటయ్య, వి. జయరామరావుగార్లు.



శ్రీ విజయ నాట్యమండలి నటీమణులు - బాలనటులు



కురుక్షేత్ర నాటకములో దుర్యోధనునిగ

శ్రీ ఆర్. కోటయ్య.



సతీ అనసూయ నాటకములో మన్మథునిగ

శ్రీ వి. జయరామరావు.



సతీ అనసూయ నాటకములో అనసూయగా

శ్రీమతి అంజనమ్మ.

శ్రీ ఆర్. కోటయ్యగారి అర్ధాంగి.



గయోపాఖ్యానం నాటకములో చిత్రలేఖగా

శ్రీమతి భూలక్ష్మిదేవి.

శ్రీ వి. జయరామరావు అర్ధాంగి.



శ్రీరామాంజనేయయుద్ధం నాటకములో రామునిగ
శ్రీ ఎ. మల్లిఖార్జునరావు.



కురుక్షేత్ర నాటకములో అర్జునునిగ
శ్రీ పాకేపల్లి సుబ్బారావు.



కురుక్షేత్ర నాటకములో భీమునిగ
శ్రీ రామలింగం.



కురుక్షేత్ర నాటకములో సత్యభామగా
శ్రీమతి వి. సత్యవతి.



శివలీలలు నాటకములో తారకాసురునిగ

శ్రీ ఆర్. శంభులింగం.

# అభినయం - సీమీ దృక్పథం

నాట్యకళ – మఖ

సీమీ జపాన్ దేశీయుడు. మహానటుడు. ఆయన తన జీవితకాలంలో (1363–1444) అభినయంమీద చిన్న చిన్న గ్రంథాలు పదహారు రచించాడు. ఇవి ముఖ్యంగా అతని కుమారుడు మోటోయోషీకోసం రచింపబడినాయి. ఇవి చాలాకాలం నామమాత్రావశిష్టంగా ఉండి 1908 లో బైటపడ్డాయి. సీమీ నృత్య రూపకాలలో నటిస్తూండేవాడు. ఆరూపకాలను 'నో' రూపకాలంటారు. అవి అనేకమార్పులుచెంది జపాన్‌లో ఆడబడుతూనే ఉన్నాయి.

సీమీ మహానటుడుమాత్రమేకాదు; అతని సమాజానికి సూత్రధారుడు, నాటక రచయిత, స్టేజీ మానేజరు, సంగీత దర్శకుడు, స్వరకర్త. అతను రకరకాల ప్రేక్షకులముందు నాటకాలాడాడు. 'రాజభవనాలలో, మఠాలలో, గ్రామాలలో, ఉత్సవాలలో నటించి మెప్పుపొందినవాడే ఉత్తమ నటుడు' అని సీమీ మతం. ఆనాడు నాటకాలు ప్రేక్షకుల ఆహ్లాదంకోసం మాత్రమే కాకుండా రోగనివారణ కొరకుకూడా ప్రదర్శింపబడుతూండేవి. ఎవరికైనా జబ్బుచేసినపుడు అతని తాలూకువారికి పూనకంవచ్చి ఫలానా దేవత ప్రీత్యర్థం నాటకం ప్రదర్శిస్తే రోగం నయమవుతుందని తెలియజేసేది. ఇలా ఒక నాటకమే కాదు చాలా నాటకాలు ఆడమని ఆదేవతకోరేది. సీమీ అలా నాటకాలాడేవాడు రోగికి రోగం నిర్మూలించేది. రోగం నిర్మూలించగానే అతను సీమీకి ఎర్రటి పట్టు ఉడుపును బహూకరించేవాడు. ఆ ఉడుపులు ఇప్పటికీ ఆర్థల్ వాలే అనే ఆయన దగ్గర ఉన్నాయి.

ఆనాటి నాటకాలు బహుచిన్నవి. అందుకని 5, 6 నాటకాలుకలిపి ఆడేవారు. బాగా ఆలోచించి ఈనాటకాల వరుసక్రమం ఏర్పాటు చేసేవారు. ప్రదర్శనంలో ఆరంభం, పరివ్యాప్తి, పరాకాష్ఠ ఉండేవి. మొదటి నాటకం దేవతకు సంబంధించిందయి ఉండాలి. రెండు, మూడు, నాలుగు నాటకాలు పరివ్యాప్తికి సంబంధించినవి. అయిదవది పరాకాష్ఠను చెందింది అయిఉండాలి. ఈ అయిదూ ఒకేరోజుగాక ఒక్కొక్కటీ ఒక్కొక్క రోజున ప్రదర్శిస్తే వీటన్నింటినీ ఒకేఒక సమయఘట్టంగా పరిగణించేవారు. రెండవరోజున ప్రదర్శించే నాటకం మొదటిరోజుదానికి భిన్నమయినదయి ఉండాలి. కరుణారసప్రధానమయిన నాటకం మొదటిరోజున ప్రదర్శింపకూడదు. మధ్యలో ఆడాలి.

ఇక అభినయం విషయం: 'ప్రధానపాత్రలు వాచికం సరైన సమయంలో ప్రారంభించాలి. ముందుగానూ కాదు, ఆలస్యంగానూ కాదు. నటుడు నేపథ్యంలోనుంచి రంగస్థలంమీదికి అడుగు పెట్టగానే ఒక నిమిషం ఆగి ప్రేక్షకులను పరికించిచూడాలి. 'ఇదిగో మాటాడబోతున్నాడు' అని ప్రేక్షకుల గుసగుసలు అణిగిపోయేవరకు నటుడు మాటాడరాదు. ప్రేక్షకులందరి దృష్టి తనమీదపడేవరకు నటుడు వేచివుంటే ప్రారంభవాక్యాలు ప్రేక్షకుల మనసులలో హత్తుకుంటాయి. కాని ఒక్కక్షణం ఆలస్యం చేస్తే చాలు ప్రేక్షకుల దృష్టి నటునిమీదనుంచి మరలిపోతుంది. అప్పుడు నటుడు ప్రేక్షక హృదయాలను రంజింపజేయలేడు. రంగస్థలంమీద రెండు వంతులు ముందుకు వచ్చి పాట ప్రారంభించి అంచున నడుస్తూ రావాలి.

"నటుడు ప్రేక్షకులవంక తేరిపారజూడరాదు. ప్రేక్షకునికి ప్రేక్షకునికి మధ్య ఉండే కాళీ స్థలం

గుండా చూడాలి. ప్రేక్షకులలో గొప్పవారివంక చూచేటప్పుడు దృష్టిని వారి దృష్టితో కలవనీయరాదు. కొద్దిగా పక్కకు ప్రసరించాలి...విశాల రంగస్థలాలలో ప్రదర్శించేటప్పుడు ప్రభువులు కూర్చున్న స్థలానికి నటులు సాధ్యమయినంత చేరువలోకి వచ్చి నటించాలి. చిన్న అవరణాలలో అయితే వారికి సాధ్యమైనంత దూరంలో ఉండాలి...ఒకొక్కప్పుడు గొప్పవారు నాటకం పరివ్యాప్తిలోనో పరాకాష్ఠలోనో ఉండగా రావడం కద్దు. ఉదాహరణకు నాటకం పరాకాష్ఠలో ఉండగా వచ్చారనుకుందాం. కాని వారు [illegible] ఆరంభం చూడాలని కాంక్షిస్తూ ఉంటారు. అటువంటప్పుడు బలవంతాన పరాకాష్ఠ చూపిస్తే ఆనందించలేరు. అంతేగాదు గొప్ప [illegible]లో తక్కిన ప్రేక్షకులు ఉన్నారా లేరా అన్నంత నిశ్శబ్దంగా కూర్చుంటారు. వారి మనసులు కూడా తిరిగి ప్రారంభం చూడాలని కాంక్షిస్తాయి. అటువంటి పరిస్థితిలో కొత్త ఆరంభ లక్షణాలను పొదగడమే మంచిది.

"ఒకొక్కప్పుడు ఏవిందు సమయంలోనో నాటకం ప్రదర్శించాలని హఠాత్తుగా కబురు పెడతారు. వారి ఉత్సాహం పరాకాష్ఠలో ఉంటుంది. కాని నాటకం ఆరంభ దశలో ప్రారంభించాలి. అప్పుడు గట్టిచిక్కు. అటువంటప్పుడు ఆరంభంలోనే పరివ్యాప్తిని సూచించి అసలు పరివ్యాప్తికి, పరాకాష్ఠకు సాధ్యమయినంత త్వరగా చేసుకోవాలి.

సీమీ అంటాడు "అభినయంలో విజయం పొందడానికి మూడు మార్గాలున్నాయి. 1. నయనేంద్రియాన్ని రంజింపజేయడం 2. శ్రవణేంద్రియాన్ని రంజింపజేయడం 3. మనసును రంజింపజేయడం. రెండవ మార్గాన అంటే శ్రవణేంద్రియాన్ని రంజింపజేయటానికి నటుడు గొప్పవాడు [illegible]. నయనేంద్రియాన్ని రంజింపజేస్తే ఫలితం వెంటనే కనపడుతుంది. ప్రేక్షకులు సమ్మోహితులయి పోతారు. ఆటపాట వారికి నచ్చుతుంది. పెద్దాచిన్నా సంతోషంతో కరతాళధ్వనులు చేస్తారు. నాటకశాల ఆనందసాగరంలో తేలియాడుతుంది. గొప్పవాళ్లే కాకుండా, అభినయమంటే ఏమిటో తెలియని సామాన్యులు కూడా "బలే" అని మెచ్చుకుంటారు. కాని నటుడు మాత్రం బహు జాగ్రత వహించాలి. ప్రదర్శనం బాగా విజయవంతమయితే ప్రేక్షకులందరినీ సమంగా రంజింపజేస్తుంది. వారి ఆనందం, ఉత్సాహం మిన్నుముట్టి నాటకంమీద విసుగు జనిస్తుంది. నటుడు కూడా అమితోత్సాహంలో అలిసి పోతాడు...అటువంటప్పుడు నటుడు తన్ను తాను నిలదొక్కుకుని సంచలనాలను అదుపులో పెట్టుకొని ప్రేక్షకులకు కాస్త విశ్రాంతి నివ్వాలి. అప్పుడు ప్రేక్షకులు తిరిగీ నటుని అధీనంలోకి వస్తారు. నాటకబలం పుంజుకుంటుంది.

ఇక మూడవరకం నయనేంద్రియాన్ని, శ్రవణేంద్రియాన్ని ఎక్కువగా కాకుండా మనసును రంజింపజేస్తుంది. ఈవిషయంలో ముచ్చటించేటప్పుడు సీమీ బౌద్ధంనుంచి కొంత, టాయిజం నుంచి కొంత తీసుకున్న సూక్ష్మభావలో [illegible]టిస్తాడు. "అసమాన నటనా నైపుణ్యంగల నటుని చేతిలో 'నో' నాటకం ప్రేక్షకహృదయాలను కదలించివేస్తుంది. ఇందులో ఆటపాటలకు స్థానం ఉండదు. ఉద్వేగం నిశ్శబ్దతనుంచి పైకి ఉబికినట్లుంటుంది. విమర్శన అనే గ్రంథంలో సీమీ ఇలా వ్రాశాడు. 'రంగస్థలాన్ని మరచిపోయి నాటకం చూడు. నాటకం మరచిపోయి నటుని వంక చూడు. నటుని మరచిపోయి ఆశయంవంక చూడు. ఆశయాన్ని మరచిపో. నాటం అర్థం అవుతుంది.''

ఇక అనుకరణనుగురించి వ్రాస్తూ సీమీ అంటాడు. 'అను కరణలో విభిన్నత స్పర్శామాత్రంగానయినా ఉండాలి. అనుకరణ శ్రుతిమించితే వాస్తవికతకు భంగం వస్తుంది. సాధ్య

శ్యం పొడగట్టదు. రమణీయతనే లక్ష్యంగా పెట్టుకుంటే "రంజన (flower) ప్రత్యక్షమవుతుంది".

ఈ రంజన అనే పదాన్ని ఏ అర్థంలో సీమీ ఉపయోగించాడో తెలుసుకోడానికి ఈ క్రింది వాక్యాలు ఉపయోపడతాయి. "బాలనటుని ఆకారంలోని సహజ లాలిత్యం అతని సంచలనాలన్నిటిలోనూ గోచరిస్తుంది. కాని ఇది అసలయిన రంజనకాదు. ఈ రంజన అతని యౌవనానికి సంబంధించింది. ఉదాహరణకు వృద్ధపాత్రను నటించేపుడు ఉత్తమనటుడు వృద్ధునిమీద గౌరవభావం, అతనిలోని సంస్కారం ద్యోతకం చేస్తాడు... వృద్ధుడు నడుం వంచి నడుస్తాడుగదా, శరీరం జీర్ణించి వుంటుందిగదా అని నటుడు వృద్ధుని కేవలం అనుకరిస్తే వార్ధక్యాన్ని ప్రదర్శింపగలుగుతాడేగాని రంజన లోపిస్తుంది. వృద్ధపాత్రలను అభినయించేటపుడు అవయవాలను కొంచెం ఆలస్యంగా సరిగ్గా తాళంపడగానే ఆడించాలి. ఈవిషయం మనసులో ఉంచుకుంటే నటుడు ఎంత చలాకీగానైన నటించవచ్చు. వృద్ధాప్యంలో అవయవాలు భారంగాఉంటాయి. సరిగా పనిచేయవు. సంచరించాలని సంకల్పం ఉంటోందిగాని దానికి తగిన సామర్థ్యం ఉండదు. ఇటువంటి విధానాలలోనే అసలయిన అనుకరణ ఇమిడి ఉంటుది.

"వేశ్యపాత్రగాని, పిచ్చిదానిపాత్రగాని నటించేటపుడు చేతిలో విసనకర్రగాని మరేవస్తువయినా ఉంటే దానిని బిగపట్టి పట్టుకోరాదు. దుస్తులు పాదాలు కనిపించకుండా జీరాడరాదు. నడుం వంచరాదు. భంగిమ సొగసుగా ఉండాలి. రొమ్ము వెనుకకు విరిచితే ప్రేక్షకులవైపు తిరిగినపుడు అసహ్యంగా ఉంటుంది. ముందుకు వంచితే ప్రేక్షకులనుంచి వెనుదిరిగేటపుడు అసహ్యంగా ఉంటుంది. మరీ నిఠారుగా నిలబడితే స్త్రీలాగా గోచరించదు. చేతులు ప్రేక్షకులకు కనపడనీయరాదు. జాకెట్ల చేతులు పొడుగుగా ఉండాలి.

"భూతంవేషం వేసినపుడు ఆకారం భయంకరంగా కనిపించినా లోపల మానవహృదయం ఉన్నట్లు ప్రేక్షకులకు అనిపించాలి ... అసలు భూతాన్ని చూసినవాడెవడూ లేడు కాబట్టి నటుడు ఊహాకు దానిని వదలివేయాలి. కాని రమణీయతనుమాత్రం లక్ష్యంగా పెట్టుకోవాలి.

"పిల్లవాడు తప్పిపోయి తిరిగి తల్లి తండ్రులకు దొరికిన దృశ్యం చిత్రించేటప్పుడు ఒకరినొకరు కావిలించుకుని అదేపనిగా ఏడ్వవలసినట్టు నాటకకర్త వ్రాయరాదు ఆ దృశ్యంలో ఎంత బాగాచేసిన ప్రేక్షకులకు విసుగెత్తి 'మా భావాలను యిలా రేకెత్తించవద్దు' అంటారు.

"కోపంగా ప్రదర్శించేటపుడు నటుడు శాంతం నశించినట్లు చూపగూడదు. అలా చూపితే అది కోపం ప్రదర్శించడం కాదు. రాక్షసత్వం ప్రదర్శించి నట్టవుతుంది. శరీరం తీవ్రమైన ప్రక్రియలో ఉన్నప్పుడు కాళ్ళు, చేతులు దొంగచాటుగా కదులుతున్నట్లు అనిపించాలి. పాదాలు చురుకుగా ఉంటే శరీరాన్ని నిశ్చలంగా ఉంచాలి. ఇటువంటి విషయాలు వ్రాతద్వారా బోధించేవి కావు. ప్రదర్శించి చూడాలి."

# సురభి నాటక సమాజ సంక్షిప్త చరిత్రలు

### శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి.

నిర్వాహకులు శ్రీవనారస సుబ్బారావు, కోటేశ్వరరావుగార్లు. ఆంధ్రనాటక కళోద్ధారకులును ఆంధ్రనాటక కళాపరిషత్సంస్థాపకులునగు శ్రీ వనారస గోవిందరావు గారి స్వంత సమాజము. శ్రీ సుబ్బారావు, కోటేశ్వరరావుగార్లు గోవిందరావు గారి పుత్రులు. 70 సంవత్సరాలక్రిందట 'సురభి' గ్రామంలో శ్రీ శారదా మనోవినోదినీ సంగీత నాటకసమాజము అను పేర శ్రీ వెంకోజీసోదర త్రయముచే మొట్టమొదట స్థాపింపబడిన సమాజ మిదియే. పిమ్మట ఆంధ్రనట పితామహులు వారి ప్రసాదరావుగారు సమాజముపేరు మార్చి శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి అని పునః నామకరణము చేసినారు. కనుకనే ఈ సమాజ మును పెద్దకంపెనీ అని పిలుచుచుందురు. శ్రీ గోవిందరావుగారే మొదట ప్రధాన భూమికలు ధరించుచుండెడివారు. వారి భార్యలు, శ్రీమతి పెద్ద సుబ్బమ్మ గారును, శ్రీమతి లక్ష్మమ్మ గారును ప్రధాన స్త్రీపాత్రలు ధరించెడివారు. వీరి సమాజమునందు ఎందరో మేనేజర్లు, హీరోలు,హీరోయిన్లు చిత్రకారులు, హార్మోనిష్టులు మొదలగు కళాకారులు తయారైనారు. శ్రీగోవిందరావుగారి ఇద్దరుభార్యలవల్ల పదిమంది పుత్రికలు, ముగ్గురు పుత్రులును కలిగిరి. పెద్దవాడైన హనుమంతరావు గారు చనిపోయిరి. వారి అదృష్టమున అందరును ప్రజ్ఞావంతులే. ప్రస్తుతం ఆంధ్రలో సంచారం చేస్తూన్న తొమ్మిది పెద్దకంపెనీలలో ఆరు కంపెనీలు గోవిందరావుగారి అల్లుళ్ళూ కూతుళ్ళచేతనే నడుపబడుచున్నవి. దీనికి కారణం శ్రీ గోవిందరావుగారు తమ సంతానమును సమాజ నిర్వహణము సందును ప్రధానభూమికా నిర్వహణము నందు బాగుగా తరిఫీదిచ్చుటయే. శ్రీ గోవిందరాయ సురభినాటకసమాజ నిర్వాహకులైన శ్రీ సుబ్బారావుగారు ఉత్తమనటుడు. స్వర్గీయ విశ్వనాథ కవిరాజుగారిచే రచింపబడిన కాళిదాసు నాటకమున కాళిదాసుపాత్ర, మహానందిలో పిచ్చి రాజు పాత్ర, శ్రీ వేంకటకృష్ణశర్మగారిచే రచింపబడిన బాలనాగమ్మలో మరాఠీపాత్ర, అలెగ్జాండరు నాటకములో అలెగ్జాండరు-వీరి నటనా వైదుష్యమునకు ప్రత్యేకతగ చెప్పవచ్చును. శ్రీ కోటేశ్వరరావుగారు గొప్ప హాస్యనటుడేగాక కుంచ చేతబట్టి సీనరీలూ, సెట్టింగులూ రాయగలదిట్ట. స్వర్గీయ నాట్యవిద్యావిశారద వనారస చిన్న రామయ్యగారి వద్ద చిత్రలేఖనము కృషిచేసిన వారు. వారిసీనులు చాలవరకు శ్రీకోటేశ్వరరావు గారే తయారు చేయుచుందురు. శ్రీసుబ్బారావు గారి భార్య శ్రీమతి సత్యనారాయణమ్మ, శ్రీ కోటేశ్వరరావుగారి సతీమణి శ్రీమతి కుముద్వతి ప్రధాన భూమికలు ధరించుచుందురు. ఈ సమాజమువారు కవులను పిలిపించి క్రొత్తనాటకములు వ్రాయించి తగిన రంగాలంకరణతో వేషధారణాది ప్రయోగ విషయాలలో చాల శ్రద్ధవహింతురు. ఆధునికధ్వని విద్యుద్దీప పరికరములు కలిగి 1500 మందికి సరిపోవు ప్రేక్షకాగారముతో అన్ని కాలములయందు సంచార మొనర్పదగిన టిన్ను రేకుహాలుతో ఆంధ్రప్రజానీకమునకు నాటకకళోత్సాహము కలిగించుచున్న సమాజ మిది. ప్రస్తుతం వీరి సమాజం కర్నూలుజిల్లాలో నున్నది.

### శ్రీ విజయ నాట్యమండలి.

నిర్వాహకులు శ్రీ ఆర్. కోటయ్యగారు, వి. జయరామారావుగారు, ఆర్. శంభులింగం,

ఆర్. కోటయ్యగారలు సోదరులు. చిరకాలం ఈ సోదరులు సమాజాన్ని ఉన్నతస్థాయిలో నిర్వహించి ఇటీవల అన్నదమ్ములు భాగములు పంచుకొని రెండుకంపెనీలుగారూపొందించుకొన్నారు. శ్రీ కోటయ్య, జయరామారావు గారలు బావ మరదులు. ఇద్దరును సమర్థులైన నటులు సమాజ నిర్వహణలో ఆరితేరినవారు. నూతనోత్సాహంతో కాలగతినిబట్టి సమాజాన్నీ ప్రదర్శనాలనూ సరిదిద్దుకుంటూ అశేషప్రజాదరణ పొందిన కళాకారులు. వీరిసమాజం ఆధునిక పద్ధతులలో నడుస్తూన్నది. విస్తృతమై ప్రేక్షాగారము కలిగి పదిహేను నాటకములకు ప్రత్యేకమైన సీనరీ డ్రస్సులు కలిగి ఉన్నతస్థాయిలో నడచుచున్నది. ఈసమాజంలో, శ్రీ అందెల మల్లిఖార్జునరావు ప్రధాన పురుషపాత్రలును, శ్రీమతి ఆర్. అంజనమ్మ ప్రధాన స్త్రీ భూమికలును ధరించుచుందురు. వీరు ప్రదర్శించు నాటకములలో, గయోపాఖ్యానము, కురుక్షేత్రము, బాలనాగమ్మ, పాతాళభైరవి, కీలుగుఱ్ఱం ముఖ్యమైనవి. ప్రస్తుతం వీరి సమాజము తెలంగాణాలో సంచారము చేయుచున్నది.

## శ్రీ శారదా విజయ నాట్యమండలి

నిర్వాహకులు శ్రీ. యస్. ఏ. బాబారావు గారు. నాగరిక నాటక ప్రపంచంలో ఆదికాలపు సుప్రసిద్ధ నటీమణి స్వర్గీయ పాపాబాయిగారి కోవకుచెందిన సమాజమది. భరతనాట్యోపాధ్యాయ శ్రీ ఏ. పుల్లయ్యగారు పాపాబాయిగారి పుత్రులు. పుల్లయ్యగారి భార్య శ్రీమతి ధనలక్ష్మిదేవి. వీరికి 5 గురు పుత్రులును, ముగ్గురు పుత్రికలును గలరు. శ్రీ బాబారావు, శ్రీ ప్రకాశ్ చంద్రరావు లీలా పాపారావు, కృష్ణప్రసాద్ (బాలుడు) వీరు పుత్రులు. ప్రసిద్ధిసినిమానటి బాలసరస్వతి, కుసుమాంబ, సత్యవతి ముగ్గురు పుత్రికలు. అందరును ప్రతిభావంతులే. శ్రీ బాబారావుగారు సంగీత విద్వాంసుడే కాక మంచి నటుడు. తొలుత తన తాతగారైన శ్రీ గోవిందరావుగారి పర్యవేక్షణలో వారి కంపెనీ హార్మోనిష్టుగా సంగీతవిద్య నభ్యసించినారు. ఆంధ్ర దేశంలో పేరుగాంచిన హార్మోనిష్టులలో శ్రీబాబారావుగారొకరు. వీరుధరించే పాత్రలలో ప్రశంసనీయమైనవి, కురుక్షేత్రంలో అర్జునపాత్ర మాయాబజారులో బలరాముడు భూకైలాస్‌లో నారదుడు. వీరిసోదరుడు నటనాప్రవీణ శ్రీయస్. ఏ. ప్రకాశ్ యువకుడు. ప్రజ్ఞాపరుడు ప్రతిభావంతుడు. ప్రకాశ్ అశేషప్రజానీకాన్ని ఆకర్షించగల నటనాచాతుర్యము స్వతః పొందిన కళాకారుడు ఎన్నోచోట్ల ఘనసన్మానములు పొందినవాడు. విభిన్న రసప్రవృత్తులు గల పాత్ర లభినయించుటలో ప్రత్యేకకృషి చేసినవాడు.

శ్రీ. యస్. ఏ. చంద్రరావు నటుడేకాక రంగప్రయోజన కరములైన ట్రిక్కులు మెకానిజం, సౌండ్ లైటింగ్ చిత్రలేఖనాదులలో ప్రవీణుడు రంగస్థలముపై నిలిచి ప్రేక్షకుల నిట్టే ఆకర్షించగల ప్రతిభావంతుడు. మాయాబజారు నాటకంలో ఘటోత్కచుడు, కురుక్షేత్రంలో దుర్యోధనుడు దేవదాసులో భగవాన్. ఇతని పాత్రలలో ప్రత్యేకంగా చెప్పతగినవి. శ్రీ లీలా పాపారావు హాస్యనటనలో ప్రతిభగాంచిన యువకుడు. వివిధవాద్యాలల్లో దక్షత సంపాదించిన వాడు.

ఇతని పాత్రలలో ఎంతో చమత్కృతి సహజత్వం కనిపిస్తుంది. ముఖ్యంగా మాయబజారులో లక్ష్మణకుమారుడు హరిశ్చంద్రలో వీరదాసుడు దేవదాసు చూడదగినవి. శ్రీ బాబారావుగారి సతీమణి కోటీశ్వరి ప్రకాశ్ గారి భార్య గానకోకిల శకుంతలాదేవి ప్రముఖ స్త్రీ పాత్రలు ధరించుచుందురు. శ్రీమతి శకుంతల సహజముగ మృదుకంఠము గలిగి ప్రేక్షకుల

రంజింపజేయు గానకళనభ్యసించినది. ప్రధాన భూమికా నిర్వహణంలో ప్రతిభావంతురాలు. ఈ సమాజము ఎన్నియో పట్టణములలో ఎందరో ప్రముఖ కళావేత్తలచే ప్రశంస లందు కొన్నది. మార్కాపురం పౌరులు వీరికి ఘన సన్మానము గావించిరి. ఎస్. ఎ. ప్రకాశ్ గారి శ్రీకృష్ణ పాత్రాభినయమునకు ముగ్ధులై రజిత వేణువు సువర్ణఘంటా కంకణము నొసంగి సమాజమును బహుమానములతో గౌరవించిరి. ఇటీవల గుంటూరులో ఈ సమాజమువారు రెండు నెలలు 36 నాటకములు ప్రదర్శించిరి. ఆంధ్రనాటక చరిత్రలో అపూర్వమైన విషయమే మన 18 సార్లు కురుక్షేత్రము ప్రదర్శించుట, ఎనిమిది సార్లు మాయాబజారు ప్రదర్శించుట, గుంటూరు పట్టణమున అధికార అనధికార ప్రముఖులెల్లరు వీరి సమాజమును ప్రశంసించి సత్కరించుట ఆంధ్రనాటకరంగ చరిత్రలో ఏ యితర స్థలమున జరుగని సన్మానములు ఈ సమాజమునకు జరిగినవి. కవిపండిత ప్రముఖుల సమక్షంలో సురభికళాకారులకు శ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారి అధ్యక్షతను వైజ్ఞానిక కళాసమితి నటరాజ రజిత ఫలకమును రెండు వందలరూపాయలు నొసంగి గౌరవించిరి. స్థానిక హిందూకళాశాల నాటకశాఖవారు శ్రీకృష్ణ పాత్రధారి ఎస్. ఎ. ప్రకాశ్ కు వెండి కొరడా ఇచ్చిగౌరవించిరి. స్థానిక కళాకారుల ఆధ్వర్యంలో 500 రూపాయల విలువగల పెద్ద రజితపాత్ర ( CUP ) బహుకరించి ఎందరో కవి పండిత ప్రకాండులు సన్మానపత్రము లొసంగి సన్మానించిరి స్థానిక ఆంధ్రభాషాభివృద్ధి సంసత్ వారు తమ భవనంలో సురభి కలాకారులకు నూతన వస్త్రములొసంగి ఎన్నో రజిత పాత్రలిచ్చి ప్రత్యేకముగ సన్మానించిరి.

త్యాగబ్రహ్మ గానసభవారు రజిత కల్ప వృక్షము నొసంగి సన్మానపత్రములిచ్చి గౌరవించిరి. శ్రీ లింగాల రాఘవయ్య సోదరులు శ్రీ ప్రకాశ్ కృష్ణపాత్రకు ముగ్ధులై గజమాల వైచి రజితపాత్ర నొసంగి గౌరవించిరి, ఇట్లు గుంటూరు పౌరుల అఖండాదరణాభిమానములకు పాత్రులైనదీ సమాజము. ప్రస్తుతం కృష్ణా జిల్లాలో సంచరించుచున్నది.

### శ్రీ వెంకటేశ్వర నాట్యమండలి

నిర్వాహకులు. శ్రీ ఆర్. చిన్న వెంకటరావు గారు సురభి నాటకకళా సంఘాధ్యక్షులు. రమారమి ముప్పది యేండ్లుగా వీరిసమాజము నాటకములు ప్రదర్శించు చున్నది. శ్రీ చిన్న వెంకటరావుగారు మంచి హాస్యనటుడు. సమాజ నిర్వహణమున సమర్థుడు. వీరి సతీమణి శ్రీమతి సుభద్రమ్మ వివిధ రసభావాభినయ విజ్ఞానముగల నటీమణి - పాత్రౌచితినీ - భావప్రాగల్భ్యతను విమర్శాదృష్టితో పరిశీలించి ప్రదర్శించు నేటి కాలపు నటీమతల్లులలో ఈమె అగ్రగామి ఆంధ్రనాటక కలాపరిషద్గౌరవములంది, ఎన్నో సన్మానములు పొంది, అశేష ప్రఖ్యాతి నార్జించిన మధురగాయిని. ఆమె రంగస్థలముపై మహోజ్వల నటిగా ప్రదర్శనాన్నంతటిని రసమయం చేయగల మహానటి. శ్రీమతి సుభద్రమ్మ గారు స్వర్గీయ గోవిందరావుగారి పుత్రిక. శ్రీ, ఆర్. ధాశరథిరావు- భోజరాజు సమాజాధిపతియైన ఆర్. వెంకటరావుగారి పుత్రులు. దాశరథిరాము,మంచిహాశ్యనటుడేకాక సమాజమునకు సంగీతదర్శకుడు. సులిశితమైన హాశ్య ప్రదర్శనమున మిగులనేర్పరి. శ్రీభోజరాజు వివిధభావ ప్రవృత్తులుగలపాత్రలను సమర్థతతో నిర్వహించగల యువకనటుడు- మరాఠీ దుర్యోధన ప్రముఖ పాత్రలుసమర్థతతో నటించి అశేష గౌరవములొందినాడు. ఆధునిక పరికరాలతో సువిశాలమైనటెన్ రేకు ప్రేక్షకాగారముకలిగి పదిహేనునాటకముల కుపైగా ప్రదర్శించగల నిత్యసంచారనాటక సమా

జమిది. ప్రస్తుతం పశ్చిమగోదావరి జిల్లాలో పర్య టించుచున్నది.

### శ్రీ గజపతి నాట్యమండలి

నిర్వాహకుడు :- శ్రీ అవేటి రమణకుమార్.

శ్రీ అవేటి వేంకటస్వామిగారు 1934 సంవత్స రమునం దొక సమాజము స్థాపించిరి. వెంకట స్వామిగారి కిద్దరుభార్యలవల్ల నలుగురు పుత్రులు. వారిలో శ్రీ రామయ్యగారు, నాట్యకళాధురీణ నాగేశ్వరరావుగారు ఒకతల్లి బిడ్డలు. శ్రీ ప్రసాద రావుగారు, చలపతిరావుగారూ ఒకతల్లి బిడ్డలు. 1947 ప్రాంతాల్లో వీరు విడిపోయి రెండు కంపె నీలుగా ఏర్పడిరి. అప్పుడు ప్రసాదరావు, చల పతిరావుగార్లు ఒకతల్లి బిడ్డలుగా ఒక కంపెనీ పెట్టుకొనిరి. ఇటీవల ఆ సోదరులిదరు విడిపోవుటచే యీ సమాజ మేర్పడినది. శ్రీ రమణకుమార్ ప్రసాదరావుగారి పుత్రుడు, సమరుడైన నటుడు. కాని వారి సమాజమునకు సంగీతదర్శకుడు, హార్మోనిష్టు, సమాజనిర్వాహణమున నేర్పు గల వాడు. శ్రీ ప్రసాదరావుగారి భార్య గోవింద రావుగారి పుత్రిక శ్రీమతి శాంతకుమారి.

### శ్రీ శారదా మనోవినోదినీ సభ.

ప్రఖ్యాత నటులు - చిత్రకారులు - నాట్య కళా విశారద వనారస చిన్నరామయ్యగారి పుత్రులు శ్రీ అబ్బాజీరావుగారు ఈ సమాజాధిపతి. అబ్బాజీరావుగారు బాల్యంలో చిరకాలం విజయ నగర సంగీత కలాశాలలో విద్యాభ్యాసంచేశారు. స్వర్గీయ చిన్న రామయ్యగారు ప్రసిద్ధనటులే కాక కంపెనీ నిర్వాహణలో నేటి సురభి సమాజా లకు మార్గదర్శకులు. సురభి సమాజ మూల పురుషులలో ఒకరు. వారు సుప్రసిద్ధనటులే గాక తెరలు రాయుటలో సిద్ధహస్తులు. డ్రస్సులు - విగ్గులుకూడా తయారుచేసెడివారు. చిరకాలం శ్రీ చిన్నరామయ్యగారు సమాజాన్ని నిర్వ హించి ఎన్నో కొత్తనాటకాలు ప్రదర్శించిన ప్రతిభావంతులు అబ్బాజీరావు గారు తండ్రిగారి అడుగుజాడలలో సమాజాన్ని నిర్వహిస్తున్న వారు. హీరో పాత్రలు ధరించి ప్రజాదరణ పొందిన ఉత్తమనటుడు శ్రీ అబ్బాజీరావు. అతని సతీమణి శ్రీమతి సీతామహాలక్ష్మి. హీరోయిన్ పాత్రలు ధరించి మంచిపేరు సంపాదించినారు. వీరి సమాజము ఆధునిక రంగపరికరములు కలిగి రమారమి పదిహేను నాటకములు ప్రదర్శించ గలదు. అబ్బాజీరావుగారు సమాజ నిర్వాహణలో మంచి నేర్పుగలవారు. ప్రస్తుతము వీరు శ్రీకా కుళం జిల్లాలో సందర్శించుచున్నారు.

### శ్రీ వసుంధరా నాట్యమండలి

ఈ సమాజాధిపతి శ్రీ ఏ. రామచంద్రరావు. వీరిసతీమణి ప్రఖ్యాత రంగస్థల నటి శ్రీమతి వసుంధర (గోవిందరావుగారి పుత్రిక). శ్రీ రామ చంద్రరావు ఆధునిక భావాలుగల యువకుడు. స్వశక్తిచేత సమాజాన్ని నెలకొల్పి నిర్వహించు చున్న ఉత్సాహవంతుడు. దినదినాభివృద్ధి పొందుచున్న వీరిసమాజమునకు శ్రీమతి వసుంధర మూలకారణము. ఆమె నాటనా సామర్థ్యము ప్రజాకర్షనీయమైనది. శ్రీ రామచంద్రరావుకూడ చాలా నాటకములలో పాత్రలు ధరింతురు. పది నాటకములవరకు వీరి సమాజము ప్రదర్శింప గలదు. ప్రస్తుతము వీరు విశాఖజిల్లాలో పర్యటన మొనర్చుచున్నారు.

### శ్రీ రమా సత్యనారాయణ నాట్యమండలి.

సురభి సమాజాలలో ప్రత్యేకతగల సమాజ మిది. దీని నిర్వాహకులు వనారస రామయ్య గారు. జనగాం రామయ్యగారంటే చాలా మందికి తెలుస్తుంది. చిరకాలం క్రిందట శారదా మనో వినోదినీ సమాజం అన్నపేర శ్రీ రామయ్య గారి తండ్రి వజీరరావుగారు సమాజాన్ని నిర్వ

పించారు. శ్రీ రామయ్యగారు చాలాకాలం కంపెనీ నడిపి మధ్య ఆపివేసి యిటీవల అనగా 1953 లో శ్రీ రమా సత్యనారాయణ నాట్యమండలి అను పేరుతో మరల కంపెనీ స్థాపించి క్రమ క్రమంగా అభివృద్ధిచేసినారు. శ్రీ రామయ్య విలన్ పాత్రలు ధరించుదురు. మంచి హార్మోనిష్టు. వీరి సతీమణి రమాదేవిగారు నాయకీపాత్రలు ధరింతురు. అనుభవంగల నటీమణి. వీరి సమాజం లో అరవైమంది స్త్రీపురుష బాలవృద్ధులు గలరు. స్వంత టెన్ను రేకుహాలు, సరిక్రొత్త రంగాలంకరణములు, ఆధునిక యంత్రములుగల పెద్దకంపెనీ. ప్రస్తుతం హైదరాబాద్ సరిహద్దులలో నున్నది.

శ్రీ గోవర్ధన నాట్యమండలి.

స్వర్గీయ అవేటి వెంకటస్వామి గారి పుత్రులు నలుగురిలో ఆఖరివాడు శ్రీ చలపతిరావు, శ్రీ గోవర్ధన నాట్యమండలి నిర్వాహకుడు. చాలాకాలం వీరి అన్నగారైన అవేటి ప్రసాదరావుగారితో కలిసి నాటకాలు ప్రదర్శించెడివారు. ఇటీవల వేరుపడి గోవర్ధన నాట్యమండలి స్థాపించిరి. వీరు హాస్యరసపాత్రలు అభినయించుటలో ప్రసిద్ధులు. వీరి సతీమణి నాగలక్ష్మి (గోవిందరావుగారి పుత్రిక) హీరోయిన్ పాత్రలు ధరించుచుండును. నలభై మందికి పైగా గల సమాజ మిది. అన్ని హంగులు కలిగి పన్నెండు నాటకాలు ప్రత్యేక సీనరీ డ్రస్సులతో ప్రదర్శించగల పెద్ద సంస్థ. ప్రస్తుతం వీరి సమాజము రాయలసీమలో నున్నది.

న్యూ పూర్ణానందా డ్రమెటిక్ థియేటర్సు.

1934 లో సమాజము స్థాపింపబడినది. స్వర్గీయ అవేటి వెంకటస్వామిగారు వ్యవస్థాపకులు. శ్రీ రామయ్య, ప్రసాదరావు, నాగేశ్వరరావు, చలపతిరావుగార్లు శ్రీ వెంకటస్వామి గారి పుత్రులు ఈ నలుగురూ శ్రీ గోవిందరావు గారి అల్లుళ్ళు. 1943 లో సోదరులు విడిపోయిరి. నాగేశ్వరరావుగారు ప్రత్యేకంగా న్యూ పూర్ణానందా డ్రమెటిక్ థియేటర్సు నెలకొలిపి అభివృద్ధిచేసిరి. నాగేశ్వరరావు విద్యాధికుడు - ఉత్తమ నటుడు. ప్రధానపాత్రలు ధరించుచుందురు. అతని సతీమణి నాట్యభారతి చెల్లాయమ్మ ప్రముఖ స్త్రీపాత్రలు ధరింతురు. నాగేశ్వరరావు విభిన్నరసపు వ్యక్తులు గల పాత్రలభినయించుటలో సిద్ధహస్తుడు. అచిరకాలంలోనే ఆంధ్రులు నాగేశ్వరరావు నటనాప్రావీణ్యతను గుర్తించిరి. నెల్లూరు పౌరులపక్షాన ప్రస్తుత మంత్రివర్యులు గౌ॥ శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి జామీన్ రైతు సంపాదకులు: శ్రీ రామానాయుడు,మందాకిని సంపాదకులు: శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగార్లు: నర్తకులు శ్రీ పైడా సుబ్బరామయ్య శ్రేష్ఠిగారు నాట్యకళాధురీణ బిరుద మొసంగి నాగేశ్వరరావుగారిని సన్మానించిరి. సురభి గ్రామవాస్తవ్యులు నాగేశ్వరరావుగారికి ఘంటాకంకణ మొసంగిరి. ఇటీవల బాపట్ల విజ్ఞానసమితి శ్రీమతి చెల్లాయమ్మ, నాగేశ్వరరావుగారలకు సన్మానము గావించి, నాగేశ్వరరావుగారికి నటరాజేంద్ర బిరుదమును, శ్రీమతి చెల్లాయమ్మకు నాట్యభారతి బిరుద మొసంగిరి. నాగేశ్వరరావు సోదరి శ్రీమతి జానకీదేవికి నాట్యకళాసరస్వతి బిరుదమొసంగి రజతపాత్ర లిచ్చి గౌరవించిరి. శ్రీమతి జానకమ్మ, వి. ఈశ్వరరావుగారి సతీమణి. ఈశ్వరరావు ఈ సమాజమునకు హార్మోనిష్టు మంచి సంగీత విద్వాంసుడు. శ్రీమతి జానకమ్మ ప్రధాన స్త్రీ పాత్రలనే గాక, కురుక్షేత్ర నాటకంలో శ్రీకృష్ణ పాత్రల అసమానప్రతిభతో నటించి ప్రేక్షకుల మన్ననలందిన విదుషీమణి. క్రొత్త నాటకములు ప్రదర్శించుట యన్న నాగేశ్వరరావుగారికి కుతూహలము మెండు. 1960 జనవరి 30 తేదీని తెనాలి వర్తకసంఘమువారు నాగేశ్వరరావు దంపతులకు కనకాభిషేకము గావించి నవరత్నాలహారము బహుమాన మొసంగిరి

తెనాలి పౌరులు, కళాకారులు పలువిధములైన బహూకృతులొసంగిరి. జనవరి 29 వ తేదీని తెనాలిలో సురభి నాటకకళాసంఘ సప్తతి వార్షికోత్సవములు విద్యామంత్రి ఎస్. బి. పి. పట్టాభి రామారావుగారి అధ్యక్షతను నిర్వహించిరి. నాగేశ్వరరావుగారు సురభి నాటక కళాసంఘ కార్యదర్శి - విద్యామంత్రి పట్టాభిరామారావు గారు నాగేశ్వరరావును ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ సభ్యులుగా నియమించినట్లు నివేదించిరి. అభ్యుదయ భావాలుగల ఉత్తమ నటుని అధ్వర్యాన దినదినాభివృద్ధి గాంచుచున్న సమాజమిది. ప్రస్తుతం గుంటూరు జిల్లాలో పర్యటించుచున్నది.

పైనిపేర్కొన్న పదిసమాజాములేకాక సురభి నాటక కళాసంస్థకు చెందిన 26 చిన్నసమాజములతో విశాలాంధ్ర వివిధ ప్రాంతములలో నిరంతరము సంచారముచేయుచు నాటక ప్రదర్శనములు గావించుచున్నది. ఆ సమాజ నిర్వాహకుల పేర్లు దిగువనుదాహరించు చున్నాము.

1. శ్రీమతి పూర్ణిమ రామయ్యగారు
2. శ్రీ ఆర్. వెంకోబరావునారాయణ శాస్త్రిగార్లు
3. ,, ఆర్. పుల్లయ్య శంభులింగంగార్లు
4. శ్రీ వి. వెంకోబరావు
5. శ్రీమతి ఆర్. కామాక్షీబాయి
6. ,, వి. మోహనరావు
7. ,, వి. చక్రపాణి
8. ,, వి. చిన్నివీరాంజనేయులు
9. ,, ఆర్. సత్యనారాయణరావు
10. ,, వి. తిరుపతిరావు
11. ,, వి. రామచంద్రరావు
12. ,, ఆర్. వెంకటరావు
13. ,, వి. కోటేశ్వరరావు
14. శ్రీమతి వి. పద్మావతీబాయి
15 శ్రీమతి వి. గౌరీబాయి
16. ,, ఆర్. మహేశ్వరరావు
17. ,, ఆర్. లక్ష్మణరావు
18. ,, ఎ. వెంకటరావు
19. ,, వి. నీలవేణీబాయి
20 ,, ఆర్. జయరామారావు
21. ,, ఆర్. మనోరమ
22. ,, వి. సత్యనారాయణ
23. ,, యస్. రెడ్డప్ప
24. ,, యస్. రెడ్డన్న
25. ,, వి. విఠోబరావు
26. ,, ఆర్. తులసీరావు



"నాట్యకళాధురీణ"

# సురభి నాగేశ్వరరావుగారి

## నాట్యకళా వైదుష్యము

సినిమాఛాయలలో నాట్యరంగం మరుగై పోయి, బాడుగనాటకాల అరాచకంలో సంకీర్ణమై రూపరి వెలవెలపోయిన యీ దినాలలో మరల ఒక ఆశారేఖ కారుమబ్బులలో కనిపిస్తున్నది. ఒక సభను సర్వాంగశోభతో వెలయింపజేసిన నెల్లూరు అమెచ్యూరిజం ఏనాడో అంతరించిపోయింది. కళను ఉపాసిస్తూ పొట్టను పూడ్చుకొన్న బళ్ళారిసభల స్థానం లేకపోయినా మైలవరంవారు ఒక వెలుగు వెలిగినారు. వీరికి కన్నయ్య (వీరు తెలుగుసాతాని) కంపెనీ ఎక్విప్‌మెంటు లేకపోయిన సుశిక్షితమైన వీరి నాటకాలు తెలుగునాటకాలపేరు నిలిపినవి.

ఆ సమయంలో రేగిన వుత్సాహం బాడుగ నాటకాలను కుక్కమూతి పిందెను పుట్టించినది. కన్నడులలో వీరన్న గుబ్బినాటకాలు గూడ సినిమా దురాక్రమణవల్ల భిన్నమైపోయినవి.

ఇట్టి నిరాశాపూరిత ధ్వాంతదినాలలో నాగేశ్వరరావుగారి సురభినాటకసభ సురభిళద్రవ్యంవలె కళాపూర్ణ వాసనల విరజిమ్ముచూ, ఆంధ్ర నాట్యరంగలక్ష్మికి పునఃప్రతిష్ఠాపన గూర్చి, నవ యుగానికి తేజోమయమైన ఉషాతార అయింది. అది సురభిసంస్థ. కడపజిల్లా సురభిగ్రామంలో మరాఠీగడక్ నాటకాల ప్రోద్బలంవల్ల ఒక రెడ్డిగారి ఆదరాన పుట్టింది. ఈ గడగ్‌నాటకాలే బళ్ళారి కృష్ణమాచార్యులను ఆంధ్రనాటక పితామహుడుగా చేసినది. సురభిసభ యిప్పటికి ఆరు శాఖలైంది. అందు తలమానిక మనదగిన నాగేశ్వరరావుగారి సభ ఇప్పుడు నెల్లూరుజిల్లాలో పర్యటిస్తూ ప్రస్తుతం ముత్తుకూరులో ప్రదర్శిస్తున్నది.

ఇది మోడీపార్సీ, గుబ్బికన్నడ థియేటర్లకు "పాకెట్ ఎడిషన్"గా వున్నది. సొంతరేకుల పెండాలు - ఎలెక్ట్రిక్ ఫోకసులు - మనోజ్ఞమైన సెట్టింగులు నాగేశ్వరరావుగారి ప్రతిభావంతమైన బృందానికి శోభను గూరుస్తున్నవి.

### మాయలమరాఠీ

వీరి నాటకాలలో మాయలమరాఠీ మాస్టర్ సీను. సినిమాలో భిన్నదృశ్యాలను ఇన్‌సర్షనులతో చూపినట్లు కొన్ని ఘట్టాలను మూడు స్టేజీలలో భిన్నభిన్న భావాలను - భావఫలితాలను చూపి కథను చక్కబరచి భావాన్ని హత్తుకొనేటట్లు చేస్తున్నారు. రేడియో ఘంటమాదిరి తప్పకుండా కాలనియమానికి ప్రారంభించి - ముగించడం వీరిదగ్గర మనవారు నేర్చుకోదగినది. ఇది నాటకరక్తికి యెంతో సహాయపడుచున్నది.

అర్థవంతమైన భాష, సమయోచితమైన శక్తిప్రపూర్ణ సంభాషణలు- వీటిని నటకులు గొంతుకు లేక, ప్రాంటింగుపై ఆధారపడక, కంఠగల చిక్కటి వాక్కులతో, తదనుగుణ్యమైన హావభావాలతో సజీవముచేసి నాటకాన్ని సర్వతోముఖ చైతన్యంతో ప్రేక్షకుల ప్రమోల నెలకొల్పుతున్నారు. ప్రధానపాత్రలతోబాటు కొన్ని యితర పాత్రలుగూడ దుస్తులసౌభాగ్యం కూర్చగలిగితే నాటకం యింకా యెంతో రాణించగలదు. యింకొకవిశేషం. ఇందు హాస్యం పాలతో చక్కెరవలె వలసిపోయి వెగటు పుట్టించడంలేదు.

### కొందరు నటకులు

రాణి వేసిన వజ్రమాంబ ప్రతిభావంతురాలు.

పేదరాలు పెద్దమ్మగా రసవత్తరంగా చేసింది.

సంగు (శారదాంబ) స్థానం-నటనను జ్ఞప్తికి దెచ్చింది. స్టేజీమీద యీమె చూపిన స్వచ్ఛంద రసవత్తర ఔచితీపూర్ణ విహారం ప్రథమశ్రేణికి చెందుతుంది. లాలన, ప్రణయము, క్రోధము, స్త్రీ జనసహజ విన్యాసములు కన్నులపండువు. వాచకము ప్రాణనాతము.

బాలనాగమ్మ శ్రీమతి చెల్లాయమ్మ సహజ సౌందర్యవతి. తెచ్చుకోలులేని నటన-వాచకం-కీటికి తగినపాట- విశాలనేత్రాలు ప్రకటించే భావప్రదర్శనము బాగున్నవి. అప్పుడప్పుడువచ్చే ఆడింగికోపం-చేతుల విసరులు అప్పటంగావుంటవి. ముఖ్యంగా చెరలో పుత్రుని కలుసుకొనే ఘట్టం హృదయాల స్పందింపజేసింది.

మూడు వేషాలు వేసిన బాలవర్ధిరాజు వేషధారిణి జానికమ్మ కొంతసాధనతో వన్నెకెక్క గలదు. కృత్రిమవాసన లేకుండా చేసింది. బాలరాజుగా మాతృసంయోగ మప్పుడు బాగా నటించింది.

చాకలితిప్పడు ప్రకాశరావు. మన పేరిగాడికి కాపీఅయినా చాలాబాగా, మితిమించిపోకుండా చేసినాడు. ఇతడు సహజనటకుడు. ఆడియన్సులో వుండిన ఒక చాకలికి చదివినా సంస్కారం లేనందున కొంచెం కష్టంగా వుండినా ప్రేక్షకులు రొంబా నెల్లా ఎంజాయ్ చేసినారు.

మరాఠి

నాట్యరంగ సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడగుటకు అర్హుడైన నాగేశ్వరరావుగారి నాట్య వైదుష్యం వర్ణిస్తే, చూడనివారు అతిశయోక్తి అని అనుకొని తీరుతారు. వీరు Every inch an Actor. నాగరాజరావు-బళ్ళారి రాఘవాచారి. తర్వాత నాటకంలో (డిక్షన్) నాకు యింత బాగా నచ్చినవాడులేడు. సినిమాల - చంద్రమోహన్ గనునానికివస్తాడు. మాధవపెద్ది, డెలివరీకంటే ఇది స్ఫుటము-విరైల్ (పురుషవంతము). వేషధారణలో గోవిందరాజుల సుబ్బరావుకంటె ఉచితజత వున్నది. రసవత్తరమైన రచనకు ప్రాణంపోసి నిలిపినాడు. భావము హానము నటనను శోభావంతం చేసినవి. నిత్తుత్త పాణి ధైర్యము-ఆత్మవిశ్వాసద్యోతకహాసము, ధిక్కారపూర్ణ అట్టహాసము, శాంతము, మానవ సహజ స్త్రీవాల్యము-యీ భావశబలతను ఒక నటకపండితునివలె ప్రదర్శించినాడు. నిగర్వి, సులభుడైన నాగేశ్వరరావు-మరారిగా భయం గొలుపుతాడు. జంగమేశ్వరుడై చెరప్రవేశంలో నిశ్శబ్ద క్రోధమూర్తియై ప్రేక్షకుల వణకించినాడు. వీరు ప్రవేశించిన ఘట్టాలు చాలా రియలిస్టిక్ గా నాటకమన్న సంగతిని మరపింపజేయ గలిగినవి. మారారి మాయదారి ధైర్యను ధీరోదాత్తుడివలె నటించి పాత్రకు గురుత్వాన్ని గూర్చినాడు. గొప్ప నటకుడనుటకు సందేహంలేదు.

ఈ మహానటకునికి, ఆనాడు నెల్లూరునుండి వచ్చేసిన నటకులు, విమర్శకులు, రచయితలు, అధికారులు, పెద్దవారులు అందరూ కలసి

నా ట్య క ళా ధు రీ ణ

అను బిరుదం ఒసంగి గౌరవించుట ఎంతయో సముచితంగా వున్నది.

30 తేదిన యీ ప్రదర్శనాన్ని దర్శించిన మన పైడా కేసరిమిత్రులు మారారి పాత్రధారి నాగేశ్వరరావు, బాలనాగమ్మ పాత్రధారిణి చెల్లాయమ్మగార్లను చెరియొక సువర్ణపతకంతో బహూకరించి, వారి అర్హతకు మెరుగుపెట్టినారు.

ఇట్టి రసోచిత ప్రదర్శనాలను నెల్లూరు కళాభిజ్ఞులుగూడ దర్శించు అవకాశము గలించవలెనని నాగేశ్వరరావుగారిని కోరుచున్నాము.

[నాగేశ్వరరావు నెల్లూరు జిల్లాలో సంచరించుచున్నప్పుడు 2-1-48 తేది జమీన్ రైతు పత్రికలో ప్రకటింపబడియున్నది.]

శ్రీ సురభి నాటకకళాసంఘ సప్తతితమ వార్షికోత్సవ సందర్భమున

నాట్యకళాధురీణ, **శ్రీ ఎ. నాగేశ్వరరావు గారికి**

*కనకాభిషేక నవరత్నమాల బహూకరణ సన్మాన సమయమున అర్పించు*

# పద్య రత్న ము లు

రచన:

తెల్లాకుల వెంకటేశ్వరగుప్త

శ్రీరామక్ష్మాపాలుడు
శ్రీరామను గూడి కూర్మిం జిదు కనుల నిన్
హేరాళకీర్తి ధనముల
ధారాళముగా నొసంగి ధర నిను గనుతన్.

నటనాంభోనిధి వీచువీచికల విన్నాణంబుగా దోచి ప్ర
స్ఫుటమై యొప్పి, రసోచితంబగు కళాశోభాయమానంబు మా
కిట గన్పండువజేసె నీకు సరి నీవే శ్రీసుదాంధ్రావనిన్
నటరాజేంద్ర! కళాతపస్వి! భళిరా! నాగేశ్వరా! ధీవరా!

పాపరాయుని వీరపటిమ చాటినయట్టి మాన్యుడా పిల్లలమఱ్ఱి శక్తి
భయదవృత్తినజేయు ప్రత్యక్ష యముడు గగ్గయ్య రౌద్రంపు నఖండధాటి
అపర శుయోధనుం డన నాట్యరంగ ప్రవిష్టుడా మాధవపెద్ది కీవి
మేటి చతురుడు పల్నాటి బ్రహ్మన్న గోవిందరాజుల కళావిభ్రమంబు
హృద్యంబుగా పద్యగద్యంబు లవలీల తేటపర్చెడి పులిపాటి మేటి.

అతుల నటనాచతురత చిత్రాంగి యనగ
వెలుగు స్థానము నరసింహార్యు కులుకుదనము
లలి విశాలాంధ్ర నాటకరంగ కీర్తి
కాటపట్టగు నిల మా తెనాలియందు
గౌరవంబందు భాగ్యము గల్గె నీకు
అందుకొను మాదు సన్మాన మందుకొనుము.

ఒక్కరు డొక్క వేసమున నురి నఖండ యశమ్ము గాంచు నిం
కొక్క డమేయగానమున నున్నతికెక్కు నపారశక్తి వే
రొక్కడు హావభావముల నుజ్జ్వలకీర్తి వెలుంగుచుండు నీ
వొక్కడ వన్నిభంగుల మహోన్నతి బొందితివా నటనాగ్రణీ.

కృతి కింపై తగుమాట హాయి మది రేకెత్తించు మేల్పాట, హే
స్థితినైనన్ లయఙ్గోని మీటా నటన శోభించు నీయాట స
మ్మతి హాస్యమ్ముల నవ్వులాట గనగా మా యుల్లముల్ రంజిలన్
సతతానందముతోడ మే మొసగు సన్మానంబు నీ వందుమా.

కనుమూసి తెఱచునంతన చిత్రముగ దోచు రంగస్థలమ్ము సెట్టింగు రంగు
రంగులమార్పు లైటింగుహంగుల కూర్పు నటనటీమణుల విన్ననువు నేర్పు
నేర్పున క్షణమునన్ జేర్చు సీనింగుల తీర్చెడివారి యతీతశక్తి
శక్తి నాసక్తి బల్ రక్తిగూర్చెడి వాద్యముల సొంపుపెంపు సమ్మదము నింపు.

ఇంపితంబగు కథల వ్రాయించు తెంపు
తెంపు జూపెడి నీదు త్యాగంపు గుణము
వలన రాణించె నౌర యీ పట్టణమున
చంద్రునకు నూలుపోగను చందముగను
అందుకొను మాదు సన్మాన మందుకొనుము.

తెనాలి
30-1-60

ఇట్లు
వర్తకసంఘము.



'నాట్యకళాధురీణ', 'నటరాజేంద్ర'

## శ్రీ అవేటి నాగేశ్వరరావుగారికి

విజ్ఞాన సమితి (బాపట్ల)

సమర్పించిన

# ప్రశంసాపత్రము

నాగేశ్వరరాయ!

సర్వజన క్రీడనీయకమును, సర్వశాస్త్రార్థ సంపన్నమును నైదాఘ షడ్క్రతువని మహనీయులైన మహర్షులచే ప్రశంసిత మైన నాట్యకళకు ఆలవాలమైనది మీవంశం. అవిచ్ఛిన్నంగా ఎనుబది వసంతాలకాలం ఆంధ్రలోకానికి రసమధువును నిత్యం పంచిపెడుతూ నాటక కళాసంఘసేవకు జీవితసర్వస్వాన్ని అంకితంచేసిన మీ వంశ చరిత్ర ఎంతో శ్లాఘ్యమైనది.

నటశేఖరా!

నాటక కళా విజ్ఞానం వెన్నతో పెట్టిన విద్యగా పుట్టిన నీవు, జన్మతః నటుడవు. నిత్య నూతనమై విరాజిల్లుతూ అనంత వైవిధ్యంతో ఆనందామృత ప్రదానంచేస్తూ అఖిల జనకీర్తి పాత్రమై, నీ నటనా కౌశలం నిరుపమాభివృద్ధి నందటానికి వినయ గుణోపేతుడవైన నీ శిష్టజనసేవాసక్తి, అవిరళ శిక్షాదీక్షలే కారణాలని మా దృఢ విశ్వాసం.

నటకోవిదా!

బహురస పాత్రాభిశోభితమై బహుముఖీన పాండితీ ప్రదర్శకమైన నీ నాట్యశ్రీ శిల్పించిన హరిశ్చంద్ర, శకార, దుర్యోధన, శ్రీరామాది పాత్రలు మరుపురాని మనోహర శిల్పమూర్తులు. ఆంధ్రుల తొలినోము ఫలాలుగా జన్మించిన నటకళా కోవిదులలో అగ్రేసరుడవై ఉపజ్ఞాపరిపోషితమైన ఉత్తమనటనా కౌశలంతో ఆంధ్రనాటకరంగ చరిత్రలో నీవొక సువర్ణ పత్రాన్ని సంపాదించుకున్నావని అనటంలో ఎట్టి అతిశయోక్తిలేదు.

నాట్యకళాధురీణా!

నాటకసమాజ నిర్వహణం కత్తిమీద సామువలె కష్టసాధ్యమైన కృత్యమని కళాపోషకులైన అనేకుల అనుభవం వల్ల వెల్లడియైన విషయం నాటకరంగ జీవితంలో ఒకనాడు అందెవేసిన చెయ్యి అని అనిపించుకున్న ఆంధ్రదేశంలో కళాభిమానం ఈనాడు ఎంతగానో సన్నగిల్లుతున్నది. ఇట్టి స్థితిలో ఎన్నో కష్టనష్టాల కోర్చుకుంటూ చిన్ననాడే నీమీదపడ్డ నాటకసమాజ నిర్వహణ భారాన్ని స్థిరచిత్తంతో స్వీకరించి నిర్వహణ కళావతంసుడవై నీ సతీమణి నాట్యభారతి శ్రీమతి చెల్లాయమ్మ సహకారంతో నడుపుతూన్న నీకివే మా అభివందనాలు. నిరంతరాభివృద్ధి నొందుతూ నిత్య నూతనంగా తన్ను తీర్చి దిద్దుకుంటూ ఉత్తమరంగ మంటప స్వరూప నిరూపణం చేస్తూ ఆదర్శప్రాయంగా మీ అధ్వర్యాన నడుస్తూన్న నాటక సమాజంతో పోటీరాగలది యావదాంధ్రలో మరొకటి లేదనటంలో ఎట్టి విప్రతిపత్తిలేదు.

కళాతపస్వీ!

దేశం నలుమూలలా పండిత జనామోదకరాలైన నాటక ప్రదర్శనాలిస్తూ, 'ప్రజల గౌరవాభిమానాలే పాథేయాలుగా నిత్యమూ రససాంయాత్రికులై నిర్మలానురాగధూపితులై వెలుగొందుతూన్న మీ దంపతులు ధన్యజీవనులు. ఇంకా నవ్యమార్గాలను అన్వేషించి నవనవ ఫణితుల్లో మీ నాటక సమాజాన్ని తీర్చి దిద్దుకుంటూ నిరంతరాయంగా మీ కళాతపస్సును కొనసాగించటానికి అత్యావశ్యకాలైన సకలాయురారోగ్యైశ్వర్యములను పరమేశ్వరుడు మీకు ప్రసాదించుగాక.

బాపట్ల
20—4—59

ఓం తత్సత్

ఇట్లు
ప్రవచించు
విజ్ఞాన సమితి

# న్యూ పూర్ణానంద డ్రమెటిక్ థియేటర్సు



న్యూ పూర్ణానంద డ్రమెటిక్ థియేటర్స్ నిర్వాహకులు :
నాట్యకళాధురీణ,
శ్రీ ఎ. నాగేశ్వరరావు
(సురభి నాటకకళాసంఘ కార్యదర్శి)



శ్రీమతి చెల్లాయమ్మారావు, శ్రీ ఎ. నాగేశ్వరరావుగారి
సహధర్మచారిణి.



న్యూ పూర్ణానంద డ్రమెటిక్ థియేటర్స్ నటీనటబృందము, నిర్వాహకుడు : శ్రీ ఎ. నాగేశ్వరరావు.



హొస్సూరులో శ్రీ శివశంకరస్వామివారికి నాట్యకళాప్రవీణ, శ్రీ పి. నాగేశ్వరరావు, వారి సతీమణి నాట్యభారతి, శ్రీమతి చెల్లాయమ్మగారలు కవితా సామ్రాజ్య సింహాసనారోహణము చేయించిన దృశ్యం.



శ్రీ నాగేశ్వరరావుగారు పెయింటర శ్రీ హనుమంతరావుగారిని తెనాలిలో సన్మానించుచున్న దృశ్యం.



శ్రీ నాగేశ్వరరావుగారిని సన్మానించుచున్న దృశ్యం



ప్రఖ్యాతనటుడు శ్రీ వల్లూరు వెంకట్రామయ్యగారు శ్రీ నాగేశ్వరరావు దంపతులకు రజితపాత్ర బహూకరించి సన్మానించుచున్న దృశ్యము (తెనాలి 30-1-60)



తెనాలి వర్తకసంఘ పక్షమున శ్రీ కూరపాటి బ్రహ్మయ్యగారు నాగేశ్వరరావు దంపతులకు కనకాభిషేకము గావించుచున్న దృశ్యము.



బాపట్ల విజ్ఞానసమితివారు చేసిన సన్మానమునకు సమాధాన మొసంగుచున్న శ్రీ ఎ. నాగేశ్వరరావు.



తెనాలి వర్తకసంఘము పక్షమున శ్రీ పొత్తూరు వెంకటరత్నంగారు నాగేశ్వరరావు దంపతులకు
నవరత్నాలహారమును బహూకరించుచున్న దృశ్యం.



శ్రీ శివశంకరస్వాములవారి అధ్యక్షతన తెనాలి పౌరులపక్షమున నాగేశ్వరరావు దంపతులను సన్మానించుచున్న డాక్టరు శ్రీ చంద్రమౌళి సత్యనారాయణరావుగారు.



తెనాలి పౌరులు శ్రీ నాగేశ్వరరావు దంపతులకు గావించిన ఘనసన్మాన సందర్భమున ప్రసంగించుచున్న శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి, ఎం. ఏ. బి. యల్. గారు.





శ్రీ కృష్ణలీలలు నాటకములో బాలకృష్ణునిగ
చి॥ లక్ష్మీవాసంతి (5 సం॥)

హరిశ్చంద్ర నాటకములో లోహితాస్యునిగ
చి॥ లక్ష్మీవాసంతి (5 సం॥)
శ్రీ ఎ. నాగేశ్వరరావుగారి పుత్రిక.



పాటూరి రాధాకృష్ణమూర్తిగారి పఠిమున్న చి॥ లక్ష్మీవాసంతికి డాక్టరు శ్రీ కాజ నరసింహారావుగారు
రజితపాత్రను బహూకరించుచున్న దృశ్యము.

## 'నాట్యకళాధురీణ' శ్రీ నాగేశ్వరరావుగారికి కనకాభిషేకము

తెనాలి వర్తకసంఘమువారు శివశంకరస్వామి అధ్యక్షతను నాట్యకళాధురీణ ఏ. నాగేశ్వరరావు గారికి వారి సతీమణి నాట్యభారతి శ్రీమతి చెల్లాయమ్మకూ కనకాభిషేకము గావించిరి. పలువురు పురప్రముఖులు, కవిపండితులు, కళాకారులు పాల్గొని నాగేశ్వరరావుగారి నటనావైదుష్య మును సమాజ నిర్వహణ పద్ధతిని కొనియాడిరి. వర్తక ప్రముఖులు పలువు రుపన్యసించి సన్మాన పత్రములు సమర్పించిరి. వేదప్రవచనానుసారముగ నటదంపతులకు కనకాభిషేకము జరిగినది. వర్తక సంఘమువారు నాగేశ్వరరావుగారికి నవరత్నహార మొసంగిరి. పిమ్మట బాలనటి చి॥ లక్ష్మీవాసంతి నాగేశ్వరరావుగారి పుత్రికకు పలువురు కప్పులూ, బొమ్మలూ బహుమాన మొసంగిరి. పౌరసంఘము పక్షమున డాక్టర్ చంద్రమౌళి సత్యనారాయణ గారు, డాక్టర్ కాజ నరసింహారావుగారు, పలువురు ప్రముఖులు నాగేశ్వరరావుగారికి సన్మానపత్ర మొసంగి రజితపాత్రలిచ్చి బహూకరించిరి. స్థానం, ఆవుల గోపాలకృష్ణమూర్తి, పులిపాటి వెంకటేశ్వర్లుగార లుపన్యసించిరి. ఎన్నో బహూకృతులు జరిగిన పిమ్మట రాత్రి శారదా విజయ నాట్యమండలివారు "మాయాబజారు" నాటకము ప్రదర్శించిరి. 31వ తేదీని అయినంపూడి చక్రధర్, M. P. అధ్యక్షతను సురభి నాటకసమాజ నిర్వాహకులకు ప్రత్యేకసన్మానము జరిగినది. నన్నపనేని వెంకట్రావుగారు సురభిసమాజాల ప్రశస్తినిగూర్చి ప్రసంగించిరి. బహునాటకకర్తలు, నటులు, జి. వి. సుబ్బారావుగారు సవిమర్శకంగా నాటక రచనను గూర్చి ప్రదర్శనాలనుగూర్చి చక్కగా ప్రసంగించిరి. పౌరకళాకారులపక్షాన సురభి కళాకారులకు నటరాజరజితవిగ్రహం బహూకరించిరి. తెనాలిలో మూడురోజులపాటు సురభి నాటక కళోత్సవాలు దిగ్విజయంగా జరుగుటకు తోడు పడిన పురప్రముఖులనూ మిత్రులనూ నాగేశ్వర రావుగా రభినందించిరి. శివశంకరస్వామి ఆశీస్సులతో సభ ముగిసినది.







బాపట్లలో శ్రీకృష్ణపాత్రధారిణి
శ్రీమతి జానకీదేవికి రజితపాత్ర బహూకరించుచున్న దృశ్యం.



కురుక్షేత్ర నాటకములోని ఒక దృశ్యము





బాపట్ల ప్లీడరుగుమస్తాల సంఘ పక్షమున కురుక్షేత్ర నాటకములో
సుయోధనపాత్రధారి శ్రీ ఎ నాగేశ్వరరావుగారికి సువర్ణపతకమును బహూకరించుచున్న దృశ్యం.

ఆంధ్రనాటక కళాపరిషత్తు (రిజిష్టర్డు)

'నాటకకళాధురీణ', "నటరాజేంద్ర',

## శ్రీ అవేటి నాగేశ్వరరావుగారికి

ఆంధ్రనాటక కళాపరిషత్తు (రిజిష్టర్డు) 21వ వార్షిక మహాసభల సందర్భమున ఒసంగిన

# సన్మాన పత్రము

**నాటక కళాధురీణా !**

డెబ్బది సంవత్సరములుగా వంశములను, కుటుంబములను, జీవితములను కళారంగమునకు అంకితముచేసి 'కళామతల్లి బిడ్డలము మేమే' నని ఎలుగెత్తిచాటుచు వివిధ కళారంగములందు కళాతపస్సును ఒనర్చుచు ఆదర్శవంతముగా నిలిచిన మీకు సన్మానముచేయుటకు సంతసించుచున్నాము.

**నటమణీ !**

నటులుగా, నాటకసంఘ నిర్వాహకులుగ, నటీనటపోషకులుగ కీర్తి నార్జించుచున్న మీరు ఆంధ్రనాటక కళాపరిషత్తు ఒకరగు క్రీ. శే. శ్రీ వనారస గోవిందరావుగారికి మేనల్లుడు, సురభి కంపెనీలు అను పేరిట నాటకసమాజములు స్థాపించిన పుణ్యమూర్తులు మీకు మేనమామలు. అట్టి మీరు౫౦ వత్సరములుగ నాట్యమండలిని అవిచ్ఛిన్నముగ నడుపుచు, నేటి నాటకములను ప్రదర్శించుచు అవిరళముగ ఆంధ్రనాటకరంగమునకు సేవయొనర్చుచున్న మీకృషికి వందనములు.

**నటరాజేంద్రా !**

కురుక్షేత్రమున 'దుర్యోధనునిగ', ఉత్తర రామచరితమున 'శ్రీరాముడుగ', బాలనాగమ్మలో 'మాయలఫకీరుగ' నటించి మీరు చూపు నటనాసామర్థ్యము తిరుగులేని దనుటకు మీరు పొందిన ఘంటాకంకణాది బహుమతులే నిదర్శనములు. ముప్పది ఆరు సురభి నాటకసమాజములకు ప్రాతినిధ్యము వహించుచున్న సురభినాటక కళాసంఘమునకు కార్యదర్శులుగ మీ రొనర్చుచున్న కళారాధనకు మీకు నాటకకళాసరస్వతి పైడిదీవన లిచ్చి ప్రోచుగాత !

సన్మాన మంటపవేదిక |
తణుకు |
ఫిబ్రవరి 1960 |

ఇట్లు
ఆంధ్ర నాటక కళాపరిషత్తు.

# ★ కళాకిరీటం ★

లలిత కళలలో ఒక విభాగం, ముఖ్యాంగం నాటక కళ. తెలుగునాడు నాటక కళా కేంద్రం. రాజాధిరాజుల చేయూత, ప్రభుత్వాదరణ తరుగు పడిన యీ దినాల్లో నాటకరంగం కుంటినడకలతో కునికిపాట్లుపడే దీనావస్థ కలిగింది. ఫలితంగా కిరాయి నాటకాలలో నలుగురైదుగురు కృష్ణులను, ముగ్గురు భీములను చూచేరాత తటస్థపడింది. ఐనా ఇలాంటి రోజుల్లోకూడా 70 ఏళ్ళ వయసు కలిగి శాఖోపశాఖలై ఆంధ్ర ప్రజామన్ననలతో నిత్య వైభవ శ్రీ సమేతంగా సురభినాటకసంఘాలు పురాణ, జానపద, చారిత్రక నాటక ప్రదర్శనలిస్తూ ప్రశంశార్హత నోచుకొనటం ఏటికెదురీదటం వంటి సాహసమే.

సురభి కడపజిల్లా రాయచోటి తాలూకాలోని కుగ్రామం. ఆ గ్రామంనుండి విస్తరిల్లిన సంఘాలు కావటం వలన సురభి నామధేయం ప్రసిద్ధమై స్వస్థలానికి కీర్తి కిరీటాన్ని అందించినై. తోలుబొమ్మలాటలు మూలపడేరోజులనుండి ప్రస్తుత యంత్రయుగంలోని చలనచిత్ర పరిశ్రమ పెనుతుఫానులకి సైతం ఎదురునిల్చి, హోరుగాలికి ముందు నడచి వాడవాడలా తమకళాదక్షతతో నాట్యసేవచేస్తున్న సురభివారి శక్తికి చిరస్మరణీయులు గోవిందరావుగారు. గోవిందరావుగారి బంధువర్గమే సురభి నాటకసంఘాలు వారి పునాది గోడలపైనే వర్తమాన సంఘాలు కళాసౌధాలు నిర్మించినై. నిత్యోత్సవాలు జరుపుకుంటున్నయ్. అఖండ సన్మానాలందుకుంటూ కనకాభిషేకాలు చేయించుకుంటున్నై.

నాటకానికి ముఖ్యాంశం రచన. సురభి వారు అనేక నాటకాలు స్వయంగా వ్రాయించి, కవి పండిత సన్మానాలు జరిపారు. ప్రతినాటకానికి తగిన రంగాలంకరణ, దానికనువైన సెట్టింగులు, దుస్తులు వైరువర్క్సు, లైటింగు ఎఫెక్ట్సు, వ్యయప్రయాసలకోర్చి అనుర్చుకొని పాతనాటకాలను క్రొత్త రీతులతో ప్రదర్శిస్తూ, పాతక్రొత్త కలయికతో ప్రేక్షకులను మరోప్రపంచానికి తీసికొనివెళ్ళి 'వారికి వారేసాటి' అని మెప్పులందుతున్నారు.

నటులంతా ఒకే బంధువర్గంలోనివారు కావటం ఐకమత్యంతో సహకరించటం పేరిలో చెప్పతగిన విశేషాలు. దాసిపాత్రనుండి రాణిపాత్రలవరకు దొంగనుండి దొరదాకా విభేదాన్ని పాటింపక ప్రతి ఒక్కరూ దేనికైనా సమర్థులై అసూయా విద్వేషాలకతీతులై అవిభక్త కుటుంబంగా. దేశసంచారంచేస్తూ నాటకప్రదర్శన లివ్వటం, ఒక మహత్తర సంఘీభావానికి నిదర్శనం.

మన నాటకాలకు స్త్రీపాత్రలు లభించరు దొరికినా కిరాయికి వచ్చేవారికి శ్రద్ధ పూజ్యం. నాటకాలలో స్త్రీలు వేషాలువేస్తే చెడిపోతారనే భావం నేటికీవుంది. ఐనా దాని నెన్నడో విస్మరించి సురభి సంఘాల్లో భార్యాభర్తలు, బిడ్డలు కలిసి నటించటం మన దేశానికే ఆదర్శప్రాయము. రంగస్థలంపై భార్యతో భర్త, భర్తగా కాక సోదరునిగా, సోదరి సోదరునితో మనోహారిగా నటించుతూ అంధకారంలో కళామతల్లి సేవకై త్రోవ తెలీక తడవులాడుతున్న తోటి సోదరసోదరీ నటబృందాని కొక మహాజ్యోతిని వెలిగించి చూపెట్టుచున్నారు. వారిలో సహనం, విశాల హృదయం, కళాసేవాతత్పరత మరొకరి కందనివి. నాటక ప్రదర్శనలే జీవనాధారములై స్వయశిక్షణ, అందు సమగ్రమైన నేర్పు, నాటక కళాభివృద్ధికి తోడ్పడే ఐక్యత, వార లలవరచుకొని యీ యాత్ర సాగించటం ప్రశంసనీయము.

ప్రతి మండలంలో వారి సంఘాలు ప్రదర్శనలిస్తూ పర్యటించటం కళాసేవ మా నిదర్శనం. కీ॥ వనారస గోవిందరావుగారితో తొలుత ఆంధ్ర

నాటకకళా పరిషత్ స్థాపించబడింది తెనాలిలో. అట్టి ఆ కళాక్షేత్రంలోనే సురభివారు సప్తతి వర్షోత్సవం జరుపుకోటం వారిలో నొక శాఖానిర్వాహకులు, సుప్రసిద్ధ నటశేఖరులైన అవేటి నాగేశ్వరరావుగారికి కనకాభిషేకముతో సన్మానోత్సవాలు జరగటం యెంతో భాగ్యవిశేషం. నాగేశ్వరరావుగారికి ఆంధ్ర సంగీతనాటక ఎకాడమివారు సభ్యత్వమిచ్చి కళనెంతో గౌరవించారు. ప్రభుత్వం కళాసేవ చేస్తానంటున్నది. సురభి సమాజములద్వారా యెంతైనా కళాభివృద్ధి చేయించటాని కవకాశమున్నదని ప్రభుత్వం కూడా గమనిస్తుందని నావిశ్వాసము.

వేయికాలాలు యిలాగే నిత్య నూతనత్వాన్ని కాంక్షిస్తూ, ఐక్యత, సాధన యీ రెంటి పెంపుదలలో సురభి నాటక సంఘాలు విస్తరిలి కళాసేవ చేయుటకు నటరాజు ఆశీస్సులు అనుగ్రహించుగాక.

కళారాధకుడు
భవదీయుడు
డాక్టరు, చంద్రమౌళి సత్యనారాయణరావు.



**బాల్యస్మృతులు :**

# సురభి నాటకప్రదర్శనం

శ్రీనివాస చక్రవర్తి

అవి నా హైస్కూలు రోజులు. 1925 ప్రాంతం అనుకుంటాను. ఆ రోజులలో బస్తీనుంచి నాటక సమాజాలు గ్రామాలకు వచ్చి నాటకాలాడడం ఇంకా పరిపాటి కాలేదు. నేను చదువుతున్నది పల్లెటూరి హైస్కూలులో. వీధినాటకాలు, బుర్రకథలు, తోలుబొమ్మలు, హరికథలు, గ్రామస్థులు ఉత్సాహంకొద్దీ మిడిమిడిజ్ఞానంతో ఆడే స్టేజీనాటకాలు మాకు వినోద కార్యక్రమాలు. సరియైన స్టేజీనాటకం చూడాలంటే బస్తీకి వెళ్ళాలి. విద్యార్థులకు బస్తీలో పనేముంది? ఎప్పుడో వెళ్ళినా, ఆ సమయానికి నాటకాలుండవచ్చు లేకపోవచ్చు. ఒకవేళ ఉన్నా డబ్బు? నాటకాలు చూస్తే పిల్లలు చెడిపోతారనీ వృథా వ్యయమని పెద్దలు పిన్నలను ప్రోత్సహించేవారు కాదు. నా మట్టుకు నేను 1925 కు ముందు ఒక్కసారి కావచ్చును, బందరులో డి. వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర నాటకం పూర్తిగా చూచాను. గేట్లు వదలిన తరువాత హాలులోకి వెళ్ళి వారిదే పఠాణి ఆఖరిసీను, బుట్టయపేట కంపెనీవారి రసపుత్ర విజయంలో చివరిభాగం చూశాను. ఆ రోజున వెంపటి వెంకటేశ్వర్లుగారనుకుంటా దుర్గాదాసు వేసింది అంతే. ఆ తరువాత పల్లెటూరిచదువు. మరి బస్తీవారి స్టేజీనాటకం చూడడం పడలేదు. కృష్ణాజిల్లా కపిలేశ్వరపురం గ్రామస్థులు సీతాకళ్యాణం అనుకుంటా, బాగా జ్ఞాపకం లేదు, ఆడగా చూశాను. ఆ ప్రదర్శనం నాకే బాగుండలేదు.

ఈ పరిస్థితిలో మాకు రెండుమైళ్ళలోని వుయ్యూరుగ్రామం (నేను చదివింది కృష్ణాజిల్లా తాడంకి హైస్కూలులో) లో సురభికంపెనీ వారు నాటకాలాడడం మొదలుపెట్టారు. వుయ్యూరు గ్రామం ఇప్పుడంత పెద్దదికాకపోయినా ఆనాడు ఆ చుట్టుప్రక్కల గ్రామాలలోకల్లా పెద్దది. ఏసుకు విస్తారంగా కావలసినా అక్కడికే వెళ్ళాలి. పెద్దపోస్టాఫీసుకూడా ఉండేది. సురభికంపెనీ వుయ్యూరు వచ్చి డేరాహాలులో నాటకాలాడుతోందని చెప్పుకోసాగారు. ఆడవాళ్ళుకూడా వేషాలు వేస్తారు. నాటకంలో మధ్యమధ్య నేలటపాకాయ పేలుతుంది, నేలటపాకాయ పేలగానే వైకుంఠంసీను వస్తుంది, అంత అద్భుతంగా వుంటుంది, ఇంత అద్భుతంగా వుంటుంది, పూర్వపుకథల్లో వాళ్ళుపాడే పాటలువినితీరాలి అని రాత్రినాటకం చూసివచ్చినవారు సంతోషంపట్టలేక పొద్దున్నా సాయంత్రం వీధి అరుగుమీద కెష్టిగంవేసి వర్ణిస్తూండేవారు. మేం విద్యార్థులంకూడా చెవులు నిక్కబెట్టుకుని ఆ వర్ణనలు వసకేలా ఆ నాటకం ఒక్కటయినాసరే చూసేభాగ్యం కలుగుతుందా అని ఉవ్విళ్ళూరుతుండేవారం. లంకాదహనంలో పెద్దసముద్రం, ఆసముద్రాన్ని హనుమంతుడు బర్రున దూకడం, లంకను తగలపెట్టటం యథార్థంగా చూపారట. లంక తగలబడిపోతుంటే మంటలు పైకి లేచేసరికి తగలపడిపోయురా డేరా, అని ప్రేక్షకులు కొందరుకూడా విడిగా బయటికి పరుగెత్తారట! ఇంకా నాటకంలో విష్ణుమూర్తి పాలసముద్రంలో శేషతల్పం మీద పవ్వళించివుంటే నారదుడు, బ్రహ్మ మొదలైన దేవతలు ఆకాశంలో నుంచి కిందకు దిగారట! ఇంకా ఎన్నెన్నో తమాషాలు చెపుతూంటె ఆ నాటకాలు చూడాలనే ఉత్సాహం ఉబుకుతుండేది.

మా క్లాసులోనే చదువుతున్న కొంతమంది వ్యాయామ విద్యార్థులు ఇంకా తమాషాలు చెప్పసాగారు. సురభి కంపెనీలో వారంతా ఒకే కుటుంబానికి చెందినవారట. డేరాహాలు దగ్గరే వాళ్ళ మకాం. పగలు వంటలు చేసేవారు. వంటలు చేస్తూంటే ఎప్పుడూ ఏదో ఒక రంగం రిహార్సల్సు చేస్తుండేవారట. స్టేజీమీద ఏదో పనిచేస్తుండేవారట. ఇవన్నీ వింటుంటే ఏదోవిధంగా ఆ కంపెనీ మకాం ఎత్తేలోపున ఒక నాటకమయినా చూసితీరాలనే నిర్ణయానికి వచ్చాను. నాకు చిన్నప్పటినుంచి నాటకాలజబ్బు. చిన్నప్పటినుంచీ చుట్టుపక్కల గ్రామాలలో ఎక్కడ ఏ వీధినాటకం వేసినా, బుర్రకథ చెప్పినా, తోలుబొమ్మలు వేసినా నాసం నలుగురిని వెంటవేసుకొని హాజరు! అలాంటప్పుడు ఇంత ఇదిగా చెప్పుకొంటున్న సురభి నాటకం చూడకపోతే ఎట్లా? మరి టిక్కెట్టుకి డబ్బులు? ఏదోవిధంగా సంపాదించి తీరాలి! కాని డబ్బులు చేతికి వచ్చేదాకా అవస్థా ఆగుతుందా! ఆగలేదు. ఒకనాటి సాయంకాలం వంట్లో నలతగా వుందని వంకపెట్టి డ్రిల్లుక్లాసుకు సెలవు తీసుకొన్నాను. తోడులేనిదే తోచదు నాకు. కాని అప్పుడు అర్థాంతరంగా ఎవరు వస్తారు? ఒకణ్ణే వెళ్ళలేనూ రెండుమైళ్ళ భాగ్యమేగా అని బయలుదేరాను. ఆ వయసులో నడక అంటే బొత్తిగా లక్ష్యం ఉండేది కాదు. రోడ్డుచ్చుకున్నాను. నాకు సైకిలూలేదు, తొక్కడమూరాదు. రెండు కాళ్ళబండియే గత్యంతరం. కొంతదూరము నడిచాను. నాకే సైకిలు వుండి యెక్కడం వచ్చివుంటే ఈపాటికి సురభిడేరాముందు వాలేవాడిని గదా అనిపించింది. ఆ డేరాహాలు ఎలా వుంటుందో, వేషాలు వేస్తారట ఆ స్త్రీలు ఎలావుంటారో! హాలులోపలికి రానీయకపోతే రానీయక పోయారు ఆవరణలోకన్నా రానిస్తారా? వాళ్ళమొహాలు ఉత్తప్పుడు చూసే అవకాశం లభిస్తుందా? ఇలా ఆలోచిస్తూ ప్రయాణం చేసుకొన్నాను. వంతెనదరికి వెళ్ళేసరికి కాళ్ళకి వేగం హెచ్చింది. తిన్నగా వెళ్ళగా రోడ్డుకి ఓ 20 గజాల దూరంలో డేరా కనిపించింది. డేరాముందు నాలాగే వచ్చిన జనం ఎక్కువగుంది పిల్లలు, యువకులు, వింతగా చూస్తున్నారు. నేనూ కాసేపు ఆ జనంలో వుండి చూశాను. లోపలికి ఎవరినీ రానీయడములేదు. ఏం చేస్తాను? కాసేపు అలానే వచ్చే పోయే జనాన్ని, డేరాని చూసి తిరుగుమొహం పట్టి దీపాలవేళకు ఇంటికి చేరుకున్నాను.

ఆ డేరా, ఆ జనం చూసివచ్చేసరికి నాపని అర్థాకలిగా వుంది. ఆరాత్రి సరిగా నిద్ర పట్టలేదు. డబ్బులు సంపాదించడంఎలా? యిలాంటి 'డబ్బు తగలేసే పిచ్చివేషాలు' మా నాన్నగారికి గిట్టవు. అడిగి లాభంలేదు. ఏమీ తోచలేదు.

శని, ఆదివారం శలవులు వచ్చాయి. సురభి నాటకం చూడాలనే కుతూహలం ఇనుమడించింది. పది గంటలకి సౌంబాను వినిపించింది. ఇదేమిటా అని ఉరుక్కుంటూ వీధిలోకి వెళ్ళాను. ఒంటెద్దుబండి కనిపించింది. బండి గుడిసెకు 'ప్రతాపరావణ' అని పెద్దపెద్ద అక్షరాలు కనిపించాయి. సురభి నాటకం అయివుంటుందని గబగబా బండివెనకని వెళ్ళాను. పిన్నలు పెద్దలు కాగితాలకోసం తోసుకుంటున్నారు. నేనూ సందు చేసుకుని వెళ్ళి చేయి చాచాను. ఎలానో ఒక కాగితం వచ్చి చేతిలో పడింది జారిపోకుండా గుప్పిటలో గట్టిగా పట్టుకుని మెల్లగా గుంపులోనుంచి బయటికి జారుకున్నాను.

అప్పటికప్పుడు గుప్పిట విప్పి నలిగిపోయిన కాగితం సాఫుచేసి చూచాను. "వ్యాయామ మైదానంలో మా స్వంత డేరాలో" "సురభి ... సమాజం" సమాజం పేరు జ్ఞాపకంలేదు. సురభి సమాజాలు చాలా వున్నాయట. కాని అన్నిటినీ సామాన్యంగా సురభి కంపెనీ అనడమే

పరిపాటి. "ప్రతాప రావణ" నాటకకర్త పేరు మరిచాను. నటీనటవర్గంలో ఇప్పటికీ జ్ఞాపకం వున్న పేరు రామయ్యగారు. ఆయనే రాత్రి రావణుడు. ఆ కరపత్రంలో అద్భుతమైన వైరు వర్కు లుంటాయనీ ఇంకా ఏవేవో వ్రాశారు. ఆఖరికి టిక్కెట్లు ఖరీదు. నేల పావలా, బెంచీ అర్థరూపాయి. కనీసం పావలా అయినా సంపాదించాలి. మార్గం గోచరించలేదు. తెగ ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నాను.

ఏదో మాటల సందర్భంలో మా అమ్మమ్మగారి సంగతి వచ్చింది. ఛట్టున తట్టింది ఉపాయం. మా అమ్మమ్మగారిఊరు వెడితే! మా తాతగారు మహామంచివారు. కొంచెం బిక్క మొహం వేసి అడిగితే ఎవరికీ ఏదీ కాదనలేడు. ఇక మరి నావిషయంలో వెనకతీస్తాడా? సరే, ఒక 'చాన్సు', 'లాటరీ' చూద్దామని నిశ్చయించుకున్నాను.

సాయంత్రం మూడు గంటలకు అమ్మమ్మగారివూరు వెళ్ళి చూసివస్తాను, శెలవులేగదా అని ఇంట్లో చెప్పి ఒప్పించి బయలుదేరాను. తీరా వెళ్ళాక తాతగారు పాల ముంచుతాడో నీళ్ళ ముంచుతాడో, కాని ఆయన నన్ను చిన్నబుచ్చకనిమాత్రం కొండంత ధైర్యం...

రాత్రి భోజనాలయాక మెల్లిగా మాతాతగారి పక్కలోచేరి మాక్లాసు పిల్లవాళ్ళంతా వెళ్ళి సురభి కంపెనీ నాటకం చూసివచ్చారనీ, నేనొక్కణ్ణే వెళ్ళందనీ, చాలా అద్భుతంగా వుంటుందట, విష్ణుమూర్తి పాలసముద్రంలో శేషశయనుడై సాక్షాత్కరిస్తాడట అని చిలవలు పలవలు కల్పించి చెప్పి నేను జాగ్రత్తగా దాచుకున్న కరపత్రం చూపి బిక్కమొహం వేసాను. ఆయన మనసు కరిగి "ఇంతకీ డబ్బులు కావాలనేగా, రేపిస్తా వెళ్ళొదువుగానిలే, యీమాత్రానికే బిక్కమొహం వేయాలా" అని వూరడించారు. అదృష్టం పండింది. మనసులోనే అతనికి వేయి దండాలుపెట్టి పండుకొని నిశ్చింతగా నిద్రపోయాను....

మర్నాడు ఎప్పుడు సాయంత్రం అవుతుందా ఎప్పుడు నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని పరుగెత్తుదామా అని పొద్దస్తమానము కొట్టుమిట్టాడి పోతున్నాను. సాయంకాల మయింది. చేతిలో డబ్బులు పడ్డాయి. అమ్మ అన్నం పెట్టింది. చలో ధియ్యేటర్!

నేను హాలుదగ్గరికి చేరుకొనేసరికి లోకానికంతటికీ చీకటి. కాని హాలుముందు మాత్రం పట్టపగలు. ఎలక్ట్రీ దీపాలతో ఆ ప్రదేశమంతా వెలిగిపోతూంది. ఒకవేపున డప్పులవాళ్ళు డప్పులు కాలుస్తున్నారు. ఇంకా పెద్దగా జనం చేరలేదుగాని నాలాంటి పొరుగూరివాళ్ళు ఒక్కొక్కరూ చేరుకుంటున్నారు. దారికేసి వచ్చే జనంకేసి వింతగా చూస్తూ రెండుమూడు మాట్లు పచార్లు కొట్టాను. ఆ తరువాత తొక్కిడిగా వుంటుంది, ఎందుకైన మంచిదని ముందుగానే వెళ్ళి బుకింగుముందు తిష్ఠవేశాను. డప్పులు కాలినవేమో టకటక లాడుతున్నాయి. నౌబోతు వాళ్ళు ఏదో ట్యూన్ మొదలుపెట్టారు. నాలో ఏవేవో ఆలోచనలు, ఎప్పుడు బుకింగు తెరుస్తారా, ఎప్పుడు వెళ్ళి ఆ 'కలియుగ వైకుంఠం' లో వెళ్ళి పడదామా అని మహాఆదుర్దాపడి పోతున్నాను. ...కొంతసేపటికి బుకింగు తెరిచారు. తెరచీతెరవడం తోటే డబ్బులుతీసి టిక్కెట్టు పుచ్చుకున్నాను. అన్నట్టు చెప్పడం మరిచాను, మా తాతగారు పదిఅణాలు ఇచ్చారు. ఎనిమిది అణాల టిక్కెట్టుకి పై రెండుఅణాలు కొనుక్కుతినడానికి. టిక్కెట్టు హస్తాభరణంగా పట్టుకొని లోపలికి వెళ్ళాను...ఎనిమిదణాల టిక్కెట్టుతో వెళ్ళి బెంచీమీద కూర్చున్నాను. హాలంతా

ఎలక్ట్రి దీపాలు. ఎదురుగా బ్రహ్మాండమయిన తెర. ఎప్పుడు తెర ఎత్తుతారా, ఎప్పుడు ఆ వేషాలు, ఆ వైకువక్కలు చూదామా అని ఉవ్విళ్ళూరిపోతున్నాను. క్రమక్రమంగా హాలంతా కిక్కిరిసి పోతుంది. ఎవరి నోటంట విన్నా ఆ వైకువక్క తమాషాలే. ఎరుగున్న మొహాలు ఏమన్నా కనిపిస్తాయేమోనని అటూ ఇటూ చూశాను. మా మాస్టర్లు ఇద్దరు ముగ్గురు పై క్లాసులోకి వచ్చి కూర్చున్నారు. భగవంతుడు వాళ్ళ కంటబడకుండా చేస్తే బాగుండును... అబ్బ!... ఇంకా తెర ఎత్తరేం? వేషాలు వేసుకోవడం పూర్తి కాలేదా? వైకువక్క చెడిపోలేదుకదా? ఇంతకీ అసలు ఇంకా వేళకాలేదా?... స్టేజీలో మొదటిగంట గణగణా మోగింది. హాలులో సంతోషముతో ఈలలు మోగాయి. ప్రేక్షకుల ఆ సంతోషానికి మేరలేదు. అందరికి నాలానే సన్నమాట. ఏవేవో గుసగుసలు, ఖుసుఖుసలు వినిపించసాగాయి. వెనుక నాలుగణాల క్లాసులో నుంచి మరీని 'తలకాయి అడ్డం తియ్యి' 'కొంచెం పక్కకి కూర్చో' 'నువ్వొక్కడవే గుత్తకు పుచ్చుకున్నావా?' ఇలాంటివే అనేకం వినిపించసాగాయి. మూడోగంట - హూష్ - ఊరుకోండి. ఆ హాలంతా నిశ్శబ్దం.

తెర లేచింది. దృశ్యం కంటికి గుమ్మంగా వుంది. సముద్రం ఎత్తున లేచే తరంగాలు, వాటిమీద శేషతల్పం, శేషతల్పంమీద శయనించిన శ్రీ మహావిష్ణువు, శ్రీ మహావిష్ణువుకు ఇరుపక్కలా ఇలక్ష్మీనీళాదేవులు. చూడటానికి రెండుకళ్ళూ చాలవు అనిపించింది. ముఖ్యంగా ఆ విష్ణుమూర్తి వేషం రవివర్మచిత్రంలో లాగావుంది. అయితే ఆ వేషం వేసినవారిపేరు ఇప్పుడు జ్ఞాపకంరావడం లేదు. ఆ తరవాత 'ఢాం' అని నేలటపాకాయ మోగింది. పైనుంచి బయన నారదుడు, దేవేంద్రుడు, బ్రహ్మ దిగారు. నారదుడిపాట అదో బాణీగావుంది. దేవతలు విష్ణుమూర్తిని ప్రార్థించటం, ఆయన అభయమివ్వడం జరిగింది...

ఆ తరవాత సీనులు వరసక్రమంగా జ్ఞాపకంలేవు గాని నా హృదయానికి హత్తుకున్న కొన్ని దృశ్యాలను వివరిస్తాను.

తెర లేచింది. రంగంమధ్యంలో అగ్నిగుండం మంటలులేస్తున్నాయి. గుండం మీదను 18,20 ఏళ్ళ పడుచు కళ్ళుమూసుకుని కూర్చుని జపంచేస్తున్నట్టుంది. తల జడలుజడలుగా వుంది. ఓ రెండు నిముషాలతరువాత పదితలకాయల రావణబ్రహ్మ దొంగలాగా అడుగులు వేసుకుంటూ చక్కా వచ్చాడు. అన్నితలకాయల మనిషిని చూసే గాభరాఎత్తింది. మనిషి మాంచి ఒడ్డాపొడుగు. రావణబ్రహ్మ వేషం వేసింది చిన్నరామయ్యగారు. సరి పెదరామయ్యగారు ఇంకొకరున్నారేమో తెలీదు. చిన్నరామయ్యగారే వస్తుతా మంచి ఒడ్డూపొడుగూ. లేకపోతే స్టేజిమీద అట్లా కనిపించాడో తెలియదు. మెల్లగా ఆ కన్యదగ్గిరకి చేరాడు. పిలిచాడు. అప్పుడు తెలిసింది ఆమె పేరు వేదవతి అని. వేదవతి ఉలిక్కిపడి కళ్ళుతెరచి చూచింది. లేచి నిలబడింది. తరువాత వారిద్దరికీ సంభాషణ కొంత వచనంలోనూ, కొంత పద్యాల్లో, కొంత పాటలరూపంలో జరిగింది. వీరిద్దరి పాటల ఫణితికూడ నారదుడి ఫణితిలాగేనే వుంది. రావణబ్రహ్మ ప్రేమంటూ మొదలుపెట్టాడు. ఆమె కన్నెర్రచేసింది. ఇద్దరూ దెబ్బలాడుకుంటున్నట్టనిపించింది. చివరికి వేదవతి కృద్ధురాలై "నిన్ను శపిస్తా చూడు" అంటూ ప్రక్క కమండలం తీసుకుని నీళ్ళువదిలింది. తరవాత రెండు మూడు వాక్యాలు. ఆ తరవాత నేలటపాకాయ ఢం అంది. వేదవతి అమాంతం అగ్నిగుండంలోకి దూకి మాయమైపోయింది. మంటలు ఉవ్వెత్తున లేచాయి. మేమంతా నిశ్చేష్టులమయిపోయాం.

ఇంకో సీను. తెర లేచింది. గలగలమంటూ పాతిక, ముప్పయిమంది స్త్రీలు స్టేజీమీదికి వచ్చారు. రంగం ఉద్యానవనం. చక్కగా అలంకరించబడివుంది. ఓ-ఆ దృశ్యం ఎంత బావుందని! అందులో ఒకావిడ రాణిలాగా వుంది. తక్కినవారు ఆమె బంధువులు, దాసీలు అయివుంటారు. అంతాకలిసి పాట పాడడం మొదలుపెట్టారు. ఇంతలో ఒక స్త్రీ, దాసీ అనుకుంటా. వచ్చి 'అమ్మగారూ, పదితలకాయలపురుగు వచ్చింది, చూశారా?' అని అడిగింది. "పదితలకాయల పురుగేమిటే?" అని అంతా ఆశ్చర్యం వెల్లడించారు. 'నేను పట్టుకున్నాను, తీసుక వస్తాను. చూడండి' అంటూ లోపలికి వెళ్ళి రావణబ్రహ్మను తీసుక వచ్చింది. రాణీ ఆవిడ బృందం ఫక్కున నవ్వారు. మేమూ నవ్వాం. రాణీ దాసీలు రావణబ్రహ్మను చుట్టుముట్టి పురుగును ఆడించినట్టు ఆడించి వినోదించారు. తరువాత అతని పుట్టుపూర్వోత్తరాలు అడిగి తెలుసుకొని, 'యీ రాజ్యంలోకి ఇక అడుగుపెడితే చావు మూడుతుంది' అని బెదరించి తరిమి వేశారు. ఆ రాజ్యంపేరూ రాణీపేరూ జ్ఞాపకం లేవుకాని (బహుశా కార్తవీర్యార్జునుని రాజ్యమేమో) ఆ దృశ్యంమట్టుకు నేటికీ నాకళ్ళముందు తారాడుతూనే వుంది.

వాలి రావణుణ్ణి తోకకు కట్టుకొని సప్తసముద్రాలలో ముంచడం, సీతాపహరణం, లంకాదహనం, రామరావణయుద్ధం మొదలైనవి ఎన్నో చూశారు. ఆనందంతో మా ఒళ్ళే మాకు తెలియలేదు. నేలటపాకాయ పేలిందంటే, ఏదో అద్భుతం జరగబోతోందని ఒకటే బండ గురుతు. నాటకం పూర్తిఅయింది. ఇంకా కాస్సేపు ఆడితే బాగుండేదనిపించింది. చిన్నతనమేమో ఆ అద్భుతాలు నా హృదయానికి మరీ హత్తుకున్నాయి. ఎలాగయితేనేం సురభి నాటకం చూశాననే సంతృప్తి కలిగింది. మనస్సుకు స్వస్థత చిక్కింది.

నాటకం మొత్తంమీద ఒక్కరూ ఎక్కడా ప్రోర్షనురాక తడుముకోవడంగాని, ఒకదానికి ఒకటి చేయడంగాని కనిపించలేదు. నాటకం బహు కట్టుగా వుంది. ఇప్పుడు సమష్టికృషి అంటున్నామే దాన్నే మా చిన్నతనంలో కట్టు అనేవాళ్ళము. సురభివారిలో కట్టుబాటు తరువాత నేను చూసిన వృత్తి నాటకాలవారిలో ఎక్కడా కనిపించలేదు. ఇప్పుడిప్పుడు ఔత్సాహిక నాటక రంగంలో కనిపిస్తుంది.

నేను సురభి నాటకం చూసి ఇప్పటికప్పుడే ముప్పయి అయిదు సంవత్సరాలు కావచ్చినా ఇప్పటికీ ఆ అద్భుత దృశ్యాలు, ఆ సెట్టింగులు, ఆ రంగాలంకరణ, ఆ సంగీతం నా హృదయంలో ముద్రితమయే వున్నాయి. మరి తుడుచుకుందామన్నా తుడుపుడు పడేటట్టులేవు. కళ్ళు జిగేలుమనేటట్టు దృశ్యం చూపెడటంలో వారికి వారే సాటి.

—:0:—

శ్రీ అఖిల సురభి నాటక కళా సమాజములకు తెనాలిలో జరుగు

సప్తతితమ వార్షికోత్సవ సందర్భమున తెనాలి పట్టణ కళాభిమానులు సమర్పించు

# సన్మాన పత్రము

ఆంధ్ర నాటక కళోద్ధారకులారా !

మన తెలుగునాడులో యిప్పటికి షుమారు 70 సంవత్సరముల క్రిందట స్థాపించబడి పల్లెపల్లెల ప్రతిదినము ఏదో ఒక గ్రామములో నాటకప్రదర్శన ద్వారా కళాసేవ చేయుచున్నందుకు మీ సమాజములకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

మీ నాటక సంఘములకు అధ్యక్షులైన ఆర్. చినవెంకట్రావుగారు, కార్యదర్శి ఎ. నాగేశ్వరరావుగారు కలసి మీ 36 సమాజముల శ్రేయోభిలాషులై నిరంతరము మీ అభివృద్ధికై పాటుపడుచున్నందుకు మా శుభాకాంక్షలు.

పౌరాణిక యుగమునుండి నేటివరకు మన భరతఖండములో భరతనాట్యములతోపాటు నాటక కళకుకూడా ఒక విశిష్ఠ స్థానము కల్పించబడినది. కాని నేడు కొందరు కళ పేరుతో జీవనభృతికై వక్రమార్గముద్వారా కళామతల్లికి అన్యాయ మొనర్చుచుండిరి. వారివలెగాక మీరు నాటకసమాజముల స్థాపనద్వారా కళను చిరకాలమునుండి పోషించుకుంటూ మీరు ధరించుపాత్రలకు అన్యాయము జరుగకుండా నిరంతరము కృషిజేయు మీ నాటక సమాజములకు మా హృదయపూర్వక అభినందనలు.

మన సంస్కృతి ఆసేతు హిమాచలపర్యంతం వివిధభాషలలోను విభిన్నమార్గాలద్వారా భిన్నదృక్పథాలతో తమ స్వార్థముకై ఉపయోగించుకొనువారివలె గాక అనేక సంవత్సరములనుండి ఆంధ్రదేశములో పల్లెపల్లెలా మీ నాటకసమాజములు పౌరాణిక ప్రదర్శనద్వారా గతాన్ని ప్రజలయొక్క హృదయాల్లో నాట్యంచేయిస్తూ ఆంధ్రలో జైత్రయాత్రను సాగిస్తూన్న మీ నాటకసమాజములకు మా జోహార్లు.

నేడు దేశములో సాంఘిక నాటకములద్వారా ప్రస్తుత పరిస్థితుల కనుగుణ్యంగా సాంఘిక నాటక ప్రదర్శన లిస్తున్న యువతీయువకులవలె మీ నాటక సమాజములు పౌరాణిక నాటకములతోపాటు నేటి సాంఘికవ్యవస్థకు అనుగుణ్యంగా సాంఘిక నాటక ప్రదర్శనలద్వారా సాంఘికసేవను ప్రారంభించి సమాజవికాసానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము.

1929 సంవత్సరములో ప్రథమ నాటక కళాపరిషత్తు ఆంధ్ర నాటక కళోద్ధారక శ్రీ వనారస గోవిందరావుగారిచే స్థాపించబడి అనేక వ్యయప్రయాసలకోర్చి 1960 లో తెనాలిలో సప్తతితమ వార్షికోత్సవము జరుపుకొన్న విధముగానే 1990 సంవత్సరములో మా తెనాలిలోనే రజతోత్సవము జరుపుకొని తెనాలి కళాకారులకు వివిధ రసానుభూతిని కల్పించగలరని ఆశిస్తూ మీ సమాజములకు భగవంతుని కృపాకటాక్షములతో బాటు ప్రజల సహకారము నిరంతరము లభించగలదని ఆశిస్తూ సమర్పించు సన్మానపత్రము.

తెనాలి,<br>31—1—60.

ఇట్లు,<br>పట్టణ కళాభిమానులు.

# సురభి నాటక కళాసంఘ సప్తతి మహోత్సవాలు, తెనాలి

1960 జనవరి 29–30 తేదీల్లో ఒక విచిత్ర దృశ్యం. కళాకారుల సమ్మేళనం డెబ్బది సంవత్సరాల దీర్ఘకాల కళాతపఃఫలితంగా ఆంధ్ర నాటక చరిత్రలో సువర్ణయుగం ప్రారంభించిన సురభి నాటకరంగంపై 29వ తేదీ ఉదయం ఎనిమిది గంటల వేళ కవులూ – పండితులూ – వేదవిద్వాంసులూ – నటులూ – కళాకారులూ – వేలాది జనం పరివేష్టింప – చిత్ర విచిత్ర తోరణాలతో అలంకరింపబడిన నాటకశాలలో నాదస్వరగానకోకిల సంగీత కళానిధి శ్రీ గాంటుపల్లి రామమూర్తి నాదస్వర బృందమువారి మంగళ వాద్యాలతో వేదపండితుల వైదికాశీస్సులతో మహోత్సవాలు ప్రారంభమయినవి. ఆంధ్ర ప్రదేశ్ విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావుగారు సభకు అధ్యక్షత వహించిరి. ప్రసిద్ధాంధ్ర నటులు పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు సభా ప్రారంభము గావించిరి. సురభి నాటక కళాసంఘ కార్యదర్శి నాట్యకళాధురీణ అవేటి నాగేశ్వరరావు అధ్యక్షులకు సన్మానపత్రము సమర్పించిరి. పద్మశ్రీ స్థానంవారు ప్రారంభోపన్యాసము గావించుచు సురభవారు డెబ్బదియేండ్లుగ ఆంధ్ర నాటక రంగానికి చేసిన అపూర్వసేవా విధానమును రసభావయుక్తముగ ముచ్చటించిరి. ఆంధ్ర దేశంలో ప్రతిరాత్రి ఎక్కడో ఒకచోట సురభి నాటకం జరుగుతూ వుంటుందనీ మొదటి ఒకటిగా ప్రారంభమైన సురభి సమాజము నేడు శాఖోపశాఖలై 46 సమాజాలుగా రూపొంది కళాసేవ చేస్తూన్నవనీ నాటక ప్రదర్శన విషయంలో వారి కట్టుబాట్లు ప్రశంసనీయమైనవనీ సోదాహరణల గావించిరి. నాటకరంగ పరికరములు నాటక విజయానికి కావలసిన హంగులు సమకూర్చుకొని తెలుగు దేశంలో ఉత్తమ నాటకాలు ప్రదర్శింపగల సమాజము లొక్క సురభివారివేనని శ్రీ స్థానంవారు ప్రవచించారు. స్త్రీలు స్త్రీపాత్రలు ధరించుటను గూర్చి ప్రస్తావిస్తూ నాటకరంగం మీద చెల్లెలు భార్యగానూ – భార్య చెల్లెలుగానూ అన్నభర్తగానూ – భర్త తండ్రిగానూ మారిపోయి – భౌతిక సంబంధములు మరచి – పాత్రలో లీనమై నటించుటలో వారి ప్రత్యేకత వారి కళావైదుష్యము ప్రశంసనీయమని వాకొన్నారు. అపూర్వ నాటక విజ్ఞానం గలవారు కుటుంబ ప్రాతిపదికపై డెబ్బదియేండ్లుగా కళాజీవితం గడుపుతూన్న ఒక మహత్తర కళాసంతతి నేడు ఆంధ్రనాటక కళాపరిషత్తు ప్రాదుర్భవించిన తెనాలిలో సప్తతి స్వర్ణోత్సవాలు జరపడం ముదావహమన్నారు. పిమ్మట ఆంధ్ర నాటక కళోద్ధారక స్వర్గీయ వనారస గోవిందరావుగారి త్రివర్ణ చిత్ర పటాన్ని ఆవిష్కరిస్తూ శ్రీ స్థానం వారు గోవిందరావుగారి ప్రతిభివ్యుత్పత్తు లనన్యసాధారణమైనవనీ ఆంధ్ర నాటకరంగానికి వీరి సేవ చిరస్మరణీయమైనదనీ శ్రీ గోవిందరావుగారు ఆంధ్ర నాటక కళాపరిషత్తును ప్రప్రథమంగా తెనాలిలో నెలకొల్పి తెలుగు జాతికి ఒక మహత్తర కళాసంస్థ దత్తంచేశారనీ ప్రస్తుతించారు. అధ్యక్షులు శ్రీ పట్టాభి రామారావుగారు సురభి నాటకకళా సంఘంవారి డెబ్బదవ వార్షికోత్సవాలకు తాము అధ్యక్షత వహించడం ఒక అపూర్వ గౌరవంగా భావిస్తున్నామన్నారు. పన్నెండు సంవత్సరాల బాల్యంలో గోవిందరావుగారి నాటకాలు తాము చూచామనీ నాటి నాటకస్మృతులు నేటి వరకూ తమహృదయంలో నిలిచి వున్నవనీ – సురభివారు గ్రామసీమల్లో చేస్తూన్న కళా కృషి అనన్యసాధారణమైనదనీ

డెబ్బదియేండ్లుగా ఒకకళాసంస్థ దేశంలో జీవించి యుండుట ప్రజల కళాతృష్ణ కుదాహరణమనీ కాలంతో మారుతూ అభిరుచులననుసరించి రంగ స్థలాన్ని సవరించుకుంటూ అవిచ్ఛిన్నంగా ముప్పదియారు శాఖలుగా సురభివారు దేశంలో కళాసేవ చేస్తూండడం శ్లాఘనీయ మన్నారు. ఎన్నో సమాజాలు తెలుగు దేశంలో పుట్టి గిట్టినై. కాని జీవనదివలె సురభి సమాజాలు నిత్యనూతనమై విరాజిల్లుచున్నవి. సమాజ నిర్వహణలో వారికి ప్రత్యేకత కలదని యిందువల్ల వ్యక్తమౌతున్నదన్నారు. ఒకే పాత్ర ముగ్గురు నలుగురు పంచుకొని జంతుప్రదర్శనం లాగ నేటి నాటకాలు కిరాయిపద్ధతిలో కళను ధ్వంసంచేస్తూన్నవి అట్టి పరిస్థితులో నాటకకళ జీవించి యున్నదని వ్యక్తీకరించి కళను నిలబెడుతూన్నవి సురభి సమాజాలు అందుకు శ్రీ మంత్రిగారు సురభి సమాజాలను అభినందించారు. ఈ మహోత్సవాలలో పాల్గొనే అవకాశం కలిగించినందులకు సురభి నాటకకళా సంఘమువారికి ధన్యవాదాలు చెప్పారు. తరువాత సురభినాటకకళా సంఘసప్తతి స్వర్ణోత్సవ సంచిక ఆవిష్కరించారు. సురభి వారి సంపూర్ణ సప్తతివర్ణ కళాజీవితం చిత్రింపబడిన యీ సంచికయొక్క ప్రత్యేకతను ప్రశంసించారు. పిమ్మట నాట్యశాస్త్రకర్తలు పండితులు శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారికి సురభి నాటక కళా సంఘం సన్మానము గావించినది. కార్యదర్శి నాగేశ్వరరావుగారు ప్రశంసా పత్రము సమర్పించిరి. శ్రీ శారదా విజయ నాట్యమండలి నిర్వాహకులు శ్రీ యస్. ఏ. బాబారావుగారు శ్రీఅప్పారావుగారికి కాశ్మీరశాలువ కప్పి గౌరవించిరి. సంఘపక్షమున నూటపదహార్లు సమర్పించిరి. తరువాత సురభి వృద్ధనటులు శ్రీ వనారస వెంకటప్పయ్యగారికి సన్మానము జరిగినది. శ్రీ వెంకటప్పయ్యగారు పెద్దనటులు కాకపోయినను సురభి సమాజములకు అఖండసేవ చేసినారు. నాటక సమాజమునకు కావలసిన పనులన్ని సమగ్రముగా తెలిసినవారు. నిజాయితీ క్రమపద్ధతి కలిగి సమాజ శ్రేయస్సుకు పాటుపడ్డ ఉత్తమవ్యక్తిగా శ్రీ వెంకటప్పయ్యగారి గుణగణాలను నాగేశ్వరరావు ప్రశంసించి నూతన వస్త్రాలిచ్చి సన్మానించారు.

మరల మధ్యాహ్నం నాలుగు గంటలకు విద్యామంత్రి పట్టాభిరామారావుగారి అధ్యక్షతను సభ ప్రారంభమైనది. శ్రీ శివశంకరస్వామి ఆశీస్సులు పలికారు. ప్రసిద్ధి భాషవేత్తలు ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు, నాట్యకళాబ్రహ్మశ్రీ త్రిపురారిభొట్ల వీరరాఘుస్వామిగారు పాతూరు మధుసూదనరావుగారు, పులిపాటి వెంకటేశ్వర్లుగారూ నాటకకళను గూర్చి సురభివారి కృషిని గూర్చి ప్రసంగించిరి. మంత్రి పట్టాభిరామారావుగారు తమ అంత్యోపన్యాసంలో ఉత్తమ నాటకాన్ని యితర రాష్ట్రాలల్లో ప్రదర్శించడానికి ప్రభుత్వం నిర్ణయించినదని కూచిపూడి బృందాన్ని ప్రస్తుతం పై రాష్ట్రాలలో ప్రదర్శనలిచ్చుటకు పంపనున్నదనివక్కాణించిరి. సురభి వారికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకడమీలో స్థానం కల్పించినామని స్వర్గీయ డి. వి. సుబ్బారావుగారిస్థానే నాట్యకళాధురీణ ఎ. నాగేశ్వరరావుగారిని సభ్యులుగా శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి సూచనపై నియమించడం జరిగినదని మంత్రిగారు చెప్పారు. మంత్రిగారి అధ్వర్యాన రాత్రి తొమ్మిదిగంటలకు కళాప్రియులు డాక్టరు ఉప్పల పూర్ణయ్యచౌదరి గారి పుత్రికలు చి॥ కృష్ణ సరోజల భరతనాట్యం జరిగింది. నాగేశ్వరరావు బృందము వసంతసేన నాటకం ప్రదర్శించిరి.

## సాహితీ సమితి

30 వ తేదీ ఉదయం 8 గంటలకు సాహితీ సమితి సమావేశములు నాదస్వర పూర్వకముగ వేదాశిస్సులతో అనేక పండిత కవి విద్వత్పరిషత్తు ప్రారంభమైనది. కార్యదర్శి నాగేశ్వరరావు తమ సంఘపక్షమున సాహితీ సమితి సభ్యవర్యులను ఆహ్వానించారు. సభాపతి శివశంకరస్వామి సమితి సభ్యులను పరిచయం చేశారు. సమితి కార్యదర్శి కవి సామ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు వసంత

రావు వెంకటరావు గారిని అధ్యక్ష పీఠమలంకరించవలసినదిగా కోరారు. ఆంధ్రప్రభ సంపాదకులు నీలంరాజు వెంకటశేషయ్యగారు సమితి సమావేశమునకు ప్రారంభోత్సవము గావించిరి. శేషయ్యగారు ఒకప్పుడు ఉత్తమ నటులు. నాట్యకళలో ఆరితేరిన రచనలు ప్రకటించి ఆంధ్రుల అభిమానానికి పాత్రులైనవారు. చిరకాలంగా సురభినాటక సమాజాలతో పరిచయము గలవారు. వారి ప్రారంభోపన్యాసంలో నేటి సాహిత్యం పోకనడుటనుగూర్చి యువకుల కర్తవ్యాన్నిగూర్చి ప్రసంగించారు. రసవత్తరమైన రచనల కోసం కృషి చెయ్యవలసిందిగా ఉద్బోధించారు. అధ్యక్షులు వసంతరావు, వెంకటరావుగారు ఎలక్ట్రానిక్సుగురించి దీర్ఘోపన్యాసంగావించిరి. పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు శతపత్రమునుండి గేయములు చదివిరి. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కావ్యగానమొనర్చిరి. నోరి నరసింహశాస్త్రిగారు పూజావనము నాటిక వినిపించిరి. శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులుగారు అనూరము సంస్కృతనాటకము చదివిరి. పెద్దిభొట్ల రామచంద్రరావుగారు కావ్యగానమొనర్చిరి. త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు రవీంద్ర గీతావళి పఠించిరి. సంజీవదేవ్ ఎస్పరెంటో ప్రపంచ భాషల గురించి ప్రవచించిరి. మరల మధ్యాహ్నం నాలుగు గంటలకు విద్వత్కవి వర్యులు, ఉపన్యాసకంఠీరవ, జమ్మలమడక మాధవరామశర్మగారి అధ్యక్షతనుసమావేశము ప్రారంభమైనది. శ్రీమతి పిండిప్రోలు వసంతకుమారి కావ్యపఠనము గావించిరి. సుబ్రహ్మణ్య శర్మగారు అభిజ్ఞాన శాకుంతల సంస్కృత కావ్యమునుండి కొన్ని ఘట్టములు వినిపించిరి. పలువురు వ్యక్తులు, పండితులు, కవులు తమతమ రచనలు చదివిరి. సభాపతి శ్రీ శివశంకరస్వామి సాహితీసమితి సమావేశమును గూర్చి ప్రసంగించిరి. పండితులను సురభి నాటకకళా సంఘము చందన తాంబూల వస్త్రాదులచే సన్మానించినది. మల్లాది వేంకటకృష్ణ శర్మగారి అభినందనలతో సాహితీసమితి కార్యక్రమము ముగిసినది.





సురభి నాటకకళాసంఘుసప్తతి స్వర్ణోత్సవములు
నాదస్వర విద్వాన్, శ్రీ గంటువల్లి రామమూర్తిగారి
మంగళవాద్యములతో ప్రారంభమైన దృశ్యం.



సురభి నాటకకళాన ప్రతి స్వర్ణోత్సవ సందర్భమున సురభి కళాకారులతో విద్యాశాఖామాత్యులు గా॥ శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావుగారు,
[illegible] 20 1 60 తేది



గౌ॥ శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు (విద్యాశాఖామాత్యులు) గారికి సురభి నాటకకళాసంఘ పక్షమున సన్మానపత్రము సమర్పించుచున్న శ్రీ అపేటి నాగేశ్వరరావు (కార్యదర్శి).



సురభి నాటకకళాసమితి స్వర్ణోత్సవమునకు అధ్యక్షతవహించి, అధ్యక్షోపన్యాసం గావించుచున్న గౌ॥ శ్రీ యస్. బి. పి. పటాభిరామారావు (విద్యాశాఖామాత్యులు) గారు 29-1-60 తెనాలి.



పద్మశ్రీ స్థానం నరసింహారావుగారిని ఆహ్వానిస్తున్న దృశ్యం 29-1-60 తెనాలి.



సురభి నాటకకళాసంఘము ప్రతి స్వర్ణోత్సవ సందర్భమున ఆంధ్రనాటక కళోద్ధారక
శ్రీ వనారస గోవిందరావుగారి చిత్రపటావిష్కరణ గావించుచున్న పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు,



మురళి నాటకకళాసంఘము షష్ఠి స్వర్ణోత్సవ సందర్భమున ప్రారంభోపన్యాసము గావించుచున్న పద్మశ్రీ స్థానం నరసింహారావుగారు.



మురళి నాటకకళాసంఘము షష్ఠి స్వర్ణోత్సవ సందర్భమున ప్రసంగించుచున్న కార్యదర్శి శ్రీ అవేటి నాగేశ్వరరావు.



గౌ॥ శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావుగారు (విద్యాశాఖామాత్యులు)
సురభి నాటకకళాసంఘ అధ్యక్షులు ఆర్. వెంకట్రావుగారిని అభినందించుచున్న దృశ్యం.





శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారిని సురభి నాటకకళాసంఘ పక్షమున
కార్యవర్గసభ్యుడు శ్రీ యన్. ఎ. దాదారావు సన్మానిస్తున్న దృశ్యం.



సురభి నాటకకళాసంఘస ప్తతి స్వర్ణోత్సవ సందర్భమున సురభి వృద్ధనటుడు
శ్రీ వనారస వెంకటప్పయ్యగారిని సంఘపక్షమున కార్యదర్శి సన్మానిస్తున్న దృశ్యం, 29-1-60 తెనాలి.



సాహితీసమితి సమావేశమునకు ప్రారంభోపన్యాసం గావించుచున్న శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు (ఆంధ్రప్రభ సంపాదకులు





మురళి నాటకకళాసంఘ సప్తతి స్వర్ణోత్సవ సందర్భమున జరిగిన సాహితీసమితి
సభలో అధ్యక్షోపన్యాసం గావించుచున్న శ్రీ. వసంతరావు వెంకటరావుగారు
ప్రక్కన ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు.



సాహితీసమితి సభలో పాల్గొన్న విద్వత్కవివర్యులు, ఉపన్యాస కంఠీరవ, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు
ప్రక్కనున్నవారు శ్రీ సూరి నరసింహశాస్త్రిగారు.



సురభి నాటకసంఘ యువకళాకారులు.



శ్రీ గుళ్లపల్లి ఆదిశేషయ్య బృందం.



ప్రసిద్ధ నాటక రచయిత

శ్రీ మల్లాది వేంకటకృష్ణశర్మ.

# తెరలో కురుక్షేత్రం

## పెద్దపద్యాల నాటిక

రచన:- మల్లాది వేంకటకృష్ణశర్మ

రంగస్థలం :- ఆడియన్సు నేపథ్యంలో గ్రీన్‌రూమే రంగస్థలం.

విషయం :- ఆ రాత్రి 9-30 నిముషాలకు కురుక్షేత్ర నాటకం ప్రారంభం కావాలి. నెల దినాలుగా ఈ కంట్రాక్టు నాటకం బ్రహ్మాండంగా ఎడ్వర్టైజు చేసినందువల్ల జనంతో హాలు కిటకిట లాడుతున్నది. "డబుల్ ట్రిబుల్ కాంబినేషనుతో ముచ్చటైన మూడువందల పద్యములు పాడబడును" అన్న వార్త తెలిసి చుట్టుప్రక్కల గ్రామాలనుండి అశేష ప్రజానీకం 'బ్లాక్'లో టిక్కెట్లు కొనుక్కొని ఎనిమిదింటికే హాల్లో కూచున్నారు—కనక ఈ నాటకం జరుగుతున్నంతసేపూ నేపథ్యంలో ఆడియన్సు ఈలలూ గోలా అరుపులూ తిట్లూ అస్పష్టంగా వినిపిస్తూనే వుండాలి.

పాత్రలు:- ఇద్దరు కృష్ణులు—ముగ్గురు అర్జునులు ఇద్దరు కర్ణులు ఇద్దరు ధర్మరాజులు ఒక ద్రౌపది. అందరూ మొగాలకు రంగులు వేసుకొని బనీన్లతో గూడకట్లతో కొందరు చుట్టలూ—కొందరు బీడీలు కాలుస్తూ వుంటారు. దూరంగా మంగలి నకుల సహదేవులకు గడ్డాలుగీస్తూ వుంటాడు. ద్రౌపది స్థూలగాత్రి మొహానికి రంగుమాత్రం పూసుకొని నలిగిపోయిన ఊదారంగు జరీ నేతచీర కట్టుకొని ట్రంకుమీద కూచొని ఒక పక్కవంక ఆశతో చూస్తూ వుంటుంది. ఆమెకు కాస్త దూరంగా ఇద్దరు డ్రస్సు కుర్రవాళ్లు ఆమెవంక అదేపనిగా చూస్తూవుంటారు. తెర లేస్తుంది.

ఇంకా హార్మోనిస్టు—కంట్రాక్టరు—పోలీసు సూపర్నెంటు—హాలు యజమాని—ఆరుగురు పోలీసులు—ఆడియన్సులోంచి పదిమంది జనం—సమయానుకూలంగా వచ్చిపోయేవారు పాత్రలు.

సమయం :- రాత్రి 10-30 దాటింది.

రెండవ కృష్ణుడు:- సోదరా మూడవకృష్ణా! మనఅన్న మొదటి కృష్ణుడు రాలేదా ?

మూడవకృష్ణుడు:- లేదు సోదరా లేదు. వానికీ రాత్రియే అనంతపురములో నాటకము కలదు. అదియు కురుక్షేత్రమే.

రెండవకృష్ణుడు:- ఆమాట చెప్పవలెనా? మనకు కురుక్షేత్రముకాక మరియొక నాటకము వచ్చునకదా !

తిరుపతి వెంకటేశకవి

ధీరుల ధర్మమంటంచు నిట్లు సు
స్థిరముగ నొక్క నాటకమె
తేకువ దంచి కిరాయి డబ్బులన్
సరగున పొంది జీవితము
చక్కగబుచ్చుచునుంటిమెంతయున్
మరియొక నాటకంబనెడి
మాటయె లేక ధరిత్రిలోపలన్॥

మూడవకృష్ణ:- అదియు నిజమే. యెట్లందువా?
మూడువందల పద్యముల్ మోతమోయ
వన్సుమోరులతో ఆనంద లగును
ఇన్నిపద్యంబు లొకకృష్ణు డెట్లు చదువు
గాన పాత్రకు ముగ్గురు గల్గుటొప్పు॥

రెండవ కృష్ణ:- నిజము వచించితివి! మొదటి కృష్ణుడు రాకున్న నేనే ఆ పాత్ర ధరింపవలె నేమో - దురాత్ముడగు కంట్రాక్టరు నాకు కిరాయి యిచ్చునా-సందేహమే - దైవమా! ఇప్పుడేమి సేయుదును. సోదరా ఇప్పుడు టైమెంతయైయుండును?

మూడవ కృష్ణ:- (వాచీచూచి) హా! హతవిధీ, ఈ వాచీ నిలచిపోయినదే! యిప్పుడేమని బదులుచెప్పుదును? ఇట్లని చూచెదగాక. అన్నా రెండవకృష్ణా! ఇప్పుడు పదకొండు దాటియుండును.

రెండవ కృష్ణ:- ఓయీ! మూడవకృష్ణా! ఇప్పుడు పదిగంటలయినది.

మోసపున్ వాచిదాల్చి నన్నిట్లుమోసగించె
పారవేయుము కాల్వలో వాచినిపుడె
ప్రాతవడి నిల్చి పోయినవాచియన్న
చచ్చిపోయిన మనిషితో సమముగాదె॥

పారవేయుమురా వాచిని పారవేయుము.

మూడవ కృష్ణ:- ఓరీదురాత్మా! ఏమని పల్కితివి. నావాచి తప్పందువా! నీవన్న పదియన్నదో జరిగినది; నామాట కాదందువా నీశిరంబు ద్రుంచెద.

రెండవ కృష్ణ:- ఓరీ! దురాత్మా - దుర్మతీ - దుష్టా! పెద్దవాడనైన నన్ను, నీకన్న హెచ్చు కిరాయి పుచ్చుకొను నన్నే దూషింతువా? నీకాయువు మూడినది కాచుకొనుము.

ఓరీనీచుడ టైము చెంతయని నే
నొప్పారగా అడ్గినన్
గోరంతైనను సంశయింప కీటులన్
క్రూరంబుగా బల్కెదే
తేరా ఖడ్గము-తేర, చక్రమును క్రుం
దింతున్ దురాత్మున్ వెసన్
పోరాటంబున నెవ్వడడ్డమగునో
పోకార్తు నిన్నిప్పుడే॥

మూడవ కృష్ణ:- ఓరీ-నీచ ఛండాల వాచాటా!

చచ్చితివింక చూడుమిదె
సర్వజగంబు నుతింప నిన్నిటన్
గ్రచ్చరచంపువాడ. నిక
కాకులు ప్రేలకుయుద్ధమందు నిన్
జిచ్చర పిడ్గువోలె మరి
జీవనముల్ గొనువాడ నీడు ఆ
లచ్చిమగండు వచ్చినను
లక్ష్యముసేయక నిన్నుచంపడే॥

మరియు నోయధమాధమా బాగుగావినుము.

నిన్నును నీదు బంధువుల
నీదగు ముండను దానితండ్రినిన్
గన్నన తన్నుకన్న నను
గాడిద యంచు జగంబు పిల్వదే
సన్నుతి కమ్మవంశకుల
సంభవులెల్లరు నన్ను తిట్టరే
నిన్నిదె సంహరించి కరు
ణించెద భూమిభరంబు తీర్చెదన్.

రెండవ కృష్ణ:- ఛీ - గాలువా - పలువా! ఇదే నాఘోర భయంకర మహాప్రతిజ్ఞ వినుము.

అదె కంట్రాక్టరువచ్చి, ఓ ద్వితీయ కృ
ష్ణా! సద్రువద్దంచు నా
పదకంజాతములందు వ్రాలి వెస సం
ప్రార్థింప ప్రార్థింప నీ
ముదమారన్ మన ప్రేక్షకాధములు నో
మోరంచు బిట్టార్వ నీ
కదనంబందున నిన్నుగూల్తు నిదె నా
గాండీవ చక్రంబునన్॥

(అని ఒక్క గుద్దు వేయును)

మూడవ కృష్ణ:- హా! చచ్చితి! చచ్చితి!

(మూర్ఛచే నేలగూలును)

(ఇదంతాచూస్తున్న ద్రౌపది చప్పట్లు చరుస్తూ ఆనందంతో)

ద్రౌపది:- భేష్! భేష్! ఇంతవరకు నాటకం చాలాబాగుంది. ఏమండీ ఈ కొత్తనాటకం ప్రాక్టీసు చేస్తున్నారా! పద్యాలెంత బాగున్నాయండీ. అసలు ఉద్యోగవిజయాల్లో పద్యాల్లాగే వున్నాయ్.

రెండవ కృష్ణ:- ఏడిశావ్! గుక్కతిప్పకుండా పద్యాలుచదవడం అలవాటయి ఒక్కముక్క కూడా మాటరావడంలేదు. ఆ అంటే పద్యం ఊ అంటే పద్యం. పద్యంలో ఏక్షన్ దానంతట అదే వచ్చేస్తుంది. కొంపతీసి వీడు చావలేదుకదా!

(పడిపోయిన మూడవకృష్ణుని మీదపడి)

హా సోదరా మూడవ కృష్ణా!

అకటా యెచ్చటినుండి వచ్చితివో అ
న్యాయంబుగా చంపినా
నొక పద్యంబును పాడకుండగనె అ
య్యో పోయెదే, యింక నా
టకమం దొక్కడె కృష్ణపాత్రమును నా
డంగల్గు లేట్లోకదా
ఒకకృష్ణుం డెటు రాకపోయె వారి నీ
తో యిప్పులన్ జచ్చితే॥

మరియు సవధరింపుము.

వేయన్నైతిప పూర్తిగా వేషమేని
పుచ్చుకొనన్నైతివి కిరాయి పూర్తిగాను
ఇంతలోననె చావు పిలించెనో కొ
కడు కఠినుడైనయట్టి యా కంజభవుడు॥

ద్రౌపది:- అబ్బ! ఈ పద్యాలుకూడా యెంత బాగున్నాయండీ.

రెండవకృష్ణ:- (లేచి) ప్రేయసీ! ద్రౌపదీ!

ద్రౌపది:- ఇదేమిటండి! కృష్ణుడు ద్రౌపదిని ప్రేయసీ అనవచ్చునా?

రెండవకృష్ణ:- ఇది తెరలోకురుక్షేత్రమే- ఇచ్చట వావివరుసలు లేవు.

ద్రౌపది:- ఓహో! అలాగైతేసరే ప్రాణేశ్వరీ అనికూడా పిలవండి.

రెండవ కృష్ణ:- దానికేమి ఇప్పుడు టైమెంతయై యుండునో నీవు చెప్పగలవా?

ద్రౌపది:- చెప్తే మీకు కోపంవస్తుందేమో- నాలుగు పద్యాలుచదివి సన్నుకుండాలంతే?

రెండవ కృష్ణ:- భయములేదు చెప్పుము.

ద్రౌపది:- ఇంకా తొంగలబండి రాలేదుకదండీ.

రెండవ కృష్ణ:- ఆహా! ఏమి నాభాగ్యము - ఆ బండి నాటకము పూర్తియగువరకు రాకుండుగాక.

ద్రౌపది:- వస్తే మీకేమండి?

రెండవ కృష్ణ:- అట్లయిన వినుము.

నాటకమైనతోడనె జ
నంబులచేతికి చిక్కకుండనే
పీటికి పోదనా యిచట
వీపువిమానపు మోత తప్పనే
కోటులో పాగవేసినటు
గొప్పగ తప్పుకొనంగ గల్గుదున్
నాటకమైన పిమ్మట జ
నంబులు చూచిన తన్నకుందురే॥

ద్రౌపది:- అబ్బ! ఏమిటండీ ఇంతమంచి పద్యాలు ఈ పద్యం యెంత బాగుందండి.

రెండవ కృష్ణ:- నాప్రాణం తీస్తున్నావ్-పద్యాలు పద్యాలని - ఆ ఉద్యోగవిజయాల ధర్మమా

అని ఇంట్లోకూడా మాటలకు బదులు పద్యాలూ పాటలే వచ్చేస్తున్నాయి. మొన్న భోజనంచేస్తూ మా ఆవిడతో పరాగ్గా "చారు వడ్డింపరావెమో చంద్రవదన" అన్నాను. ఆమట్టున గరిటకాస్తా పడేసి గదిలో అద్దం ముందు నించొని తనమొహం చంద్రుడులా వుందో లేదో చూసుకుంటూ నిలబడింది.

(తెరలో గోల, ఈలలు, చప్పట్లు, తిట్లు)

కంట్రాక్టరు:- (హడావుడిగా ప్రవేశించి) అరె! ఇంకా యిలాగే వున్నారే - పన్నెండయింది. ఇంకా విగ్గులు పెట్టుకోలేదు - పూసలు కట్టుకోలేదు. డ్రస్సు వేసుకోలేదు-హాలుచూస్తే జనం కిట కిటలాడిపోతున్నారు. తొరగా కానివ్వండి. వీడేం ఇలా పడిపోయాడు? తాగేడా! ఆ అనుకుంటూనేఉన్నాను. నాటకమయేదాకా తాగద్దని బతిమాలాను. అంతాయింతే - తాగుబోతులు. వీళ్ళను పెట్టుకోకపోతె నాకు డబ్బురాదు. నేను పిలవకపోతే వీళ్ళకి దినం గడవదు. కొడవలికీ సిగ్గులేదు- గోంగూరకీ సిగ్గులేదు. మరితొందరగా ప్రార్థనకానివ్వండి.

ద్రౌపది:- మా దేముందండి. మా కిరాయి మాకిస్తే పది నిముషాల్లో తయారైపోతాం.

కంట్రాక్టర్:- ఏంటీ కిరాయీా! కిరాయిచ్చాక పారిపోతానా! ముందు తెర లేచేటట్టు చూడండి.

ద్రౌపది:- అదేం లాభంలేదు. ముందు కిరాయి- తరవాత వేషాలూ- పరాబ్రహ్మ- తెరా.

కంట్రాక్టర్:- ఓహో! కొంచమైనా మొగ మాటం లేకుండా మాట్లాడుతున్నావే! కొత్తదానివికదా నీకు పబ్లిసిటీ యిచ్చి పెద్ద స్టేజీవక్టర్ని చెయ్యాలని బుక్ చేసినందుకా- ఎవ్వడో అప్పుడప్పుడుతప్ప మీ కిరా యెగ్గొట్టానా?

ద్రౌపది:- అబ్బే! ఇటు పరాబ్రహ్మ పాడేసరికి అటు గల్లాపెట్టితో పరారీఅయి - మళ్లా ఆరేళ్ళనాడే దర్శనం.

కంట్రాక్టర్:- సరే! నీసంగతి నేను చూస్తాలే- ఏమయ్యా! మొదటిధర్మరాజూ! ఏం మూల కూచొని మూలుగుతున్నావ్! చుక్క పడ లేదనేనా?

ఒకటవ ధర్మ:- (ఏదో సంజ్ఞచేయును).

కంట్రాక్టర్:- ఏం. మాట్లాడవా?

ద్రౌపది:- ఆయనగొంతు పోతుందట-వచ్చిం దగ్గరనుంచి గొంతు బిగంచుకొని కూచు న్నారు. అందరినంతూ నేను మాటాడు తున్నానుగా.

కంట్రాక్టర్:- నువ్వెవరు మాటాడ్డానికి. అసలు నీవేషం యేంటి? ద్రౌపది. ఆవేషం నేనే వేస్తాను. నువ్వు వెయ్యేవద్దు-యింక కిరాయి గురించి మాట్లాడకు.

ద్రౌపది:- అదెట్లా-పేపర్లో పోష్టర్లల్లో 'గానకళ్లో లిని కనకవల్లి' ద్రౌపది అని వేశారుగా నేనే వెయ్యాలి.

కంట్రాక్టర్:- ఆమాటకొస్తే, ఈరాత్రి ఆవేషం తీసేశాను. ద్రౌపది లేకుండానే నాటకం. ఎవడుపోయినా ఫర్వాలేదు. నకులసహదే వుల్తో కురుక్షేత్రం నాటకంఆడేస్తాను చూస్కో నాసంగతి. వరేయి కృష్ణుంటూ-మీరూపొండి. నాకు భయంలేదు.

రెండవ కృష్ణ:- హా! కంట్రాక్టరా - హతోస్మి హతోస్మి.

(పాదాలపై పడి)

ఓ కంట్రాక్టరు దేవ! నీసుతుల మ
మ్మోమంగదే; నీ కృపన్
లోకంబందున సాటిమానవులలో
లోపంబు లేకుండగా
వీ కన్రోజులు పుచ్చుచుంటిమిపు డు
ర్విన్నీవు వర్జించుచో
మాకున్ దిక్కెవరయ్య నీవెగతి సు
మ్మా యిమ్మ మాభత్యముల్,

కంట్రాక్టరు:- ఇస్తాను. నాటకమయాక మీకిరా యిలు అణాపైసల్తో యిచ్చేస్తాను. చెప్పి నట్టువిని ప్రార్థన కానివ్వండి.

(మూడవ కృష్ణుడు దిగ్గునలేచి)

మూడవ కృష్ణుడు:- ఓరీ! నీ చ నా చా టా!
దురంత దప్పాత్మకా;ఇప్పుడెందుపో యెదవురా!
ధరిణిన్ద్రోసితినంచు పొంగకుర నీ
దర్పంబు దీర్పంగ వి
డరయన్ లేచెటంచు నమ్మకుమర చం
డాలాధమా! చూడు ము
ద్ధురతన్ గ్రుద్దెద వ్రచ్చెదన్ మరియు నా
దోర్దండ దర్పోద్ధతిన్
బారిగొందున్ వెసకాచు కొమ్మిది గా
అంభోరాశిలో దాగినన్॥

(కంట్రాక్టరును పట్టి చావగొట్టును)

కంట్రాక్టర్:- అరె! నన్ను కొడతాడేంటి! అసలీ పద్యం యెందులోది? ఒకేయ్- తాగినోడివి తాగినట్లుండక యేంటీ యెదవపని? నన్ను కొడతావెందుకు?

మూడవ కృ:- (తేరిపారచూచి) నీవా! నీవైన నేమిలే.

వరసన్ జంపెద చూడు మందరిని మా
పైకంబు మాకిమ్ము నీ
తరమా తప్పుకొనంగ మా నటుల ముం
దా నీ ప్రతాపం బికన్.

(కంట్రాక్టరు వీపుపై గభీగుభీ గుద్దుచుండగా పోలీసు సూపర్నెంటు పరుగునవచ్చి)

సూపరెండెంటు:- ఏయ్ ఆగు. తెరలో యేమిటీ యుద్ధం. వొదులు. వాణ్ణెందు కలా చావ గొడ్తావ్? వొదులు- (విడిపించి) ఏంజరిగింది? ఎవడు వీడు?

మూడవ కృష్ణ:- దేవా! అవధరింపుడు.

వీడు కంట్రాక్టరనువాడు వెరపులేక
ఊరికొక్కరి మమ్మోల్ల నూడ్చి తెచ్చి
నాటకము నాడజేసి యేనాడుకూడ
పూర్తిగ కిరాయి యొసగని ఘూలితండు॥

సూపరెండెంటు:- పద్యాలూ పాటలూ ఇక్కడ కాదు స్టేజీమీద. త్వరగా నాటకం ప్రారంభించండి.

మూడవ కృష్ణ:- ప్రారంభించుటయు మానుటయు ఈ కంట్రాక్టరు చేతిలో నున్నది. ఎట్లం దురా!

మా కిరాయిని మాకిచ్చి మంచిదారి
పోయినన్ లేచు తెర, ఆటపొలుపుగాంచు
కాక యీయడయేని మీ కాన్స్టబుల్సు
పదుగురైనను వీని గాపాడలేరు.

ఎట్లును వీని బంధుక్షయమును కులనాశ మును తప్పదు. సన్యాసుగా మా భాగములు మాకు పంచియిమ్మనుము మరియునో సూప ర్నెంటా బాగుగా వినుము.

సూపరిండెంటు:- షటప్. ముందు ప్రార్థన పాడి తెరెత్తుతారా లేదా?

ద్రౌపది:- ఏమండీ ఆడదాన్ని, ఒక్కమాట అడు గుతా చెప్పండి-మీరు జీతంపుచ్చుకోకుండా ఉద్యోగం చేస్తున్నారా?

సూపరిండెంటు:- ఇదెవరీ వుమన్ వట్టి పేచీకోరు మనిషిలాగుందే?

రెండవ కృష్ణ:- మా ద్రౌపదిలెండి - పట్టి పేచీ కోరు.

సూపరెండెంటు:- నువ్వెవరు ?

రెండవ కృష్ణ:- నేను రెండ్నో కృష్ణుడను.

సూపరెండెంటు:- వీడ్నో ?

రెండవకృష్ణుడు:- వీడు మూ డ వ కృ ష్ణు డు. మొదటి కృష్ణుడు రాలేదు.

సూపరెండెంటు:- నువ్వేమంటావు ?

రెండవ కృష్ణ:- ఆర్యా ధృతరాష్ట్రా సావధాన చిత్తుడవై ఆలింపుము.

మాకెడ్వాన్సు నొసంగలే దితడు ధ
 ర్మంబెంచి బస్‌చార్జి మె
మే కానిమ్మనుచున్ భరించి యెటులో
 యే తెంచినా మట్టిచో
మీకున్ ధర్మమె "డబ్బుతీసుకొనకే
 మీ రాడుడీ నాటకం
బీకష్టాత్ముని తోడనేమి టనుచున్
 హీనంబుగా బల్కుటల్

మరియు

వేలకు వేలు వచ్చినను
 వేమరు పాదములందు వ్రాలినన్
పేలదు కాణిగూడ నటు
 పిమ్మట నాటకమయ్యెనేని, మా
పాలి యముండు వీడు ఒక
 పట్టున డబ్బు నిడండు వీనిపై
జాలి వహించి మా నటుల జం
 పుట ధర్మమె సూపరెంట్ ప్రభూ !

సూప:- ఏమయ్యా కంట్రాక్టర్. వాళ్ళ కిరాయి వాళ్ళ కియ్యకపోతే నా ట కం యెట్లా జరుగుతుంది?

కంట్రాక్టర్:- నే నియ్యనన్నానా?

సూప:- మరిచ్చేయ్.

కంట్రా:- మాకు కొన్ని తగువు లున్నాయి. తరవాత అణాపైసల్తో యిచ్చేస్తాను.

సూప:- వీల్లేదు. ముందిచ్చేయ్. లేకపోతే స్టేషన్‌కి నడు.

కంట్రా:- ఈ యేక్టర్లకి విశ్వాసం లేదండి. ప్రజల్లో వీళ్ళని పైకి తెచ్చింది కంట్రాక్టర్లే కదండి.

సూప:- షటప్. ఆ గోల విను. ముందు వాళ్ళ కిరాయి యిస్వు.

కంట్రా:- అ స లు మొద్దుముండాకొడుకు ఆ మొదటి కృష్ణుడు రాలేదండి.

సూప:- ఎందుకు రాలేదు?

కంట్రా:- తాగి యే రైలుటేశన్లో పడుకు-న్నాడ్నో.

రెండవ కృ:- ఏడ్చినావులే.

పిలువకుండనె పేపర్లో పేరువేసి
పోష్టరుల నింపి గోడల పొందుపరచి
డబ్బు దోచతలంచు కంట్రాక్ట రెపుడు
నటుల నిందించుచుండు నిన్నాడనేల॥

కంట్రాక్టరు:- ఛీ ఛీ! నోర్మూయ్. ఇ చ్చి న యెడ్వాన్సు కాజేసి నాకొప్పుకున్న తేదీకే మరో కంట్రాక్టరుతో నువ్వు మరోవూళ్ళో నాటకాలాడలేదా?

సూపరెండెంటు:- ఏయ్! ముందు నాటకం మొదలుపెట్టండి - నాకు కోపం వస్తూంది. ముందు వేషాలేసుకోండి కిరాయి నే నిప్పిస్తాను.

ద్రౌపది:- ఆమాట మీరంటే ఇహనేం? రడీ.

(అందరూ డ్రస్సులు వేసుకుంటూ వుంటారు)

సూప:- ఏమయ్యా కంట్రాక్టర్ నీకు డబ్బు రాలేదా?

కంట్రా:- ఏమొచ్చిందండి. మొదటి కృష్ణుడు మూడొందలు-రెండోవాడు రెండొందలు-మూడోవాడు నూటయాభై - అర్జునుల్ని ముగ్గురికీ నాలుగొందలు-ద్రౌపది ఫిఫ్టీ-ధర్మరాజులు చెరినలభై-నకుల సహదేవులు రెండ్రెసులు - హాలు నాలుగొందలు - పబ్లిసిటీ ఆరొందలు మొత్తం అయిదువేల నాలుగు వందలు వస్తే ఒకవంద తేలుతుంది కాని ఈ హాలు వెయ్యేకంటె యెక్కువ పట్టదే.

సూప:- పాపం చాలా నష్టానికి నాటకం ఆడిస్తున్నావన్నమాట.

కంట్రా:- కళ సార్. కళ. నాటకకళ.

సూప:- ఏక్టర్లంతా వచ్చినట్టేనా?

కంట్రా:- ఎక్కడొచ్చారండి. మొదటి కృష్ణుడు రాలేదు. రెండో అర్జును డాప్సెంటు. నాలుగో ధర్మరాజు గోవిందా. రెండో కర్ణుడు కటాఫ్.

సూప:- ఏక్టర్లు రాకపోతే ఆడియన్సు ఊరుకుంటారా?

కంట్రా:- అందుకే ఆలస్యంగా ఆట ప్రారంభిస్తున్నాం. విసుగెత్తి ఉన్నవాళ్ళతోనే ఆడమని వాళ్ళంతట వాళ్ళే అంటారు!

సూప:- నీ సంగతేమీ బాగాలేదు.

కంట్రా:- ఎలా బాగుంటుందిసార్. వేషానికి ముగ్గుర్నీ నలుగుర్నీ తెస్తున్నాంగనక ఒకరిద్దరు రాకపోయినా నాటకం జరుగుతూంది. అసలు వేషానికి ఒక్కణ్ణే పెట్టుకున్నప్పుడు ఎన్ని నాటకాలు ఆపుకొనేవాళ్ళండి? ఈ కిరాయివాళ్ళలో తాగనివాడు లేడండి.

సూప:- అసలు నువ్వు త్రాక్కుండా మాట్లాడుతున్నావా నాటకం రసాభాస అవుతుందని వూరుకున్నాను. లేకపోతే ఆ ఆడమనిషితో సహా అందర్నీ ప్రొబిషన్ క్రింద బుక్ చేసేవాణ్ణి.

కంట్రా:- చిత్తం. క్షమించాలి.

సూప:- మరోసంగతి చెప్పు. కుర్చీ- బెంచీ టికెట్లు బ్లాక్‌లో పదికీ, పదిహేనుకీ అమ్మించావట.

కంట్రా:- ఆ సంగతి పేపర్లో వేశానుకదండీ. "స్థలం నిండినవెనుక రేట్లు హెచ్చించ బడును" అని.

సూప:- ఇది కాదురా! అసలు కిరాయి నాటకాలు ప్రభుత్వం బేన్ చెయ్యాలి. అప్పుడు కాని మనదేశంలో నాటకకళ బాగుపడదురా!

కంట్రా:- అలాచేస్తే అసలు నాటకాలే వుండవండి. ఉన్న పద్యాల నాటకాలు మరీ వుండవు. ఇంకెంతలెండి అన్ని నాటకాలూ పోయి ఒక్క కురుక్షేత్రం మిగిలింది. అది కూడా పోతే పాటలూ పద్యాలూ లేకుండా సారెగదిలో దంపతుల్లాగ, మాటా మంతీ లేకుండా స్టేజినాటకాలు నడీ సప్పుడూ వుండదండి.

(ఇద్దరు కృష్ణులు-ద్రౌపది-ధర్మరాజులూ నటులు వేషాలు వేసుకొని ప్రవేశం)

రెండవ కృష్ణ:- ఆర్యా! అవధరింపుము.

మాకు కిరాయొసంగిన క్ర
మంబుగ నాటకమాడువార మ
ట్లీక, మదంబునన్ నటుల
హీనత జూచిన చక్రధారచే

**పీకలుగోతు, నాటకము**
**వేయతలంతువా మా కిరాయి మా**
**కీకబలంబు జూపుదువా**
యేర్పడచెప్పుము కౌరవేశ్వరా!

సూప:- కంట్రాక్టర్-ఇచ్చేయ్ వాళ్ళ కిరాయ్.

కంట్రా:- సరే. ఇప్పుడేనస్తా-ప్రార్థన కానివ్వండి యిచ్చేస్తా......

(పోబోగా)

రెండవ కృ:- (వాని నడ్డి) ఎచటికి పోయెదవురా!

గల్లాపెట్టను పంపివేసితివి మా
కళ్ళల్లో కారంబొగిన్
జల్లం దప్పకొసంగ నీ కరణి కా
ల్జాడింప నూహింతువే
అల్లాటప్పలుగాను ఆంధ్రనటు ల
త్యుగ్రాహావక్రోశిన్
బల్లార్పంగలవారు తప్పకొన
భావ్యంబౌనె దుశ్శాసనా॥

కంట్రా:- నిలు. వొదులు చాల్లే మహాచదివావ్. పద్యాలు. స్టేజీమీద చదవలేవుగాని-వొదులు-నీకు కిరాయెద్దా!

సూప:- కంట్రాక్టర్ని వొదలండి. ఏయ్ ఫార్టీ ఫోర్.

44 కానిస్టేబుల్:- (వచ్చి సేల్యూట్‌చేసి) సార్.

సూప:- ఈ కంట్రాక్టరుతో వెళ్ళి - దగ్గరే వుండి తీసుకురా.

44 కాన్:- అలాగే సార్. పదవయ్యా.

(కంట్రాక్టరు 44 కానిస్టేబుల్ నిష్క్రమణ)

సూప:- మీా ఏక్టర్లు - కంట్రాక్టర్ని కొంచెం కూడా నమ్మరే!

మూడవ కృ:- నమ్మను-నమ్మజాలము! ఏమందురా!

**మమ్మెక్కింతయు నమ్మ డా మానవుండు**
గాన, నవ్వానిపై నమ్మకంబు లేదు
మాకు, ఇప్పుర మెుకచోట నేకమైన
జరుగు మోసంబు ప్రేక్షకజనుల కెపుడు.

ఇప్పుడుచూశాసుగా - వాడు కిరాయివ్వడు మేం తెరెత్తం.

సూప:- కిరాయి వాడిచేత రేపైనా యిప్పిస్తాను. నాటకం ఆడితీరాల్సిందే.

(హాలు యజమాని రంగస్వామి)

రంగస్వామి:- సార్-సార్-ఆడియన్సు ఫర్నిచర్ ధ్వసంచేస్తున్నారు సార్. ఇంకా తెరయెత్తక పోతే, మనిషో కుర్చీ బెంచీ పట్టుకుపోతా రండి. మొన్ననే మూడువేలిచ్చి చేయించాను. సరిక్రొత్త ఫర్నిచరండి. తొందరగా నాటకం బిగిన్‌చెయ్యండి.

రెండవ కృ: బిగిన్‌చేయుటయు చేయకుండుటయు ఆ కంట్రాక్టరు చేతిలోనున్నది.

రంగస్వామి:- కంటాక్టరేంజేస్తాడండి తొమ్మిదిన్నరకి నాటకం ప్రారంభిస్తామని, పన్నెండున్నరయింది. తేదీకూడా మారిపోయింది ఇంకా ప్రారంభించకపోతే ఆడియన్సు ఊరుకుంటారా?

రెండవకృ:- (కోపముతో ముందునిలిచి)

ఓయీ! ఊరుకొనక చేయునదేమి?

అంత బింకంబు గలవాడవైతివేని
యిమ్మురా! మా కిరాయిని యిప్పుడైన
లేకయుండిన తెరలోకి రాకు మింక
పొమ్ము కంట్రాక్టరనె పట్టుకొమ్ము-పొమ్ము॥

ఇంక ఆడియన్సందువా? వారితో మాకు పనిలేదు.

వన్నుమోరని యూర్చు దౌర్భాగ్యులైన
ఆడియన్నును ఏక్టర్లమైన మాకు
చెప్పి భయపెట్టజూతువే చెనటి నీవు
వారి సత్తువ తెలియనివారమొకో?

(ఆడియన్సు పదిమంది కోపంతో ప్రవేశించి)

ఒకటవవాడు:- ఏంరా! ఏక్టర్లు నాటకం మొదలుపెడతారా లేదా?

రెండవకృ:- ఎవరు మీరు?

రెండవవాడు:- ఎవరా! బ్లేకులో టిక్కట్లుకొని నాటకం చూడ్డానికి వచ్చినవాళ్ళం-ఆడియన్సుం...

రెండవ కృష్ణ:- హా! సోదరా! చచ్చితిమి.

ఆడియన్సు:- నాటకం ప్రారంభిస్తారా! తన్నమన్నారా!

సూప:- దౌర్జన్యం సద్దు - మీరు మీ స్థలాల్లో కూచోండి.

ఆడియన్సులో ఒకడు:- ఎంతసేపండీ కూచొని కూచొని విసుగెత్తిపొయ్యాం. వెధవది, పెళ్ళి పీటలమీదంగాడా యింతసేపు కూచోలేము.

మరొకడు:- తొమ్మిదిన్నరకి ప్రారంభిస్తామని పేపర్లో రాశారు. ఒంటిగంటయింది. ఇంకెంత సేపు?

సూప:- అసలుతప్పు కంట్రాక్టరుది. వీళ్ళకింత వరకూ కిరాయియివ్వలేదు.

ఆడి:- అబద్ధం-మొదటే ఇచ్చేశారండీ. ఇప్పుడే మాతో చెప్పాడు. ఈ కిరాయాక్టర్లంతా దగా-మోసం.

రెండవ కృ:- అయ్యలారా! క్షమింపుడు. మా కా దురాత్ముడైన కంట్రాక్టరు కిరాయి యివ్వ లేదు. అట్లబద్ధమాడువారము కాము.

ఆడి:- మా కదంతా తెలీదు. ముందు నాటకం ప్రారంభిస్తారా! తన్నమన్నారా!

రెండవ.కృ:- హా! హతవిధీ! యెంత గతి తెచ్చి పెట్టితివిరా!
హృదయమా! నాటకము లింకనేని విడిచి
వీథులన్ బిచ్చమెత్తి జీవింపరాదె
ఈ యడు కిరాయి కంట్రాక్టరేగినాడు
చిక్కితిమి మేము వీరలచేతులందు॥
సోదరనటులారా! మనము రహస్యాలోచనము గావింతము రండు - (నటులందరు లోనికి పోవుదురు)

ఆడియన్సులో ఒకడు:- ఏమండిసార్! పదివేలు బుకింగ్ అయింది వీళ్ళకి కిరాయిఇవ్వలేదంటే నమ్మతారా?

సూప:- ఇస్తానని - డబ్బుతేవడానికి వెళ్ళాడు. ఇంకారాలేదు.

(44 కానిస్టేబుల్ ప్రవేశం)

సూప:- కంట్రాక్టరేడీ.

కానిస్టేబుల్:- గాడిదకొడుకు -ఇదిగో వస్తానని గదిలో కెళ్ళి పెరటిదార్ని పారిపోయాడండీ.

సూప:- బుకింగులో ఎవరూ లేరా?

కాన్:- పిట్టకూడా లేదండీ.

సూప:- ఏమయ్యా! హాలూ......

రంగ:- సార్.

సూప:- ఏమయాడు కంట్రాక్టరు?

రంగస్వామి:- నాకేం తెలుసునండి. నా కూ హాలు కిరా యివ్వలేదండి. బంగారంలాటి పిక్చరు మధ్యనిలిపేసి వీళ్ళకి హాలిచ్చానండి.

ఆడియన్సు:- ముందు నాటకం కానివ్వండిసార్. కంట్రాక్టరు పారిపొయ్యాడు. ఏక్టర్లుకూడా ఉడాయిస్తారేమో చూడండి.

సూప:- ఫార్టీఫోర్. మన జవాన్లు ఎందున్నా రిక్కడ.

44 కాన్‌స్టే:- ఉన్నారండి. పదిమంది.

సూప:- అందర్నీ లాఠీలు పట్టుకొని రమ్మను.

44 కాన్:- (విజిల్ తీసి కొడతాడు) ఏక్టర్లు పారిపోకుండా గేటుదగ్గిర కాపలా పెడతానండి.

సూప:- వెళ్ళు. నలుగుర్ని లాఠీలతో తీసుకురా.

44 కాని:- చిత్తం. (నిష్క్రమణ)

సూప:- ఏయ్. ఏక్టర్లూ.

(అందరూ)

వచ్చుచున్నాము. వచ్చుచున్నాము.

(వేషాలు విప్పుకుంటూ ప్రవేశం)

సూప:- అరె! వేషాలు తీశేశారేం?

మూడవకృ:- అంతేనండి.

సూప:- నాటకం ప్రారంభిస్తారా లేదా?

మూడవ కృ:- గురువాజ్ఞ లేదండి.

సూప:- ఎవ డా గురువు?

మూడవ కృ:- కిరాయి.

సూప:- మంచిగా తెరెత్తుతారా! లాఠీఛార్జి చెయ్యమన్నారా?

మూడవ కృ:-

మమ్ముల జంపినన్ సరియె
మాకు కిరాయి నొసంగకుండ దా
నమ్మ! తెరె_త్తబోము గురు
నాజ్ఞను తప్పగబోము మాదు ర
క్తమ్మును ధారపోసెదము
గాక కిరాయిని వీడుకొందుమే
నమ్మకమున్న డబ్బొసగి
నాటకమున్ దిలకింపు డెల్లరున్

(నలుగురు జవాన్లు లాఠీలతో ప్రవేశం)

ఆడి:- వీళ్లెందుకండీ - మాకొదలండి యాక్టర్ల యీపులు యిమాసం మోత మోగిస్తాం.

సూప:- వద్దు-ప్రభుత్వమే ఆ పని చేస్తుంది. మీరు తగ్గండి. కానిస్టబుల్సు-రెడీ ఫర్ లాఠీఛార్జి ఎవర్ని ఆ యేక్టర్లని మొదట రెండుదెబ్బలు. ఏంరా ఏక్టరూ ప్రార్థన పాడతారా లాఠీ చార్జి చేయించమన్నారా.

మూడవ కృ:-ఫైర్ చేయించినా కిరాయి చేతిలో పడకుండ తెరయెత్తుట కల్ల. వేయేల.

వినుడీ మాదు ప్రతిజ్ఞ తత్పగత యు
ర్వీనాథ మా డబ్బులన్
గొనకుండన్ తెర యెత్తజాల మిక మీ
క్రోధంబు చాలించి వే
జనుడీ యింటికి నిద్ర దండగిక నీ
జన్మంబులో నాటకం
బునకున్ రాకుడు లెంపలేసుకొని పో
పోండి డింట్లకున్ బుద్ధిగా॥

సూప:- ఓరీ! యేమి ప్రేలితివిరా!

ఇంటికి పోనుమా మిము వ
ధింపక చూడు రివాల్వ రియ్యదే
తుంటరులార కాల్చెదను
ద్రోహులు సత్కళకున్ కళంకమున్
గొంటుతనాన గూర్చు పెను
కూళలు మిమ్ము వధింతు నిప్పుడే
బంటుతనంబు జూపక కృ
పన్ తెర యెత్తుడు మీకు మ్రొక్కెదన్॥

రెండవ కృ:- ఓయీ!

వట్టి భిభీషికల్ పలుకు
వైఖరి కా దిది సూపరెంట్లు వే
లుట్టిపడన్ జవాన్లు కద
నోత్సకులై యొక కోటి వచ్చినన్
దిట్టరులైన మా నటుల
ధీరత మాన్పగలారె! మాను మి
ప్పట్టున పౌరుషంబును రి
వాల్వరు కెవ్వడుజంకు నిచ్చటన్॥

సూప:- ఓరీ చూచేద రేలరా!

కం. చేయుడు లాఠీఛార్జిని
తీయుడు ప్రాణాలు పిరి ధీరత గంగన్
ద్రోయుడు మోదంబారగ
నీయాజ్ఞర్ చరితమంతోల హింసింపు డొగిన్॥
(పోలీసులు అర్థంకాక చూస్తు నించుంటారు)
ఏమిరా! అట్లు చూచెదరు?

44 కాన్:- ఏంచెయ్యమండి? మీరూ పద్యాలు చదివితే బోధపడక నించున్నామండి.

సూప:- ఓహో! ఈఘ్నాల్నువల్ల నేనూ చెడిపోతున్నాను ఆవేశంలో వచ్చేశాయ్ పద్యాలు లాఠీఛార్జి! కొట్టండి.
(కొట్టబోగా నటులు పారిపోతారు ఒక్క ధర్మరాజు కూచుంటాడు. వాణ్ణిమొత్తుతారు.)

ధర్మరాజు:- హా! దేవీ! హా తమ్ములారా! చచ్చితి చచ్చితి.

(నేలకూలును)

ద్రౌపది:- (దూరంనుండి గుండె బాదుకుంటూ)
హా నాథా-ప్రాణనాథా- ధర్మజా! మెంత ఘోర మెంతఘోరము!
అంత భారతరణములో సుంతయేని
చావనైతివి నే డిట్లు చచ్చినావె
కొసకు పోలీసులాఠీలకును మహాత్మ
దోమ యేన్గును చంపిన దోస మగుని.

సూప:- ఓసీ యేమంటివే నీమగడు వీడు యేనుగా? మేము దోమలమా?

ద్రౌపది:- కాకున్న యుధిష్ఠురుడన నీబోటి పోలీసాఫీసరనుకొంటివా? దురాత్మా వినుము.

అలుగుటయే యెరుంగని మ
హామహితాత్ము డజాతశత్రుడే
అలిగిననాడు సాగరము
లన్నియు నేకము గాకపోవు ఈ
తులువలు లక్షలైన తుల
తూగరు వీరికి సూపరెంట నా
పలుకుల విశ్వసింపుము వి
పన్నుల మమ్ములగావు మెల్లరన్॥

సూప:-ఛీ పలుగాకి- నోరు మూయుము.

ద్రౌపది:- హా నాథా. నీ ధర్మపత్ని నీ నీచుడిట్లు మాట్లాడుచుండ చూచి సహింతువా! హా కృష్ణా! నీవు నా డొక్కడవే నా మానసంరక్షణము చేసితివే. నేడు ముగ్గురు కృష్ణులు, నలుగురర్జునులు, ముగ్గురు భీమసేనులుండియు ఈ దురాత్ముని చేతులనుండి కాపాడ జాలరా?

సూప:- మీ అందరి నొక్క గ్రుద్దున సంహరింతును.

ద్రౌపది:- అయ్యో! ఇంక దిక్కెవ్వరు?

అంతటి ధర్మరాజు హతుడయ్యె
నిటన్ మరి భీమసేన నీ
యంత బలాధికుండు బిడియంబున దా
గగవచ్చునొక్క వే

అంతకు నింటి కంపుము దు
రాత్ముని వీనిని పార్థ యూరకే
చింతిలి దాగదేల అని సేయుము
ద్రుంపుము ఈ జవానులన్॥

అయ్యో! ఒక్కమైను పలుకవే! నా థా!
ప్రాణేశ్వరా నన్ననాథను జేసి పోవుదువా?

రెండవ ధర్మరాజు:- ఇంతీ ద్రౌపదీ! నేను రెండవ ధర్మరాజును జీవించియున్నాను కదా. నీవెట్లు నాధ వగుదువే ? ఒకడు గతించిన నేమి- నే నున్నాడనుక దా?

ఇద్దరు ధర్మరాజులును
ఇద్దరు కర్ణులు పార్థు లిద్దరున్
ఇద్దరు భీమసేనులును
ఇద్దరు కృష్ణులు ఇద్దరిద్దరన్
ముద్దుగ కూర్చినాడు మన
మూర్ఖుడు నీదగు ముద్దుదీర్పగా
ముద్దియ నేనులేని ముద
మున్ గను మూరక యేడ్వ నేటికిన్॥

ద్రౌపది:- హా! రెండవ ప్రాణేశ్వరా! నీవే శరణ్యాము. ఓనా నాథులారా! మీరెల్లరొక్కసారి నాకట్టెదుటికి కూర్యలో రండు.

(పక్కట్లంతా వస్తారు)

సూప:- ప్రార్థనకానిండు. ఓయ్ పోలీసులూ, మీకు పరాబ్రహ్మపాట వచ్చునా.

పోలీసులు:- ఓ వచ్చునండి.

సూప:- ప్రార్థన కానివ్వండి.

(ధర్మరాజు లేచి)

చచ్చిరి సోదరుల్ సుతులు
చచ్చిరి చచ్చిరి లాఠిచార్జిలో
వచ్చునకైన యాక్టరను
మానిసి లేకయె రంగభూమి, నీ
కచ్చకు మూలకారణాగు
గాడిద యెన్నడో చచ్చిపోయె నే
మిచ్చిననేమి లెండు తెర
యెత్తుడు పాడుడు ప్రార్థనం బికన్.

సూప:- అరె తెరయెవరో యెత్తేశారే!

ద్రౌపది:- ఇప్పుడా మొదటే యెత్తేశారండి.

సూప:- పాడండి పరాబ్రహ్మ-

(అందరూనిలబడి పోలీసులతోసహా)

పరాబ్రహ్మ-పరమేశ్వర-ప్రార్థనపాట)

తెర

ఈ నాటిక ఎందైనా ప్రదర్శింపవచ్చును. నా అనుమతి అవసరంలేదు. కాని కోరితే కొన్నిసలహాలు ప్రదర్శన పద్ధతిలో సూచిస్తాను.

—"కృష్ణశర్మ"



# శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి

## నిర్వాహకుడు : శ్రీ వి. సుబ్బారావు.



శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి - నటబృందం .



శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి - నటీవర్గము.



శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి - సావిత్రి నాటకములో యమునిగ
**శ్రీ వి. అబ్బాజీరావు.**





శ్రీ గోవిందరాయ సురభి నాట్యమండలి - బాలనాగమ్మ నాటకములో
**శ్రీ మూర్తి.**



శ్రీ గోవర్ధన నాట్యకళామండలి నటీనట బృందం – నిర్వాహకుడు : శ్రీ ఎ. చలపతిరావు.



: శ్రీ శారదా మనోవినోదినీసభ నిర్వాహకుడు : శ్రీ వి. అబ్బాజీరావు.



శ్రీ శారదా మనోవినోదినీసభ నిర్వాహకుడు
శ్రీ వి. అబ్బాజీరావు.



శ్రీ గణపతి నాట్యకళామండలి నిర్వాహకుడు: శ్రీ ఎ. రమణకుమార్.





శ్రీ వసుంధరా నాట్యమండలి నటీనట బృందము నిర్వాహకుడు: శ్రీ ఎ. శ. రామచంద్రరావు.

# నాటకరంగ స్మృతులు

స్వర్గీయ డా॥ గోవిందరాజుల సుబ్బారావు

"Life is but an empty dream,
A Poor player that struts and
Frets his hour on the stage
And then is heard no more
It is a tale told by an idiot
Full of sound and fury
Signifying Nothing"

*Shakespeare.*

ఈ జీవితమే ఓ విచిత్రమైన మహానాటకం. ఈ భూలోకమే దానికన్న మించిన విచిత్రమైన రంగస్థలం. "జలజాత ప్రభవాదులన్ మనములో చర్చించి భాషాపతిన్, పలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు" నే జగన్నాటక సూత్రధారి ఆధ్వర్యం క్రింద ఆడింపబడుచున్నది. అఖిలాండకోటి బ్రహ్మాండాలలో ఈలాంటి భూలోకాదులే అసంఖ్యాకములుగా ఉండికున్నవను నవీన శాస్త్రజ్ఞుల విశ్వాసాదులను పురస్కరించుకుంటే మన భావనాశక్తి చిన్నపుచ్చుకొని పుక్కిళ్లాది మునిగి ఉక్కిరి బిక్కిరి అయిపోతుంది. ఇటువంటి సందర్భంలో నాటోటి వాడిని "నీ నటనా జీవితంలో కొన్ని స్మరణలు పాఠకులకు సోది చెప్పవయ్యా అని" అడిగితే నేను కొంత వెనకడుగు వేసికొని, వెనక్కు తిరిగిచూచుకొని "ఈ అనుభవాదులన్నీ నావా అతగాడివా అని ప్రశ్నించుకొని, చివరి "కిదంతా అతడిలీలే" యని జ్ఞానం తెచ్చుకొని ఈ చిన్నవ్యాసాన్ని వ్రాయటానికి ఉపక్రమించాను.

పూర్వజన్మంలో ఏ తలితండ్రుల కడుపున పుట్టానో, ఏ సుఖదుఃఖాల ననుభవించానో, ఏ ఏ కర్మపరంపరలలో ప్రసగ్గిమగ్గానో, ఏ ఏ ఆటలాడానో, ఏ ఏ పాటలపాడానో, ఏవేవి చేశానో, ఏవేవి చెయ్యక బాకీపడ్డానో, చివరకు ప్రాణాలుపొయ్యే అవసరంలో ఏ అనుభవాలను జ్ఞప్తికి తెచ్చుకొన్నానో, ఏ ఏ తీరని కోరికలతోను తీరరాని కోరికలతోనూ "హరి" అన్నానో నాకు దైవం తెలియనీయకుండా ఘటించాడుగాని, ఈ జనంలో మాత్రం ఇంతవరకు జరిగిన నా జీవితచరిత్ర చాలావరకు జ్ఞాపకం వుంది. ఇటీవల మొన్న మొన్న జరిగినవి కొంచెం జ్ఞాపకం తక్కువ. గాని అతి బాల్యావస్థలో జరిగినవి మరీ జ్ఞాపకం ఎక్కువ అందులో నాది చిత్రాత్మక స్మృతి కాబట్టి కళ్ళకు కట్టినట్లుగా ఉంటుంది.

నేను చూచిన మొదటి నాటకం సారంగధర— అది బందరు బుట్టయ్యపేట హాలులో నా మూడవయేట సారంగధరుడు ఎర్ర చెమ్కీ దుస్తులతో తళుకు తూండినట్లు, చిత్రాంగి ఆకుపచ్చని బనారసు చీరెతో వడయాడి పలికినట్లు ఇప్పటికీ కళ్ళకు కట్టినట్లుంది నాకు. ఎందుకో చెప్పలేను. ఇప్పుడుకూడా ఎవరైనా చిత్రాంగి వేషంవేస్తె ఆకుపచ్చని చీరకడితేనే ఆహార్యం సరిగ్గా ఉంటుందని వేరుచీరకడితే అది కుంటుపడి పోతుందని నా ఉద్దేశం. చిన్ననాట మనలో పడిన అభిప్రాయ బీజాలను పెరగనియ్యకుండా అణిచిపెట్టడం మనతరంగాదని నా జీవిత అనుభవాలను బట్టి నాకు హృద్గతమైపోయింది.

విద్యార్థిదశలో (అంటే స్కూలుఫైనలు క్లాసువరకు) దాదాపు నేను నాట్యకళోపాసన మొదలు పెట్టలేదని చెప్పవచ్చు. కాని నాటకాలను చూడటమంటే అతి ఉత్సాహంగా ఉండేది. టిక్కెట్టు డబ్బు విషయమే వచ్చేది గట్టిచిక్కు. చదువు పాడిపోతుందని సదుద్దేశ్యంతో మా అమ్మగారు ఒక్క పేడకాసైనా యిచ్చేది కాదు, ఆ మేటుక్లాసు కొనుక్కుందామన్నా. మా నాయనమ్మగారి దగ్గర ఆ బేడ డబ్బులూ సంగ్రహించి అప్పుడప్పుడు నాటకాలకు పోతూండేవాణ్ణి. ఆమెకుపడ్డ ఋణం తీర్చుకోలేక పొయ్యాను, చచ్చి ఏ స్వర్గానవుందో. ఆ దినాల్లో మా తెనాలిలో ఒక కంపెనీ ఉండేది. దాని యజమానిని ఆయన స్త్రీ జనాన్ని ఆశ్రయించి కష్టపడి చాయంగల విన్నపములై మేటుక్లాసులోకి దూరిపోతూవుండేవాళ్ళం నేనూ నా స్నేహితులిద్దరూ, పుండరీకాక్షయ్య, నరసింహారావులు. మాకున్న ఉబలాటాన్ని అణగత్రొక్కినకొద్దీ, నాటకాలు, వాట్లో వేషధారణమీద, వెర్రి మరింత హెచ్చిపోయింది. అందులో ముఖ్యంగా నాకు.

నాటకాలే చూట్టానికి వీల్లేకుండ అదుపాజ్ఞలు ఉంటే వాట్లో వేషాలు వెయ్యడం నాకో ఎండమావులుగాను గగన కుసుమాల్లానూ ఉండేది. కాని దైవసహాయ్యం వుంటే ఏపని చెయ్యలేం— ఆ పరమేశ్వరుడి మీద నమ్మకం కుదరదుగాని !

ఆ కాలంలో తోట వెంకటచలంగారు దావులూరి శేషాచలంగారు *2nd Company* లో ప్రధాన పాత్రలు (నాయక నాయకి) ధరిస్తూవుండేవారు. వారివద్దనుంచి మొదట్లో నేను నేర్చినరాగం శహన. తర్వాత ఆనందభైరవి, తోడి, భూపాళ, నావేరి, మొదలైన రాగాలు పట్టుబడ్డాయి. ఇంకేం? నేను కూడా ఒక వేషానికి ఏనాటికైన పనికిరావచ్చునని ఆశాబీజం లోలోపల వృద్ధిపొందింది. మరి అవకాశం దొరకొద్దూ? అదీ దేవుడే చూపించాడు.

ఫిఫ్తు ఫారం క్లాసు చదువుకుంటూవున్నా. సాయంకాలం తెలుగు మేష్టరు పీరియడ్‌లో మా లెక్కల మాష్టరు గురుస్వామి అయ్యరుగారు వచ్చి నన్ను లేచి నిలబడమని "స్కూలు వదలిన వెంటనే నా గదిలోకి వచ్చి నన్ను చూచిపో" అని ఆజ్ఞాపించారు. గుండెలో రాయిపడ్డది. "తెలుగు మాష్టరు ఏదో రిపోర్టు చేసివుంటాడు—దినమూ నేను వారి పీరియడ్‌లో అల్లరి చేసే బుద్ధిమంతులలో అగ్రగణ్యుణ్ణి గనుక" అనుకొని, క్లాసు

వదలింతర్వాత బిక్కు బిక్కు మంటూ వారిదగ్గరకు పోయి నిలబడ్డాను. ఎందుకో నా అవస్థ చూచి చిరునవ్వు నామీద విసిరారు. కొంచెం ధైర్యం వచ్చింది. రాబొయ్యే స్కూలు *Anniversary day* కు నీవు ఓ ఇంగ్లీషు నాటకంలో వేషం వెయ్యాలి" అన్నాడు.

''నేనేమెరగనండి - నాకేం చేతకాదండీ. *Excuse me Sir*'' అన్నట్లు బాగా జ్ఞాపకం. కాని వేషమే నిర్ణయించేస్తే ఒక తడాఖా చూపించలేక పోతానా అన్నధైర్యం లోపలవుంది.

"నీచేతవుతుంది. ఏంభయంలే"దన్నాడు మళ్ళా గట్టిగా.

''అలా అయితే సరే''నన్నాను.

"నీకంటె కొంచెం పెద్దవాడు మరొకడు కావాలి. ఎవర్ని తీసుకోమని సలహా ఇస్తా''వన్నారు.

నా స్నేహితుడూ, తెలుగు మేష్టరును ఏడిపించటంలో నా సహాధ్యాయి అయిన దాపులూరి నరసింహారావు పేరు చెప్పాను.

సరే! నీవు వెళ్లు'' అన్నారు.

దీని ఫలితంగా *merchant of Venice* లో *launcelot scene* వేశాం ఇది మహాబాగావుందని అందరూ అనుకున్నారు. ఏది ఎలా అయినా 'బ్రతుకు జీవుడా! గండం తప్పింది' అనుకొన్నాను. మా అమ్మగారు ''ఇది మనకు వద్దు" అని అదుపు చెయ్యటానికి పిల్లేసుంటా పోయింది. మాష్టరుగారే నాచేత వేషం వేయించాడు గనుక. ఇంకేముంది నేనూ ఓ నటుణ్ణయిపోయాను.

తర్వాత సంవత్సరంలో *George Vth Coronation* సందర్భంలో ఓ పెద్ద *English* నాటకంలో *(Handy Andy) Andy* వేషం - హాస్యరస భూయిష్టం - వేశాను. కాని, అప్పటికింకా తెలుగు నాటకాల్లో వేలుపెట్టలేదు. ఎందుకంటే, ఆ కాలంలో పద్యాలు, కీర్తనలూ రాగస్వర తాళయుక్తంగా పాడలేకపోతే పట్టి వెళవాయి క్రింద కట్టిపేసేవారు. రాగాలు పాడగలిగినప్పటికీ....పదిహేను యిరవై రాగాలదాకా నా కంఠం అనేదండీ - వాలకుంది నా స్నేహితులకు ఈ రహస్యం తెలుసుకూడాను. కొంచెం పై స్థాయిలో అపస్వరంవల్ల, శాస్త్రీయతాళాన్ని లయను ధిక్కరించి స్వంత పోకడలు పోవటంవల్లా, నాకు తెలుగునాటక ప్రవేశం ''అందరాని పండు'' అయిపోయింది. దాని రోజులింకా రాలేదు. నేనెంత ఉత్సాహపడితే సేంలాభం?

కాని మా మేష్టరు *D. C.* కృష్ణయ్యగారు అప్పుడప్పుడు, - వారు ప్రస్తుతః సెల్లూరు వాస్తవ్యులు కనుక—'ప్రతాపరుద్రీయం' నాటకంలో పేరిగాడి సీనులు, పిచ్చివాడి సీనులు, మాలో కొంత మందికి శిక్షణయిచ్చి ఆడిస్తూ వుండేవారు. నా స్నేహితులు కీ. శే. పిల్లలమర్రి సుందరరామయ్యగారు పిచ్చివాడి వేషం, నరసింహారావుగారు సుల్తాను వేషం వేస్తూవుండేవారు. నాకు లోపం కంటుగా వుంటూవుండేది. నాక్కూడా ఒక వేషము ఎందుకు నిర్ణయించలేదని! అందుచేత ఆ చిన్ననాటినుంచే ప్రతాపరుద్రీయం నాటకంమీద నాకు అఖండమైన గౌరవం ఏర్పడింది.

తరువాత దేవుడు చాలా మేలుచేస్తే - నేను తెలుగు నాటకంలో మొదట్లో వేలుపెట్టింది మా *old boys association*లో. ఆ రోజుల్లో గయోపాఖ్యానానికి అఖండమైన పేరు ప్రఖ్యాతులు ఉండేవి. సుందరరామయ్యగారు కృష్ణపాత్ర, నా మిత్రుడు పెద్దిభొట్ల చలపతిరావుగారు అర్జునపాత్ర. (దానికని ఒక పెద్ద గాండీవం చేయించాడండీ తనపొడుగు సరిపొయ్యేది; నిజంగా అర్జునుడా అనిపించేవాడు.) పురుషులే స్త్రీ ప్రాతలనుకూడా ధరించి తీరవలసిన రోజులు గనుక మాలో ఎవరూ తెగించినవారు ఎక్కువమంది లేనందున ఆ రుక్మిణి, చిత్రలేఖ పాత్రలను వెంకటాద్రి అనే ఓ తెంపరి ధైర్యంచేసి వేసేవాడు. నేను ఇటు యాదవులవైపు సాత్యకి, అటు పాండవులవైపు భీముని పాత్ర ధరిస్తూ వుండేవాణ్ణి, కొంచెం కసరత్తు, కుస్తీచేసి. ఖట్ మస్తీమీద ఉండేవాణ్ణి గనుక. ''తొల్లి గురుకుమారులు'' అన్న పద్యం శహానరాగంలో సాగతీసి అనేవాన్ని. ''తొల్లి'' అని ఆపేవాణ్ని - భావాన్ని, రాగాన్ని మేళవించటానికి. అదివొక విశిష్టంగా అందరికీ తోచేది. దాణ్ణి. ''తొల్లికొట్టడం'' అని నన్ను వెక్కిరిస్తూ వుండేవారు. "గంధగజేంద్రతుల్య'' అనే పద్యం మహా భీకరంగా చదివేవాణ్ణి; సవసవగా *Shouts* కూడా తీస్తూవుండేవాణ్ణి. ఇంతెందుకండి; ''నిజకరవాల విక్షేపణ మాత్ర'' అన్న వచనాన్ని మహా అఖండంగా చెప్పేవాణ్ణి. ఒకసారి ఈ వచనానికి *once more* కొట్టేరుకూడా. వచనానికి *once more* ను గుంజ గలిగిన అఖండులలో మొదటి వాణ్ణి నేనేమో అని నా నమ్మకం.

అయ్యో! ఈ నాటక సందర్భంలోనే ఓ మరపురాని విషయాన్ని మనవి చేస్తాను. స్త్రీ పాత్ర ధరించే మా వెంకటాద్రి, చీర ధరించకముందు తనచుట్టు చెంగావి దోవతిని వెనక్కి బిగ తీసి కట్టుకునేవాడు. రుక్మిణి వేషం విప్పేసి, చిత్రరేఖ వేషం వెయ్యటానికి చీరె మార్చుకున్నప్పుడు అని నా అనుమానం, లోపలి దోవతి సడిలిపోయింది. గయుడి *scene* లో నిష్ఠీవనం పద్ధతటువాత కృష్ణభగవానుడు చేసే ప్రతిజ్ఞకు హడలిపోయి, చిత్రరేఖ నిలువునా నిలారుగా ''హా నాథా!'' అని మూర్ఛపోయింది. ఈ దెబ్బలో చుట్టుచెంగాయి దోవతి చీరె కిందుగా జీరులాడటం మొదలు పెట్టింది. లేచి నిలబడ్డ తరువాత అందరూ ఘొల్లుమన్నారు. తెరదించి, వేషగాణ్ని లోపలికి తెచ్చి మళ్ళా గట్టిగా గోచిపెట్టి చీర సరిదిద్ది. *stage* మీదికి తోయవలసి వచ్చింది.

ఇలా వ్రాయటం మొదలుపెడితే ఎన్నెన్నో జ్ఞాపకం వస్తున్నాయి. ''అదియే ఆ యమునా తరంగిణీ, త్రిలోకైక ప్రపూజ్యంబు'' అన్న కృష్ణుడి పద్యంలోని భావాలు స్ఫురణకు వస్తున్నవి. తర్వాత ఇప్పటికీ ఎంత దుఃఖసమయంలోనైనా నాకు నవ్వు తెప్పించే విషయం వొకటి వ్రాస్తాను. చెరువు సుబ్బయ్య అనే స్నేహితుడు గయుడిపాత్ర ధరించేవాడు.

*Creephair* లేని రోజులుగనుక పన్నెండు అణాలకే నాటకానికి కావలసిన అన్ని రంగులూ దొరికే రోజులుగనుక, ఆనల్ల రంగుతో మీసాలు దిద్దేడు. కొంచెం స్థూలకాయుడు కావటంలో చెమటపూరికే పడుతూవుండింది. సీను జరుగుతూండగా ప్రేక్షకులు ఎందుకో నిరుత్సాహ పరిచేరు. నేను *Prompt* చేస్తూన్నాను. వీడికి, మరింత చెమటపోయటం మొదలు పెట్టింది. అభయంవల్ల, సిగ్గువల్ల, చేతిగుడ్డతో మొహం తుడుచుకున్నాడు. ఈ హడావుడిలో ఒకవేపు మీసంపోయి అర్ధనారీశ్వరుడిలాగ తయారు అయినాడు. గందరగోళం చేశారు. వున్న జీవితం కూడా క్రుంగిపోయింది దాంతో వీడికి. తెరదించారు. "లోపలికి రారా ఆ మీసం పోయింది" అంటే వొక దెబ్బన రాదే? యేం చేసేది? వూరికే తిట్టడం మొదలుపెట్టాడు నన్ను. ఆడలేక మద్దెలవోటన్నట్లు చివరకు వచ్చాడు, మీసం సరిదిద్దాను, తెర ఎత్తించి మళ్ళా రంగంమీదకి నెట్టాను, కాని వాడు నన్ను ఎందుకు తిట్టాడో నాకీదినంవరకు అర్థం కావటంలేదు. ఇతగాడు కీర్తిశేషుడైనాడు, చాలాకాలం క్రితం. అతని తిట్లే నాకు దీవెనలు. తిట్లు, తిట్లుగా వుండేవికావు ఆ రోజుల్లో, మైమరచి అవ్యక్తమైన స్నేహపాశాల్లో ఉండేవాళ్ళం మేమందరము. ఆ రోజులు మళ్ళావస్తాయా, నేనెంత పేలుకొంటున్నా! ఇప్పుడు ఆ తిట్లు నన్నెవరైనా ధైర్యంచేసి తిట్టగలరా? కొన్నాళ్ళు గడిచిన తరువాత, మాకు కొంచెం పేరు ప్రతిష్ఠలు వచ్చిం తరువాత మా *Old boys association anniversary* కి ధైర్యంచేసి బొబ్బిలి నాటకం ఆడటానికి సమకట్టేము. సుందర రామయ్య "పాపారాయుడు" నేను 'హైదరుజంగు' మా కుటుంబశాస్త్రి 'రంగారాయుడు'. కొన్ని *Rehearsals* కూడా అయినాయి. మాలోకొద్దిగా పార్టీలు వుండటంవల్ల ఎవరి దుర్బోధవల్లో తాను పాపారాయుడు వేషం వెయ్యదలచలేదని, బిగిసి ఏకుమేకులయి కూర్చున్నాడు మా సుందరరామయ్య. ఏం చేస్తాం? నాటకం ఆడితీరాలి. లేకపోతే మా సంఘం సంపాదించుకున్న పేరు ప్రతిష్ఠలు మంటకలిసిపోతవి, నాకొక యుక్తి తోచింది. నేనే పాపారాయుడి వేషం వేస్తానని ధైర్యంచెప్పి, రెండు రోజులలో *Portion* అంతా చదివి ఆ పద్యాలు నాసొంత ధోరణులలో *practice* చేశాను. 'వాడు వెయ్యకపోతే, నేను వున్నానురా అని' నిలబడ్డాను. రిహార్సల్స్‌కి హాజరు కావటం మొదలుపెట్టా. "మా సుబ్బారావు, ఏదో విధాన మాయమంత్రమైనా చేసి ఈ వేషాన్ని నిర్వహిస్తాడురా" అని అనుకున్నారు నాస్నేహితులు. ఎక్కడైనా కొంచెం అపస్వరం పోయినా, ఆఖరికి కట్టుకొయ్యకి లాక్కొస్తాడు అని అనుకున్నారు. వెయ్యటానికి బిర్రబిగసిన మా సుందరరాముడు *Rehearsals* కి వస్తూండేవాడు "నేను లేకుండా వీళ్లు ఎలా నిర్వహిస్తారో గమనిద్దా"మని నాలుగు రోజులు చూశాడు. నేను వేషం పట్టువలగా వేసి తన *Chance* పోగొట్టేస్తానని లోపల దక్కుపడ్డాడు. హటాత్తుగా నాదగ్గరకు వచ్చి "ఒరే సుబ్బారావ్ - నేనే వేస్తానులేరా పాపారాయుడు, నీ కెందుకురా! ఈ బాధ" అన్నాడు మానవుడు. "సరేలేరా! నువ్వేవెయ్యి. నీకని మొదట మేము నిర్ణ

యించిందని" హర్షంతో గాఢంగా కౌగలించుకున్నాను. ప్పుఇటికీ మరుపురాదు, ఈ విషయం. ఆనాటి ఆలింగన సౌఖ్యం, మైమరుపు, అవ్యక్తత, ఆ గాఢమైన ప్రేమపాశం ఈ దినం వరకూ వుండి నాకు పునర్జీవనాన్ని కలుగజేస్తూ వుంటాయి.

నేను, బొబ్బిలిలో హైదరుజంగు పాత్రవేస్తూ వుండేవాడిని మొదట్లో. తరువాత కొంత కాలానికి దీన్ని నాదగ్గరనుంచి మా చలపతిరావు కొట్టేశాడు. ఎందుకో మొదటినుంచి ఈబొబ్బిలిలంటే వొట్టి అరుపులూ, బొబ్బరింతల నాటకంఅనీ, ఇంతకన్నాదాంట్లో ఏమీలేదు అనీ అనిపిస్తూవుండేది. కాని మావాళ్లు దీనికి గొప్ప పేరుతెచ్చారు. తాము తెచ్చుకున్నారు. అదేమి ఖర్మమోగాని నేను వేద్దామని ఉత్సాహపడి వేషం వొకటి తీరావచ్చేసరికి, వేసేది యింకొకటిగా పరిణమిస్తూ వుండేది మొదటినుంచి మా చలపతిరావు హైదరుజంగు వెయ్యటం మొదలు పెట్టిన తరువాత నేను బొబ్బిలిలో వేషం వేయుటం మానేశాను. కాని తరువాత కొంతకాలానికి తెస్తు చేతికి తెచ్చుకున్న రాజుకథలా అయింది నా పని. బుస్సీవేషం నాకు సంక్రమించింది. ఏమైందంటే- మా రామవిలాస్ సభ ఒక సంవత్సరం తోట్లవల్లూరులో మా నాటకాల భాగవతం కట్టడానికి పోయింది, ఏవో ఉత్సవాల సందర్భంలో ఆ రోజున బొబ్బిలి నాటకం.

బుస్సీపాత్రకు తయ్యారు అయిన మా బాబూరావు, 'ఎగవేశాడు' ఎందువల్లనో. మా భాగోతుల రాజగోపాలం, ప్రొప్రయిటరు గనుక వూరికే తహతహపడుతూ కూర్చున్నాడు. నేను నిద్రపోతున్నాను, నాటకాల బడలికవల్ల. మెళకువ వచ్చింది. "ఏమిటయ్యా హడావుడి" అన్నాను. బుస్సీవేషానికి మనిషి లేడు, ఏమిటి చెయ్యడం అన్నాడు. వెర్రివ బుస్సీవేషం వెయ్యటానికి మనుష్యులు తక్కువ అవుతారా, నేను వేస్తానులే పొమ్మన్నాను. వెంటనే రాజాగారి దగ్గరకు పోయి *Cross-belts* మొదలైనవి సేకరించారు. *portion* కొద్దిగా చూశాను. *prompter* కి కొంచెం హుషారు చెప్పాను. వేషం వేశాను ఆ దినం చాలాబాగా చేసేనట. అప్పటినుంచి ఈ వేషం నన్ను వెన్నాడుకుంటూ వస్తూనే వుంది. ఈ నాటకం అంటే నాకు అంత ఇష్టంలేక పోయినప్పటికీ. ఖర్మ అంటే ఇలాగే వుంటుంది అనుకోండి. మనం దాన్ని బాగా అర్థం చేసుకోవటం లేదు గాని.

ఏముంది...ఇలా సాత్యకి, భీముడు, హైదరుజంగు పాత్రలతో నాకు తెలుగు నాటక ప్రపంచములో కొంచెం సుస్థిరమైన ప్రవేశమే కలిగింది అని చెప్పవచ్చు. తరువాత నేను మద్రాసులో డాక్టరు చదువుటకు వొచ్చేశాను. *Old Boys Association* నాటకాలకు వెళ్ళి నా వేషాలను అప్పుడప్పుడూ వేస్తూవుండేవాణ్ని, ఇలా కొంతకాలం జరిగిపోయింది. కొంతకాలం క్రింద ఈ వూరిలో *Northern Circars progressive Union alias* పకోడి *Union* అని వొకటి వుండేది. ప్రతి సంవత్సరం పట్టభద్రులైన ఆంధ్రవిద్యార్థులకు వొక చిన్న '*At home*' ఇస్తూ వుండేది

*Convocation* రోజున. పేరుకు చాలామందివున్నా చివరకు ఖర్చు యావత్తూ విశ్వదాత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు భరిస్తూ వుండేవారు. కంఠాభరణ నాటకం *publish* అయిన సంవత్సరమే దాంటో 'సుబ్బిశెట్టి' *scene* ఇక్కడ ప్రదర్శించాం. డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు సుందరిపాత్ర ధరించారు. కొల్లూరి సత్యనారాయణగారు కృష్ణారావు పాత్ర ధరించారు. ఆ *scene* అఖండ రసవత్తరంగా వుంది ఆ దినం. ఇప్పటికీ నా స్నేహితులు దీన్ని జ్ఞాపికి తెస్తూవుంటారు. మరో సంవత్సరం కన్యాశుల్కం నాటకం ఆడాము. దానికి ఆధ్వర్యం వహించింది, కే. శే. కె. తాతాచారిగారు. నేను చూచినంతవరకు వారే ఈ గిరీశం పాత్రకు అన్ని విధాల తగిపోయిన వారని ఇప్పటి నా అభిప్రాయం. కాని ఏవిధమైన వేషధారణకు ఆయన వొప్పేరు కారు. నాచేతిలోంచి తప్పించుకొని పొయ్యారు, నేనేంత వేడుకొన్నా. ఇ. వి. ఆర్. సుబ్బారావుగారు, గిరీశం. సత్యనారాయణగారు రామప్పపంతులు, నారాయణమూర్తిగారు మధురవాణి, కీ॥ శే॥ డాక్టరు రాఘవరావుగారు, బుచ్చమ్మ, మీనాక్షి పాత్రలు ధరించేరు. నేను సూత్రధారుడు, పౌటిగ్రాపు పంతులు బంట్రోతు, కరటకశాస్త్రి, పోలిశెట్టి, అసిరిగాడు, మొత్తం అయిదు పాత్రలు ధరించేను. నాటకం అఖండమైన రసవంతంగా ఆడాము. బందరు జాతీయ కళాశాలకు దీనికి వచ్చిన డబ్బు పంపించాము మూడో సంవత్సరం - అంటే నా *Final Year* పరీక్ష తర్వాత ప్రతాపరుద్రీయం ఆడాము. దీనికని కోపెల్ల హనుమంతరావుగారు, బందరునుంచి వచ్చి ఈ వూళ్ళోనే మకాం వేశారు. నాటకం పెద్దదికనుక పిల్లాంవారిగా ఆయా వేషాలను సర్దపలసి వచ్చింది నేను పేరిగాడి పాత్రను చదివేశాను. ఎందుకంటే మొదటినుంచి ఆ వేషం అంటే చాలా మోహంకనుక. కాని చూడండి దైవఘటన ఎలా పరిణమించిందో! యుగంధరిపాత్ర చదివిన స్నేహితుడికి నేను కొన్ని కొన్ని సలహాలు ఇవ్వటం మొదలు పెట్టాను. కొన్ని *Rehearsals* అయ్యేటప్పటికి అతిగాడికి విసుగుపుట్టి యుగంధరుడి వేషం నా మొహాన కొట్టాడు పుట్టెడు విసుగుతో. అలా సంక్రమించింది ఈ యుగంధర పాత్ర నాకు. ఈ రహస్యం ఎవరికీ తెలియదు. మాలో విద్యానాథుడి పాత్ర ధరిస్తున్న ఆచార్లగారు (నెల్లూరు వాస్తవ్యులు) నాతో ఏం చెప్పేరంటే ''ఓరేయి సుబ్బారావ్! నువ్వు నాటకాన్ని నీ స్వంత విధంగా కత్తిరించి, అందరిని శిక్షణలో పెట్టావ్: గ్రంధకర్త వెంకటరాయశాస్త్రిగారు, ఈ వూళ్ళోనే వున్నారు. వారిని పిలిచామా అన్నీ తప్పులే పడతారు. నాటకం రోజుకుతప్ప ఈ లోపుగా వారిని మనం దర్శించవద్దు అని ఒక రహస్య సలహా చెప్పాడు. అదేప్రకారంగా చేశాను. నాటకం విక్టోరియా హాలులో వేశాం. పేరిగాడు మా డాక్టరు చాగంటి సూర్యనారాయణ వేశాడు. తదితర పాత్రలు ఇతర స్నేహితులు వేశారు: వారి పేర్లన్నీ జ్ఞాపకం రావటం లేదు, క్షమించాలి. నాటకానికి రెండువేల రూపాయలు వచ్చింది. అయిదువందల రూపాయల టిక్కెట్లు వాపసు చేశాము. అనన్యసామాన్యమైన రసవంతంగా నాటకం ఆడాము గ్రంధకర్తగారి సమక్షంలో ''ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్'' అని నేను రంగం మీదకి గంతువేసేటప్పటికి పిల్లలంతా ఘొల్లుమన్నారు, నా ఆకారంచూసి. తరువాత ''నా రాజును', నేను చేజిక్కించుకుని వొరంగల్ సింహాసనం మీద మళ్ళా పట్టాభిషిక్తుణ్ణి చేసే సందర్భంలో, ఆనందం పట్టజాలక వెర్రిగాలేచి *U. L. Sastry* గారు, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి భుజం మీద ఖద్దరు శాలువను ధ్రువన తీసికొని *stage* మీదకి ఎక్కి నా భుజంమీద కప్పారు ఆసాంతాన నేను గ్రంధకర్తగారి వద్దకు వచ్చి పాదాభివందనం చేశాను. మనసారా దీవించాడు ఆ మహానుభావుడు, ఆ కళా ప్రపూర్ణుడు. ''ఇందుకురా అబ్బాయీ! నన్ను పిలవకుండానే, నా సలహా లేకుండానే నాటకం ఆడావ్? ఎంత సాహసివిరా? నా నాటకానికి సార్థకత తెచ్చావ్ . ఈ నాటకాన్ని నీ ఇష్టం వచ్చినట్లు ఆడుకోవలసింది- నాకు చాలా సంతోషం అయింది'' అని నన్ను దీవించి నట్లు బాగా జ్ఞాపకం. ఆ మహా పండితుని దీవనాప్రభావమే నాకింత భిక్షపెట్టింది.

తరువాత నాలుగైదు రోజులన్నా వ్యవధి లేకుండా, నా స్నేహితుడు పాతూరి సూర్యనారాయణ తెనాలినుండి ఏకాఎకివచ్చి, రాత్రి పన్నెండు గంటలవేళ (అప్పుడు నేను కన్ను ఆస్పత్రిలో *House-surgeon* గా వున్న రోజులు) నేను గాఢనిద్రలో వుండగా వచ్చి లేవకొట్టి ''ఏమిటి ఇలా పడుకున్నారు- కొంపలంటుకుపోతే! మీ ప్రతాపరుద్రీయ నాటకం అఖండంగా వుందని పేపర్లలో అంతా మోగిపోతున్నది: మన రామవిలాస్ సభ కూడా ఈ నాటకాన్ని వెంటనే ఆడితీరాలి'' అంటూ ఏవేవో ఆవేశాలతో, ఆనందాలతో నాతో మాట్లాడాడు. ఆ రోజున వళ్ళు ఘల్లుమంటూ లేచిన విషయం ఈ దినంవరకూ జ్ఞాపకం వుంది. మరి వెంటనే మా సభవారు ప్రారంభించి ఏడురోజుల్లో ఇంత మహత్తరమైన నాటకాన్ని ఆడటానికి తయారు అయినారు. ముందు తెనాలిలో మా హాల్లో వేశాము. తరువాత మైలవరం హాల్లో వేశాము. అంతే తరువాత ఆంధ్రదేశంలో వున్న పట్టణాలన్నింటిలోను ఆడాం. మా కెంతో పేరు ప్రతిష్టలను తెచ్చింది, తెచ్చుకున్నది. మా చలపతిరావు ప్రతాపరుద్ర, పేరిగాడిని పాత్రలకు అనన్య సామాన్యమైన పేరు తెచ్చుకున్నాడు. మా సభకు ఒక వున్నతస్థితి వచ్చింది. ఈ నాటకం అంటే ఇతర నాటకాలు ఏమంత తీసిపొయ్యేవని నా అభిప్రాయం కాదు. మా వెంకటరామయ్య, స్థానం నరసింహారావు, రోషనార నాటకానికి గొప్ప పేరుతెచ్చారు. ఆంధ్రదేశ మంతటా దాదిపారేశారు ఈ నాటకాన్ని. అసహాయ, బొబ్బిలి, నరకాసుర, షోరాబ్ -రుస్తుం మొదలైన నాటకాల్ని ఎన్నింటినో ఆడుతూ వుండేవారు మా సభ్యులు. వొక తారాజువ్వలాగ వెలిగిపోయింది. మా రామవిలాస సభ. గొప్ప గొప్ప ఆదర్శాలతోను, ఆశయాలతోను ప్రారంభించాము. సంగీతం కంటె వచనానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తూ వుండేవాళ్ళం. సంస్కృత నాటకాల ఆంధ్రీకరణలను ఎక్కువగా ప్రచారంలోకి తేవాలని

పున్నత ఆశయాలను పెట్టుకున్నాము. రత్నావళి, మృచ్ఛకటిక, ముద్రారాక్షసం, వేణీసంహారం, మా దృక్పథంలో ఎప్పుడూ వుంటూవుండేవి. కాని మా సభ స్వల్పకాలమే జీవించ గలిగినందువల్ల ఎన్నిటినో కొనసాగించుకోలేక పొయ్యాం. నేనూ మా చలపతిరావు మాత్రమే ఈ సభలో గౌరవ సభ్యులం. మిగతా వారందరికి కూడా నెలకు దాదాపు పన్నెండు వందల రూపాయల జీతాలు ఇస్తూవుండేవాడు రాజగోపాలంగాడు. ఏవూరు పోయినా నాకున్న బంధువర్గం, నాటకాలకని నన్ను చుట్టుముట్టేది కనుక, నన్నుగురించి కంపెనీ, ఫ్రీ టిక్కట్టు క్రింద వ్యయపెట్టింది దాదాపు 18 వందల రూపాయలు అని నా జ్ఞాపకం. మా పెద్దతలలతో అభిప్రాయ భేదాలవల్ల రామవిలాస సభ బాల్య దశలోనే అంతరించిపోయింది. కాని ఒకసంగతి మరిచాను. కన్యాశుల్క నాటకాన్ని కూడా మేము చాలా విజయవంతంగా ఆడి దేశదేశాలు తిప్పాం. మన్నార్ని దేశదేశాలు తిప్పింది కూడాను. స్థానం నరసింహారావు అభినయ కౌశలానికి ఈ నాటకం మధురవాణి పాత్ర ఎంతో వన్నె తెచ్చి, హద్దుపద్దులను నేర్పి విస్తరింపజేసింది. నా కర్మ విషయం ఇంతకుముందే మనవి చేశాను. మొదట్లో నేను రామప్పపంతులు వేషమో, మరేదో వేద్దామనుకొన్నాను. కాని అప్పటికే నాకు యుగంధర పాత్రలో బాగా పేరున్నందువల్ల (కన్యాశుల్క నాటకానికి చివరకు నాయకుడెవరని మనం తేల్చుకున్నా) గిరీశంపాత్ర కుంటుపడి పోతే నాటకమే చెడిపోతుందనే అభిప్రాయాదులవల్ల నేనే గిరీశం పాత్రను వేయవలసి వచ్చింది. వెయ్యటం మొదలు పెట్టినతరువాత దాన్ని ఆరాధించటం మొదలు పెట్టానను కోండి - అది నేనేసంగతి రాత్రిపన్నెండు నుంచి తెల్లవారు ఝాము నాలుగున్నర వరకు ఆడినట్లు జ్ఞాపకం మా మొదటి నాటకాన్ని. వెయ్యిరూపాయల కెప్పుడూ తక్కువరాని మా సభ నాటకాలకు, ఈ నాటకం *exception* గా పరిణమించి, 89-0-0 రూ. వచ్చినట్టు జ్ఞాపకం మొదటిసారి. కొంత కాలానికి గాని (ఈ నాటకంతో మేము రాటుతేలాం తరువాత) ఏడు, ఎనిమిది వందలదాకా మేము తీయలేక పొయ్యాం. మా మాష్టర్ అంజి, మా ముద్దుల అంజి, అసామాన్య ప్రతిభావంతంగా నటించేవాడు రామప్పపంతులు పాత్ర. "వెండిగిన్నెకోసం వచ్చాను" అని మధురవాణి అంటే "తీసుకెళ్లు" అని వాడనే స్థాయిల మేళవింపు ఈ దినంవరకు నా చెవిలో ధ్వనిస్తూ వుంటుంది. వాడే బ్రతికివుంటే వాడి విశాల నేత్రాలతో, వాడి అభినయకౌశలంతో చలన చిత్రాలలో పొడిచేసి వుండేవాడు. మా సభ లాగానే వాడూ అకాలమరణం వాతపడ్డాడు.

ఒక్కసంగతి - ఎందుకోగాని ఎప్పుడూ జ్ఞాపకం వస్తూ వుంటుంది - మా సభ సంచారం బయలుదేరి అప్పటికి మూడు నెలలు అయింది. చివరకు అమలాపురం చేరుకుంది. పిల్లా, పీకా కలిగినవాళ్లు కనుక మా కుటుంబశాస్త్రి, పులిపాటి, దెందుకూరి, కాకుమాను మొదలైన సభ్యులు "ఎప్పుడు ఇంటికి పోదామా, ఎప్పుడు పెళ్ళాంబిడ్డలను చూద్దామా" అన్న స్థితిలోకి వచ్చారు. ప్రతాపరుద్రీయ నాటకం ప్రకటన చేశారు కనుక నేను తెనాలినుంచి పోవాల్సి వచ్చింది, పోయాను. పొయ్యేటప్పటికి, వీళ్ళందరూ నన్ను చుట్టుముట్టి "నాన్నా! నాన్నా! ఎప్పటికి మాకు విముక్తి? తిండికి చస్తున్నాం" అంటూ వాళ్ళ వాళ్ళ బాధ నాకు చెప్పారు. "పదండిరా. కాఫీ హోటలుకి తీసుకెళతా"నని ఒక బ్రాహ్మణ కాఫీ హోటలుకి తీసుకెళ్ళాను. ఆరోజులలో కాఫీమీద అంత మోజు వుండేది కాదు మాకు. ఎంతసేపటికి *Solids* లోపలికి పోవాలని అనిపిస్తూ వుండేది. అందరికి ఇడ్డెన్లు ఆర్డరు చేశాను. గుప్పున తూర్పు ఆవకాయ సంగతి జ్ఞాపకం వచ్చింది. "అయ్యా. మీ అమలాపురం ఆవకాయ నంజుటానికి వడ్డించయ్యా" అని బతిమాలుకున్నాను అంతే ప్లేట్లమీద ప్లేట్లు ఎగిరిపొయ్యాయి. నేనున్న రెండు రోజుల్లోను ఆ ఆవకాయ జాడీ ఖాళీచేశారు మావాళ్లు. మొన్నమొన్న నేను అమలాపురం వెళ్ళినప్పుడు, ఆ కాఫీ హోటలు ఇంకావుందేమోనని ఆశతో పరిశీలించి చూశాను. కాని అది మాయమయి పోయిందండీ! ఆ బజారు లేదు! పూరికే మారిపోతూ వుంటుందండీ ఈ లోకం ఎందుకోగాని,

ఆనాటి రామవిలాస సభ అంతరించింది. కాని ఆ పేరుతోనే కొద్దిమంది నటుల యాజమాన్యం క్రింద, ఇంకా కొంతవరకు జీవించివున్నదనే చెప్పవచ్చు. నాబోటి నటులెంతమందో చనిపోయినారు. చాలామంది అకాలమరణం వాతపడ్డారుకూడా. ఈ సంగతి తలచుకున్నప్పుడల్లా గుండె ఝల్లుమంటుంది. కళ్లు నీరు కమ్ముతాయి. ఒంటరినైపోయి బిక్కు బిక్కు మంటూ ఓ చీకటిలో జీవయాత్ర సాగిస్తున్నానా అనిపిస్తూ ఉంటుంది. అనురాగబంధాలు, వాటివల్ల మనలో కలిగే మార్పులు ఇదేవిధంగా వుంటాయి కాబోలు. ఒకసారి ప్రతాపరుద్రీయ నాటకం ఆడుతున్నాము. మాలో నృత్యానికి అఖండమైనపేరు సంపాదించిన మా బసవలింగం స్ఫోటకంవల్ల ఆదినం చనిపోయినాడు. హాలు ముందుగా శవాన్ని తీసుకువెళుతున్నారని అప్పుడే తెలిసింది. మా విషాదాన్ని వెలిపుచ్చుతూ నాటకాన్ని కొంతకాలం ఆపు చేశాము. పొయ్యేవారిలా పోతూవుంటే ఆడేవారు మాలాగా ఆడుతూవుండటం ఈ జగన్నాటక ధర్మం కాబోలు అనిపిస్తూ వుంటుంది.

మృచ్ఛకటిక నాటకంలో చారుదత్తుడి వేషం వెయ్యడానికి చాలా సార్లు ప్రయత్నించాను. శకారుడు వేద్దామా అనికూడా వుంటూ వుండేది. ఒకవేషంవేస్తూ, మరొకదానిమీదకి రుచిపోవడం నాకు తీరరాని ఒక వెర్రికోరికా అనిపిస్తూవుంటుంది. ముద్రారాక్షసంలో, వేషానికి నా స్థౌల్యంవల్ల నేను తగకపోయినా, చాణక్యుడి వేషంమీదకి ఆవేశం పరుగెత్తుతూ వుండేది. నిజంగా రాక్షసుడి వేషానికి తగుతానని నాకుతెలుసు! ఈ నాటకము మేమెప్పుడూ ఆడలేదు. ఇలా తీరనికోరికలు నా నటనాజీవితంలో ఎన్నో వున్నాయి. ఈలాంటివిలా పొందుపడి వుంటూవుంటేనే కాని జీవితం జీవితంకాదేమోనని అనిపిస్తూ వుంటుంది.

కొన్ని కొన్ని ప్రాంతాలలో నేను డాక్టరునని చాలామందికి తెలియదు. నాకు తగిలింపబడ్డ ఆ శబ్దానికి ఏమీ అర్థంలేదను కుంటూవుంటారు. కాని నటనావృత్తి నాకు ఓ *Hoby* కంటె ఎక్కుడుగా నాతల పైకెక్కి నన్ను ఆడించలేదు. తరువాత నా అనుభవాలలో పెద్ద కాళీలున్నాయని చెప్పవచ్చు. అప్పుడప్పుడు నేను రంగస్థలంమీద కనబడుతూ వున్నప్పటికి, కొంతకాలం అయ్యేసరికి నేను సినిమానటుడిగాకూడా పరిణమించాను. కారణం నేను మొదటిసారి సారధివారి 'మాలపిల్ల'లో సుందర రామశాస్త్రి వేషం వెయ్యటం. చాలామంది నాకు మొదట్లో భయం పెట్టారు, *Stage* నటనకూ, సినిమా నటనకు, హస్తిమ

౬

శకాంతర భేదంవుందని. నేనుకూడ కొంత జంకుతోనే ప్రవేశించాను. కాని మొదట్లోనే ప్రాణప్రదమైనటువంటి నా మీసకట్టు ఈ వేషానికని తియ్యవలసివచ్చింది. నాకది అశుభంగా తోచింది కొన్నిరోజులు విపరీతంగా తటపటాయించాను. చివరకు నా తల్లిగారి అనుమతిని తీసుకొని ఆమెకు ప్రదక్షిణం చేసిసాగిలపడి కీ॥ శే॥ రా మ బ్ర హ్మ ము గా రి కి *Telegram* ఇచ్చాను ఈ విధంగా :—

"*Accepted-bless me God*" అంటూ.

బుర్రదెక్కించి, ఆ మీసాలు గొరగకముందు మా *B.N.R.* వో కొబ్బరికాయ నా తలమీదగా తిప్పి దృష్టితీసి పారేశాడు. తరువాత నన్ను గాడెక్కి పారేయించాను. లేచి దొంగవాడిలాం అద్దముందుకు పోయి నా మొహం చూసుకొన్నాను. వెంటనే ఏడుపు వచ్చేసింది. తరువాత సిగ్గువచ్చింది. తరువాత రెండూ అటూ ఇటూ పెనుగులాడినాయి. 'నాతో నాకొక భంగినవ్వుకు దురతంబైన, చింతాహతిన్' అన్న ఆ హరిశ్చంద్రుడి పద్యం జ్ఞాపకం వొచ్చింది. ఎందువల్లనోగాని ఈ వేషం చాలా బాగుందని ప్రేక్షకలోకం భావించారు. గోడమీద పిల్లివాటంగావున్న నేను, దీంతో సినిమారంగస్థలం మీద కొంచెం కాలూనుకొని నిలబడ్డాను. మాలపిల్ల ప్రీవ్యూ రోజుననే నాకు పెద్ద వ్యాధి ప్రారంభించింది; అపరిమితమైన బాధలతో. అదే *Lung Abcess*' గా పరిణమించింది. సారథి *Films*, వారి మేడమీద నా ఆశ్రయమిచ్చారు. మహానుభావుడు డాక్టరు కేశవపాయిగారి హస్తవాసివల్ల, పెన్సిలియన్ లేని ఆ రోజుల్లో మృత్యువు నోటనుండి బయటపడ్డాను మూడు నెలలకి. ఈ వ్యాధికి కారణంగ నేను బాగా పరిశీలించి చూస్తే ఫిల్ములో నేడు నాయిల్లు తగలపడి పొయ్యేటప్పుడు అభినయించిన దృశ్యాలు. పెట్రోలు, కిరసన్ పోసి ఆ కృత్రిమ గృహాన్ని తగలపెట్టారు. నా వీపుకు ఆ సెగ బాగా తగిలింది. ఆ *Shot retake* కూడా చేయటంవల్ల ఊపిరితిత్తిలో ఒక భాగానికి గాఢంగా సెగ తగిలి కుళ్ళిపోయి వుంటుంది. అదీ ఇంత వ్యాధికి కారణం. సినిమారంగ ప్రవేశం నా దగ్గరనుంచి పెద్ద రుసుములు లాక్కుంది మొదటి రోజుల్లో నేను చనిపోయినానని కూడా ఏదో పేపర్లో పడ్డదట రామబ్రహ్మంగారికి ఎవరో టెలిఫోన్ చేశారు. సుబ్బారావు బ్రతికివున్నాడా' అని. *What? He is very much alive* – మా మేడమీదనే వున్నాడు' అని జవాబిచ్చానని వారు నాతో వెంటనే చెప్పారు. ఇదివో నీలి వార్తగా పరిణమించి నాకు పునర్జీవనాన్ని ఇచ్చింది. నా జీవిత చరిత్రలో నేను గడిచిన గండాలలో ఇది రెండవది. నాకేదైనా పుణ్యలేశముంటే గడిచాను వీటిని లేక నామీద ఆధారపడ్డ కుటుంబం యొక్క అదృష్టమో, తపఃఫలమో నేను చెప్పలేకుండా, వున్నాను. చావు ఎలా వుంటుందో నాకు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదనుకుంటూ వుంటాను. దాని అకార భీకరాలను చావు సంపూర్ణంచూచి, అనుభవించివున్నాను గనుక

చాలామంది నా సుందరరామశాస్త్రి వేషం మహాబాగుందని ప్రశంశిస్తూ వుంటారు. నాబోటి స్థూలకాయు దెవ్వడైనా బుర్ర దెక్కించి, మీసాలు గొరిగించటానికి సిద్ధపడితే నాకన్నా బాగా నటించే వాడేమో అనిపిస్తూవుంటుంది. కారణమేమంటే, వేషభాషల దగ్గరనుంచి అన్నిటిలోను వాస్తవికత ఆరాధించి పూర్ణంగా ప్రత్యేకం చేసుకుంటేనేగాని సినిమానటన తన పేరును, అసలు, సార్థకం చేసుకోలేదు. ఇదే దాని కీలకం.

మరో విషయం, వూరికే జ్ఞాపకం వస్తూవున్నది చెప్తున్నకొద్దీ. 'షావుకారు'లో 'చెంగయ్య' వేషానికి మళ్ళీ నా జుట్టులో కొన్ని గట్టి మార్పులు చేయవలసి వచ్చింది. ఆ రోజున కొబ్బరికాయ దిగతుడుపు, మా 'గోఖలే' తీసివేశాడు. ఆసాంతానికి అద్దంలో చూసుకొన్నాను. ఈసారి కొంత దుఃఖమూ, అఖండమైన భయమూ నాలో వెంటనే కలిగినాయి. ఎందుకంటే నా మొహం నా తండ్రిగారి మొహంలాగ తయ్యారు అయింది. 'నాకు కూడా ముదిమి వొచ్చింది కాబోలు ఇహ జాగ్రత పడకపోతే వీలులేదు, అనిపించింది.

నా తండ్రిగారు స్ఫురణకు రావటంవల్ల వారిని అగౌరపరస్తున్నానా అనిపించి పట్టరాని దుఃఖం వచ్చింది.

నా జన్మలగ్నం తుల. ప్రస్తుతం సినిమా నటన ఆతక్కెటతో ఉంది. తగ్గు మొగ్గలకు నేను భాధ్యుణ్ణికాగు ఆ త్రాసు పట్టిన దైవంతప్ప.

నాటకాల్లో కూడా అప్పుడప్పుడు వేషం వేస్తూవుంటాను. దీంట్లో ఏవి బాగున్నవి అని నన్ను అప్పుడప్పుడు స్నేహితులు ప్రశ్నిస్తూ వుంటారు. నేను తేల్చి చెప్పటానికి ఎప్పుడు చేతకాపడం లేదు. నాపాత్రలను నేను వోపినంతవరకు ప్రత్యక్షం చేసుకొని ఆరాధిస్తాను. అంతే దాని ఫలితం ప్రేక్షక లోకానిది. వారికే ఈ విమర్శనలకు హక్కుగాని, నాకు లేదు అనిపిస్తూవుంటుంది. 'బాగున్నదంటె' పొంగిపోను. 'చెడిపోయిందంటే' క్రుంగిపోను. సుఖదుఃఖాల తారతమ్యాతల అమూకి చిక్కనియ్యకుండా, పిచి. చిన్ననాటినుండి యింతవరకు దురదృష్ట పరంపరతో పోరాడుతుంటూ వచ్చింది. నాజీవితాన్ని మొండిజీవిని గనుక నాస్వామికి ఆత్మార్పణం చేసికొని వేంకటదాసునైయాను. 'తొంద ముదిరింతే ఊసరివిల్లి' అన్న లోకోత్తర లోకోక్తిని, ఆ నోటనే కొంచెం విస్తరించే, నటుడు ముదిరితే నంబివాడు, రసికుడు మదిరితే రామభక్తుడూ' అనవచ్చునేమో, అనుభవజ్ఞులు మీరు కొంత పరకాయించి ఆలోచించండి. ఇరెండూ ఒక్క జీవిలోనే ముదిరితే ఏమవుతాడోకూడా మరీ బాగా ఆలోచించండి. వేమనయోగి అవుతాడేమో ! కొంతమంది నటుల జీవితాలు ఈ పంథాన నడిచిపోయినయి. తన జగన్నాటకాన్ని వెక్కిరిస్తున్నట్లు, నాటకంలో ఉపనాటకాలను మనం ఆడటంవల్ల చివరకు మనకు జ్ఞానాన్ని ప్రసాదించి కట్టుకొయ్యకు తెచ్చి తన దాసులను చేసుకొంటాడు. ఏంచేస్తాడుమరి !

ఈ రెండుకాక *Radio* లో కూడా పాల్గొంటూవుంటాను దీంట్లో 'నటిస్తున్నా' ననాలో మాటలతో "కృత్రిమునటన" చేస్తున్నా ననారోనేను తెల్చుకోకుండా వున్నాను. దీనిలో 'నటనే' చాలా కష్టతరమైనదని నాకు అర్థమైంది.

బాబూ ! జీవితమేమో గడచిపోతున్నది. ఎవడినిర్ణయం ఎన్నాళ్లో. ఎవరికీ తెలియదు. కాని మన జీవితంలోని ఘట్టాలని *'Once more'* చేస్తే బాగుంటుందని అందరం గట్టిగా కోరికపడతాము' దీనికి ఏమాత్రం వీలులేకుండా ఘటించాడు దైవం అసలీ విశ్వనిర్మాణంలోనే, ఎంత తన్నుకున్నా, ఆనాటి 'ఒరేయ్ చెలపాయ్, ఒరేయ్ సుందాయ్, ఓరేయ్ కుటుంబాయ్ ఓరేయ్- నరసింహమ్,' అన్న రోజులు మళ్లీవస్తాయ? రావండి బాబూ ! అయ్యో ఏనాటికీ రావు ! 'ఎందుకు ఉట్టివే వగవంట మా వేంకమ్మత్తలాగ ! !

# నాటకాలు - నాన్నగారూ, నేను

ధారా రామనాథ శాస్త్రి

ఇంకా చిన్నతనం. వచ్చీరాని రెక్కల్లాగా తెలిసీ తెలియని ఊహలు. సెకండ్ ఫారమ్ కాబోలు చదువుతున్నగుర్తు. చదువు పేరుతో బడికి తాకట్టు పెట్టిన లేతబ్రతుకు. ఎక్కడున్నా నాటకాలు సినిమాలు అంటె యావ పట్టుకునేది. వెళ్ళి తప్పకుండా చూడాలనే ఆశ ఓ వేపునా, తీరా నాటకానికని బయలుదేరితే అమ్మా నాన్నా అదిలిస్తారనే భయం ఓవేపునా పట్టుకు పీక్కుతినే రోజులు. ఓసారి మాఊళ్ళో నాటకం ఆడతారని తెలిసింది. ఆ రోజుల్లో నాటకాలు అంటే ఓ ఒంటెద్దుబండి, కొన్ని రంగుల కాగితాలు, డప్పులమోతలు. ఇవి మాత్రమే మాకర్థమయ్యేవి. నాటకానికి ఇంట్లోంచి ఎవరైనా బయలుదేరితే బాగుండును. వాళ్ళ కొంగుపుచ్చుకుని మనమూ వెళ్ళవచ్చు అనుకున్నాను. ఇంట్లోవాళ్ళందర్నీ కదిలించి చూశాను. మా మామ్మ తప్ప ఇంకెవ్వరూ నాటకానికి వెళ్ళేవాళ్ళు లేరని తేలింది. సరే, పొద్దున్నుంచీ మామ్మకు ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పి అప్పటికి నాకేమీ తెలీకపోయినా నాటకం చాలా బాగుంటుందని మామ్మకు చెప్పి మెల్లిగా ఆమెను మంచిచేసుకున్నాను. రాత్రి పదిగంటలయ్యేసరికి అప్పటిదాకా అమలులోఉన్న గ్యాస్‌లైట్ల వెలుగులు, చిరనెత్తి యానాదిపిల్లల నోళ్ళలోంచి వెలికివస్తున్న ఆకుచుట్టల పొగలు క్రమంగా మాసిపోయి పరబ్రహ్మ ప్రార్థనతో తెరతీశారు. మేముకొన్నది పావలాటిక్కెట్టు. పైగా మామ్మ నన్ను చంకనేసుకుని టిక్కెట్టు లేకుండా తీసుకుని వెళ్ళడం. కొంచెం చిన్నతనమనిపించినా తప్పలేదుమరి. తెర తీసేసరికి ఓ విచిత్రమైన అనుభవం గ్యాస్ లైట్ల వెలుతురు, రంగురంగుల చమ్కీకోట్లు, కత్తులు, బాణాలు. అంతా ఓగమ్మత్తుగా ఉంది. వేషాలు వేసుకున్నది మనుష్యులేననీ వారూ మనలాంటి వారేననీ ఒక కవి వ్రాసిన కథను మనకు వాళ్ళు అభినయించి చూపిస్తున్నారనీ, ఇన్ని తెలిసేవికావు. ఇప్పుడు బాగా మొద్దుబారిపోయిన బుర్రతో త్రవ్వుకుందామని యెంత ప్రయత్నించినా అంతుదొరకని ఓ అద్భుతమైన భావం. ఇప్పటి యీ సాధ్యమైన శక్తికి అందని ఒకసిద్ధానుభవం. మామ్మ ఇంటికి వస్తూ అన్నది. ఆ కృష్ణుడి వేషం మీనాన్న యింతకంటె బాగా వేస్తాడు, అని అప్పుడు మొదటిసారి తెలిసిందినాన్న వేషాలువేస్తారని నాలో నేను నవ్వుకున్నాను. నాన్నగారేమిటి! వేషాలువేయడమేమిటి? అని ఎందుకనుకున్నానో నేను చెప్పలేనుగాని ఆశ్చర్యం మాత్రం కలిగింది.

అప్పటికీ ఇప్పటికీ ఒకటి మాత్రం మిగిలింది. నాటకాలంటే ఆసక్తి అదెందుకో తెలీలేదు. తెలుసుకుందామనుకున్నా నావల్ల కాదనుకుంటాను.. మరోదశ గడిచింది. "తెలుగునాట మారుమోగే పేర్లతోనిండి తొణికిపోతున్న కీర్తితో యీ నేల మీదనే అనేకులు మహానటులు జన్మించారు. ఒక్కొక్కజీవితాన్ని వెలబోసి అనుభవాల్ని కలబోసి అజరామరములైన పాత్రలను సృష్టించిన వ్యక్తులను మన మీనాడు మనస్సుల్లో జ్ఞాపకాలుగా మార్చేసుకున్నాము. ఒక్కొక్క కళకివిధమైన దౌర్భాగ్యం పడుతుంది. ఎన్నో సంవత్సరాలుగా కృషిచేసి దేశంయావత్తూ పులకింపజేసిన మహానటకులు, మహాకవులు, మహానటులు- వీరంతా మనస్సులో ఏమూలనో చెదరని అక్షరాలుగా, మారని సంస్కారాలుగా నిలచిపోయారు. నీ మొగం నిన్నమొన్నపుట్టావు నీకేంతెలుస్తుంది? అన్నారు నాన్నగారు.

'అవును, ఇప్పుడు నటులు లేరంటారా?' అన్నాను.

'ఉన్నారు. వాళ్ళనాటకాలు చూచి మాట్లాడు. అందాకా నీకు తెలుసుకునే అర్హతలేదు' అన్నారు. కాబోలు ననుకున్నారు.

1947 అని గుర్తు ఓ స్నేహితుణ్ణి చూద్దామని ఒకపల్లెటూరుకి వెళ్లాను. అప్పటికే పల్లెటూళ్ల మొగాలకి బస్తీ ఫేస్‌పౌడర్లు బాగా అలముకొన్నాయి. ఓసంపన్న గృహస్థులయొక్క పూరికొట్టంలో ఆనాడు నాటకం మళ్ళి ఇన్నాళ్ళకి నాటకం చూద్దమనే అదృష్టం పట్టిందికదా అనుకున్నాను. అసలే ఊరుచిన్నది. కాని పల్లెటూళ్లు వ్యాపార కేంద్రం కావడం వల్ల జనం కొట్టంనిండా కిటకిటలాడి పోయారు. మళ్ళీమాట్లాడితే పెటపెటలాడి పోయారు. నాటకం కంట్రాక్టరు మావాడికి బంధువు. అంచేత గొప్పకోసం మావాడు ఆయన్ని నాకు చూపించాడు. అతని వాలకంచూస్తే నాకు నవ్వొచ్చింది. మనిషి ఎక్కడా నేల మీద నిలిచేలాగా లేడు. అసలే సిగసిగా కండలు తేరిన శరీరం కొంచెం ద్వంద్వసమాసంలాటి మనిషి, విగ్రహ వాక్యంలా వేషభాషలు అల్లపెళ్లున తిరుగుతున్నాడు. ఈయనెవరు? అన్నాను నేను. మా నావ కంట్రాక్టరు అన్నాడు మావాడు. ఓ చేత్తో ఫలహారాలు, మరోచేత్తో బీడీకట్టలు, ఓ చేత్తో దక్షిణాలూ, మరోచేత్తో రెండుసీసాలు (గప్‌చుప్) తీసుకుని పచ్చగదివేపు వెళ్లాడు. మాకు అన్నీ అర్థమయ్యాయి కాని నాటకం చూద్దామనే దీక్షవల్ల నాకేది పట్టలేదు. నాటకం కురుక్షేత్రం నటులపేర్లు నేను ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. మీరే ఊహించుకుంటారు. అరంగుళంమందం నీలంరంగులోంచి పూడుకుపోయిన కళ్లు తేలిపోతుండగా (గప్‌చుప్) కృష్ణభగవానుడి ఫ్యాక్టరీ కూతగొంతులోనుండి వచ్చే సవారీ మోతసంగతులతోను, సీమటపాకాయలా అదిరదిరిపడుతున్న మనిషి వాటా వెలిగించిన అర్జునునితోను హాల్లో మనుష్యులకి గింగిరాలు తిరిగి పోయాయి. నామట్టుకు నేను బిత్తరపోయాను. పాపం ఆయనెవరో దుర్యోధనుడు ఠీవిగా చక్కగా నిలబడి ప్రతి అంగుళమూ నటించాడు. ప్రతిపద్యమూ నటించాడు. కచ్చేరీ చేయలేదు. చేయడు. ఇంతలో ధర్మరాజు కంఠం సైరను కూత కూసింది. తక్కిన పిల్లపిల్ల పాత్రలన్నీ యథాశక్తి అరిచాయి. నాకు నాటకంలో వచనంగాని దాని వెనకాల భావాలుగాని అందలేదు. తెల్లవారు జామున నాలుగు గంటలదాకా ముప్పైన

మూడువందల పద్యాలతో, రమ్యమైన సెట్టింగులతో, కొట్టం హాలులో నాటక కళాఘోష అరాత్రికి ఆవులించి నిద్రపోయింది. పైన నేను చెప్పిన కంట్రాక్టరు ముఖం చేటంతయింది. బహుశా కలక్షన్ బాగా వచ్చి ఉంటుంది. ఏం పంతులూ మా ఇంట్లో నాలుగు రోజులుండరాదూ అన్నాడు. లేదండీ వెళ్తాను అని వచ్చేశాను. అప్పటినుంచీ కిరాయి నాటకాలవ్యవస్థ మీద ఓ విధమైన ఏవగింపు కలిగింది. నాన్నగారితో అన్ని విషయాలూ చర్చిద్దామనుకున్నాను. గ్యాసులైట్ల కాంతులు, చమ్కీకోట్ల జిగజిగలు, పవారీ మోతసంగీతాలు మినహాయిస్తే నాటకకళ ఏమన్నా ఉన్నదా, అని అడిగేశాను. ఆ రోజుల్లో ఏర్పడ్డ ఉక్రోషం నిలువరించుకోలేక కత్తిదూశాను. ఆగిరా నాన్న, ఇవ్వాళకన్ను తెరిచావో లేదో కొంచంమరి వెనక్కి తిరిగి చూచుకో అన్నారు నాన్న.

ఏనాడు ఈ నాట్యకళ పుట్టిందో పాపం ఆదిదేవుని డమరుక నాదంతో అమ్మవారి చరణ మంజీరశింజానాన్ని శ్రుతికలిపి వెండికొండమీద ఏనాడు వెలిసిందో, అది లాస్యమో తాండవమో తెలీదు. ఈ గడ్డమీద ఎవరైనా దేవుళ్ళతో దయ్యాలతో ముడి పెట్టుకోందే విద్యలు రాణింపునకు రావనుకొని అలానే చాటింపు చేసుకున్నారు. ఈ దేశం సాంస్కృతికంగా దివ్యజ్యోతులు వెలిగించిన వైదికయుగమది. భారతావని అంతా హోమధూమ మావరించుకొని ఋత్విజుల వేదనాదాలతో ఘూర్ణిల్లుచున్న పవిత్రచరిత్ర నడుస్తున్న సమయం. భరతముని చెప్పిన నాట్య వేదాను సారంగా యజ్ఞయాగాది క్రతువుల్లో నాట్యకళా సరస్వతి కలికి గజ్జె కట్టిందట. భరతముని నాట్యవేదం అనేకకాలాల్లో అనుస్యూతంగా అనుసరింపబడుతూ వచ్చిన నాట్య సంప్రదాయలకు దర్పణం. ఇటు సాహిత్య రంగానికీ, అటు నాట్య సంగీత రంగాలకు, ఆమాటకువస్తే అన్ని కళారంగాలకూ శిరోధార్యమైన ప్రథమ ప్రామాణిక గ్రంథం. ఆ దినాల్లో తారకాసురవధ, త్రిపురదాహము, సముద్రమథనము మొదలైన కథానికలను దేవవేశ్యలచేత భరతముని ప్రదర్శింపజేసేవాడట. అసలీ కళ భరతునికి బ్రహ్మదేవదత్తమైనదట. భరతుడు (లు) రసాన్ని, నటనారీతులను, నాట్యకళాదర్శాలను, సంగీతసాహిత్యాలను మేళవించి తాను చేసిన యీనాట్యకళా తపస్సున కొకశాశ్వతత్వం కల్పించుకోడానికి ఇలా ఎన్నో విషయాలు చెప్పాడు. ఆ నాటి నృత్త, నృత్యరీతు లీ విశాల భారతవర్షంలో మూలమూలలకూ వ్యాపించాయి. ప్రాంతీయ సంస్కృతి ముద్రలతో భిన్నరూపాలతో వెలిశాయి.

ఆంధ్రుల భరతనాట్యము, కూచిపూడి అని పిలిచినా, కేరళీయులు కథాకళి అని పిలిచినా, ఉత్తరాదివారు మణిపురీ అన్నా దేశదేశాలతో ముఖ్యంగా ఆసియా అంతటా వ్యాపించింది భరతుని నాట్యకళ. ఈనాడు ప్రపంచ దేశాలన్నీ భారతీయ నాట్యకళ ఒక యోగమనీ, ఒక తపస్సనీ విశ్వసిస్తున్నాయి. ఇది కేవలం అభ్యాసంకాదు. పూర్వజన్మ సంస్కారఫలము. బ్రాహ్మణికములు, ఆరకణిముల కాలం వచ్చేసరికి భరతుని నాట్యకళ భారతీయ సంస్కృతిలో అంతర్వాహిని అయినది. భరతుడు నాట్యకళకు పర్యాయమైపోయాడు. భరతముగా మారాడు. చరిత్రలో పుట్టిన ఏ రాజవంశ చరిత్రమును చూచినా అది కళాపోషణకు తాణాచి అనిపించుకున్నది. అనగా భరతుని గ్రంథం మేరకు నాట్యశాలలు నిర్మించి నాట్యకళను పోషించినదే. పోనుపోను యీ అభిరుచి పరిపక్వమైంది. కథలు చాలలేదు. అవ్యక్త భావనామార్గంలో సహృదయులకు రసవ్యంజనానికి ఆదరవులు దొరకలేదు. భారత భాగవత రామాయణాలు బంగారుగనులు. సారస్వత తపస్వులగు మహనీయులాగనులను త్రవ్వారు. బంగారుముద్దలు వెలికి తీశారు. రసంలో రంగరించారు. వేలకొలది నృత్యగాథలు వెలిశాయి. మనకు తెలిసిన ఏ రాజుల గాథలు తీసుకొని చూచినా యీ నృత్యకళాపోషణము అంతకుముందుదాకా నృత్యగాథారూపంలో జరిగిందని చారిత్రక సాక్ష్యం వినవస్తున్నది. అయితే ఇక్కడ ఒకవిషయం సంభాషణారూపంలో రసపర్యవసాయిగా, శిల్పాకృతిగా, విస్పష్ట నాటకరచనము భాసునితోనే మొదలైనదని విమర్శకులూహి ఊస్తున్నారు. వేదాలలోను, ఉపనిషత్తుల్లోను కనుపించే వాకోవాకములున్నవికదా? వాటిమాటేమిటి? అని కొందరు ప్రశ్నిస్తారు. అవును. ఉన్నవి. అవి వాకోవాకములేకదా? వాకోవాకములు నాటకాలవుతాయా? పోనీ వాదంకోసం అంగీకరించినా భాసుని నాటకాలవంటి శిల్ప చమత్కృతికి వాటిలో తావులేదుకదా? మనం ఒకవిధంగా చెప్పుకోవచ్చు. ఈ ఆదర్శప్రాయానసలైన పూర్వరంగాలు కావచ్చు. సరిగా ఈ కాలానికే నాట్యకళనుండి నాటకం విడిపోయింది. అంతకుముందు నాటకాలు లేవని చెప్పలేము కాని పైనచెప్పినట్లు కేవలం స్వరూప నిర్ణయాలైన తొలిరేఖలు. కాళిదాసుపేర్కొన్న తొలినాటక కర్తలలో భాస, సౌమిల్లకాదు లున్నారు. వారంచలూ ఈ నాటకప్రపంచానికి సృష్టికర్తలుకావచ్చు. ఇలా నాట్య, నాటకకళల సంబంధాన్ని మనం ఊహించవచ్చు. దీనికో ఉపపత్తి కూడా ఉన్నది. మానవ స్వభావం మరీ పసితనంలో నిరాశ్రయమైన భావాన్ని అనలంకృత కేంద్రంగా ఊహిస్తుంది. కొంతకాలమైన వెనుక తన ఆలోచనలన్నిటికీ ఒక విస్పష్టమైన రూపంకోసం ప్రయత్నిస్తుంది.

నాటక కళలో నాట్యంలో వలెనే దర్శితములైన కొన్ని రసలోకాలున్నవి. నాట్యంలో అంగవిన్యాసంవల్ల, హస్తముద్రల వల్ల సంగీతాదులవల్ల మనలో అనేక జన్మాంతరాలనుండి పుంజీభవించి ఉన్న వాసనాసంస్కారాలను వెలికి తేవడం అనే ప్రయత్నం జరుగుతుంది. ఇక్కడే రససిద్ధాంతం లీనమైఉన్నది. ప్రతిమానవుడూ తనలో ఏకీభూతములైన భావనా సంస్కారాలను బయలుపరచుకోవాలనే తృష్ణతోనిండి ఉంటాడు. సరైన అదను వచ్చి వాసనాబలానికి కొరడాతో చరచినట్లు ఒక కుదుపుకలగాలి. కలిగ ఆసంస్కారం విశ్వవ్యాప్తంగా ఉద్బుద్ధమౌతుంది. నాగుబామును పాములవాడు ఒకదెబ్బచరచి మరినాగస్వరంపట్టినట్లుగా మన సంస్కారాన్ని నిద్రలేపిన కళ (ఏకళైనా కావచ్చు. ఇక్కడ నాట్యకళ) తన అదుపులో ఉంచుకొని మనలను బ్రహ్మానంద సబ్రహ్మచారియైన రసానందం వరకూ తీసుకొని వెళ్లుతుంది. ఇదికేవలం నృత్యగాథలకన్న శిల్పసమ్మతాలై సాహితీకౌశలంతో విరాజిల్లే నాటకాలకు అధికంగా సాధ్యమౌతుంది. పైన చెప్పిన స్థితి స్వర్వగ్రహణశక్తిమానులైన సహృదయులకు. ఇతర

మార్గాలు సామాన్యులందరికీ. అందుకనే మనం ఎంతకాదన్నా నాట్య విజ్ఞానంకంటె నాటక ప్రదర్శనం ఎక్కువ ఫలవంత మౌతుంది. నాట్యవేదకర్తకు నమస్కరించి ఆయనప్రతిపాదించిన రసభావాదులను తీసికొని వానిచే నిబద్ధములైన అనేక నాటక రాజాలను మన పూర్వులు రచించారు. వారిలో ఏ ఒక్కరి నాటకరచనా శిల్పాన్ని గూర్చి ప్రశంసించాలన్నా తడిసి మోపె డవుతుంది. అది మరోసారి చూదాం. భాసుడు, కాళిదాసు, భవభూతి భట్ట నారాయణుడు మున్నగు నాటకకర్తల రచనలు లేనిదే భారతీయ సంస్కృతి లేదు. నాన్నగారు ఇలా చెప్పుకు పోతున్నారు. ఆయనకు ఆవేశంవచ్చిందంటే పట్టలేరు. తమ విశాల నేత్రాలలో తీవ్రమైన తేజోవిశేషం పొతరలాడగా చేతుల్ని అదోలా కదిలిస్తూ తదేకధ్యానంతో ఆయన మాట్లాడుతున్నారు.

ఒక్కవిషయం చెప్పండిచాలు నాటకానికీ మనకూ సంబంధం ఏమిటి? మనం నాటకాన్ని ఎందుకు ఆదరిస్తాము? అని అడిగాను. ఆయ నిలా చెప్పారు.

ప్రతి మానవునిలోను జన్మతః కొన్ని సంస్కారాలు, కొన్ని శక్తులు వాసనారూపంలో ఉన్నవి. వానిని ఒకొక్క కళాస్వరూపం ఒకొక్క మార్గంలో మలచుకొని రసానందాన్ని కలిగిస్తుంది. మానవజాతి మొత్తం మీద తప్పక ఉండి తీరవలసిన కొన్ని శాశ్వత భావాలకే రసత్వం సిద్ధించే వీలువున్నది. వానిని భరతాచార్యులు స్థాయిభావములని పేర్కొన్నారు. ఈ స్థాయిభావాలు ఎంతశాశ్వతాలో అంత ఆస్వాద్యమానములు. ఇతర భావాల నెన్నిటినైనా తమలో లీనంచేసికొని అతిరస్కృతమూర్తిమత్వములై వెలుగుతవి. వీని పర్యవసిత రూపాలే రసాలు అనగా రసానుభవం ఒక్కటే నాట్యమునకు పరమప్యేయం. కనుక అభినవగుప్తాచార్యులు రసమే నాట్యమన్న సూత్రాన్ని తమ వ్యాఖ్యకు మకుటం కావించారు. రసములో కోత్తరానందము. అది అనుభవైకవేద్యమైనది. మరి బ్రహ్మానంద తుల్యము. కాని బ్రహ్మానందముకాదు. కళవల్ల కలిగే ఆనందము విలక్షణము రమణీయము. బ్రహ్మానందం కంటె విశిష్టమైనది. లలిత కళల వల్ల గలిగే సౌందర్యానుభవము దానివల్ల సిద్ధించే అనుభవమును శిల్పానందము అనవచ్చును. తత్త్వశాస్త్రమూ నాట్యశాస్త్రము ఇక్కడ ఒకే విషయాన్నిస్ఫురింప జేస్తున్నవి. మానవునికి సహజంగా ఉండే వాసనారూప సంస్కారాలతో, శబ్దరూప, రసగంధాదిజ్ఞానాలతో రెంటికీ పని ఉన్నది. ఉపాసనలో కూర్చున్న సాధకుడు తన మనోనేత్రం ఎదుట ఏదో రూపాన్ని నిలుపుకొని తనసర్వేంద్రియాలను ఆ ఉపాసితదైవంలో లీనం చేస్తాడు. అప్పటి వరకూ త్రిగుణాలు (సత్వ, రజస్తమో గుణములను) త్రిపుటాలు పని చేసి చూపి కొంత ఉత్తమ పదానికి చేరాక ఇవన్నీ నశించి అచ్ఛమైన ఆత్మానందాన్ని పొందుతాడు సాధకుడు. ఆ ఆనందాన్నే అనిర్వాచ్యమనీ, అవాఙ్మానసగోచర మనీ తాత్త్వికు లుద్ఘాటించారు. ఎంత అవాఙ్మానసగోచరమో అంతగా ఇంద్రియాలతో దానికి పని ఉన్నది. అంతవరకే అది నిజం. తరువాత మిథ్య. ఈ అద్వైతసిద్ధికోసమే అభినవగుప్తులు నాట్యవేదాన్ని లోకంకోసం వ్యాఖ్యానించారు. సరే అదంతా ఓ గొడవ ప్రస్తుతానికి వద్దాం. నాటకం ఆడబోతున్నారు. జన్మాంతరీయ సంస్కారాలు, రూపగంధాది వాసనలుకలిగిన సామాజికుడు ప్రేక్షాగృహంలో కూర్చున్నాడు. నాందీప్రస్తావనల ముక్తి అతనిలో ఉన్న ప్రాథమిక శక్తులను (Elementary faculties) నాటకం వశపరచుకొన్నది. రూపం చూచాడు. దాన్ని భావించాడు. శబ్దం విన్నాడు. సర్వనాడీమండలము ఓంకారనాదంతో పులకించి పోయింది (మరి ప్రాచీన నాట్య సంప్రదాయాల్లో) దక్కని చిక్కని సౌగంధ్యధూమాలు వ్యాపించాయి. ఇలా అన్ని శక్తులూ ఒకే దాటున క్రతువుపట్ల కేంద్రీకృతములైనవి. అసలు నాట్యమే అవస్థకు అనుకృతి. నాటకము నాయికానాయిక జీవితఇతివృత్తము. పాత్రలు, వారి మానసిక భావములు, సాహితీ సహకారములైన సంగీత నృత్యాదులు, కలసి ప్రేక్షకుని మానసిక వ్యాపారాన్ని లోగొన్నవి. మనస్సు, బుద్ధి, చిత్తము మున్నగు ప్రేక్షకునిలోని భూమిక లన్నీ ఒకదానివెంట ఒకటిగా ఆవిష్కృతులై రసానుభవంచేత అర్థములౌతున్నవి. చిత్తమునకు తదాకారాకారి తత్వమనే గుణమున్నది. అప్పటివరకు వస్తువు, వస్తుసంబంధి, వస్తుసంబంధము అన్న మూడు ఆవరణములూ పనిచేస్తున్నవి. కాని లోపలినుండి ఆనంద ప్రవాహం అతివేగంగా ఊటవలె తొలుచుకొని వస్తున్నది ఆ స్థితిలో పైన చెప్పిన ఆవరణాలు త్రిగుణాలు భేదింపబడి ఆ రసానంద సాగరంలో లీనమైనవి. ఆ చైతన్య పరిణతరూపమే యీ ఆనందము. ఈ స్థితి అమరము. అవిచ్ఛిన్నము. శాశ్వతము. ఇలా ఎంతగానైనా అభివర్ణించవచ్చు. అప్పుడు సత్యమైనది ఒక్క రసానందమే. తక్కినవన్నీ మిథ్యలు. అవి నశించి ఆ మృతత్వంలో లీనమైనవి. ఇంతటి అనుభవంతో నాట్యాదర్శయోతితము దర్శించి సృజించారు. ఈ అనుభూతిని మట్టనిదే భారతీయ నాటకకళకు ఎన్నికలేదు. ఇప్పుడర్థమైందా? మనకీ నాటకానికీ ఉన్న సంబంధం అని నాన్నగారు ముగించారు.

'నాన్నగారూ, నేనడిగిన అసలు ప్రశ్న మరచిపోయారు. మన నాటకాలను గూర్చి నేనడిగేను. మీరేవో చెప్పుకుపోయారు. తెలుగునాటకాన్ని గురించి ఏమైనా చెప్పండి' అని మళ్ళీ ప్రశ్నించాను. "అవునవును నీవడిగినది తెలుగునాటకాలను గురించి కదూ చెబుతాను భారతీయ నాటకాలన్నిటికీ సంస్కృత నాటకాలు మూలమని మనం స్థూలంగా చెప్పుకోవచ్చు. దేశకాల పాత్రల ననుసరిస్తూ దేశభాషాకవులు తమతమ భాషల్లో నాటకాలను తీర్చిదిద్దుకున్నారు. వాని చరిత్ర చూస్తే ఇప్పుడు మనం అర్థం చేసుకునేరీతి నాటకాలు దేశభాషలన్నిట్లో కొంచెం ముందు వెనుకగా ఒకసారి పుట్టినట్టు తెలుస్తున్నది. ఇక్కడ ఒక్క విషయం చెప్పాలి. ప్రతి దేశంలోను కళాసాహిత్యాలు రెండు జీవనదుల్లాగా జన్మిస్తాయి. ఒకటి మార్గ. రెండవది దేశి. మార్గమంటె చిరకాలంగా మనదేశ సంస్కృతీ సంప్రదాయాలలో రూపుదిద్దుకుని పండిత మార్గాన పర్యవసించే శాస్త్రబద్ధమైన కళా స్వరూపం. దేశి అంటే ఆయాకాలాల్లో ఆయాదేశాల్లో సర్వ ప్రజానమ్మతమైన మార్గాన జనరంజనం చేసే జానపద కళా స్వరూపం. మొదటిరీతి కొరుకుడు పడక సామాన్యులు వదిలి వేస్తారు. రెండోరీతిమీద ఆదరాభిమానా లున్నా పండితులు చేబట్టడానికి మొగమాటపడతారు. చివరకు రెండూ రెండు మార్గాల ప్రజాజీవితాన్ని ప్రతిఫలించుకొని పోతవి. తెలుగునాట యిలాటి

జరిగింది. ప్రాచీనకాలంలో అనేక జానపద కళాస్వరూపాలు వెల్లివిరిశాయి. యక్షగానాలు, వీథినాటకాలు, భాగవతాలు తెలుగు ప్రజల హృదయాల్లో మరువరాని మధురానుభూతులు. మార్గవాఙ్మయానికంతకీ ఒరవడిదిద్దిన తెలుగుకవులు వచనాన్ని నాటకాన్ని చేబట్టలేదు. అలావారు మార్గనాటక రచనం చేయకపోవటం కేవలం మన దురదృష్టం అనిమాత్రమే చెప్పుకో గలంగాని కొందరు విమర్శకులూహించినట్లు తెలుగు నాటకాలంటే చిన్నచూపనిగాని, కొన్ని మార్గ నాటకాలు వ్రాస్తే అవి నశించాయనిగాని, శ్రీనాథుని విధితో యీ లోపం కొంతవరకు తీరిందనిగాని, ఆంధ్ర ప్రబంధాల యెద్దడివల్లన నాటక రచనావసరం లేకపోయిందిగా నిర్ణయించి చెప్పడానికి వల్లకాదు. ఒక్కటి మాత్రం నిజమనిపిస్తుంది. ఇప్పుడు మనకు పరిచయమై ఉన్న రీతిలో కాకపోయినా కొన్ని విధాలనృత్యకథానికాలు, కొన్ని రీతులదేశినాటకాల తప్పకుండా ఉన్నవి. ఆంధ్ర శాతవాహనుల కాలంనుండి సభాస్థలుల్లో రాజపోషణక్రింద నాట్యకళవిరాజిల్లి ఉంటుందని అందరూ ఊహిస్తున్నారు. రెడ్డిరాజులందరూ నృత్య కళాపోషకులు. అందులో కొందరు నాట్యశాస్త్రవ్యాఖ్యాతలు వీరంతా జనానీకానికి రసలోకపు చలివేంద్రాలువేసి నాట్య కళను పంచారు. ఆంధ్రుడు పండితపామరులను వేలువేలు పంక్తుల్లో కూర్చోబెట్టి పాయసాన్ని పంచాడు. తంజావూరు నాయకరాజులు దక్షిణాదిన యక్షగానాలను ఏకాఏకిని రాజసభలకే ఎక్కించారు. తెలుగువారి ఆడబడుచులు మగసాముల సరసన చదువుల వీవి వెలిగించారు. తెలుగువారి చదువుల జవాది గుప్పు మన్నది అంతే... మళ్లీ మన ప్రతిభక్షీణించింది. తెల్లవారి ఏలు బడిలో సన్నగిల్లిపోయిన దేశీయకళలు మళ్లీ తెప్పరిల్లేవాక చీకటియుగం-సాహిత్యచరిత్రలాగానే యిదీ గహనమై పోయింది. మార్గ, దేశిమార్గాలు కలుస్తాయేమో అనుకునేసరికి దీపం కొడి గట్టింది. మళ్లా క్రొత్తగా కోటిదీపాలు వెలిగించాము.

దేశికళాస్వరూపాల్లోనుంచి యీనాటి నాటకం వచ్చిందని చెప్పలేము. ఆ రూపాలు యిప్పటికీ ఎదుగు బొదుగులేకుండా దేశం మూలమూలల స్పష్టంగా కనిపిస్తున్నవి. కాబట్టి దరిదాపు గతశతాబ్ది ఉత్తరార్థంలో ధార్వాడ, హాల్లీ కంపెనీల ప్రభావం మొదట అనువాద నాటకాలుగాను, తరువాత స్వతంత్రా స్వతంత్ర నాటకాలుగా మన దేశంలో నాటకరచనా ప్రదర్శనాలు ప్రారంభమై భిన్నరూపాల్లో భిన్నమార్గాల్లో వ్యక్తమౌతున్నవి. ఆనాటి రోజుల్లో ఆంధ్రనాటకరంగాన్ని తలచుకుంటే హృదయం ద్రవించిపోతుంది. ఆంధ్రులు ముందెన్నడూ కన్నదీవిన్నదీ కాదు. నిండైన విగ్రహాలు నీటుగావేషం సవరించి కమ్మని భాష మాట్లాడుతూ లైట్లవెలుగున కమ్మని పద్యాలతో రసలోకాలను ఆవిష్కరించుకుంటున్నారు. ఆక్రొత్తల్లో ఊరూరా నాటకసమాజాలు-రంగస్థలాలు కవులు, నటులు, మళ్లా ఒక్కసారి నాట్య కళాసరస్వతి గజ్జెకట్టింది. అప్పటి నాటకకళ ఒకతపస్సు. డబ్బూ దుగ్గానీ ఆశించని దర్జాపురుషులు తినా కట్టా ఉన్న వీరులంతా కలసి నాటకాలాడేవారు. చదువూ సంస్కారము ఉన్న పెద్దలంతా కలసి నాటకకళకీదేశాన ఖండయశః ప్రతిష్ఠచేశారు. ఆసమాజాలు, ఆ కవులు, ఆ నటులు అంతరించినా వారి జ్ఞాపకాలు ఇప్పటికీ చెదరని స్మృతులుగా హృదయాల్లో ఏమూలనో ఉండి తొలుస్తుంటాయి'' అనిచెప్పి దీర్ఘంగా నిశ్వసించారు. వారికన్నులు చెమర్చినవి. "ఇప్పుడు-ఇదిగో నీవు చూస్తూనే ఉన్నావు కదూ" అన్నారు. అప్పటికి నాకేం అంతుపట్టలేదు. నాన్నగారెందుకు అనవసరంగా ఆశపడ్డారా అనిపించింది. పలుక్కుండా ఊరుకున్నాను. కాలచక్రం తిరుగుతున్నది. వర్తమానం. నాన్నగారు నాటకరంగం బాగోగులను గమనిస్తూనేఉన్నారు. నేనూ ఆయన భావవ్యాఖ్యానం వెంట ఊహలు పెంచుకోవాలని ప్రయత్నం చేస్తూన్నాను.

ఆనాడు మా కాలేజిలో ఒక నాటక ప్రదర్శనం-సందర్భం... సరిగాగుర్తుకురావటంలేదు. పెద్దసందర్భానికేముంటుందిలెండి. ఏ సాంస్కృతిక వారాలో, ప్రారంభోత్సవదినాల్లో-మేము మిత్రులం కొంతమందిమికలసి ఒక గొప్పనాటకాన్ని ప్రదర్శించాలనుకున్నాము. పైనుండి ఎవరో ఓ గొప్పాయనవచ్చి ఉత్సవానికి అధ్యక్షతవహించారు. సాయంత్రం నాలుగున్నరయ్యేసరికి కళాశాల ఆవరణమంతా రంగుకాగితాలతో అలంకరించారు. రికార్డుసంగీతాలు, సీతాకోకచిలుకల్లాగా రంగురంగుల నైలానులలో ముస్తాబైన ఆడపిల్లలు క్రొత్తరకాల వేషాలతోదిగిన విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఆవరణం కిటకిటలాడుతోంది. మామూలుగా అపస్వరాల పంచేమాతరం, ఉపన్యాసాలూ అన్నీ అయ్యాయి. తెరవెనకాల మా మాస్టారుండి మాచేత నాటకం ఆడిస్తారు. అంచేత ఆయన ఏర్పాట్లతో సతమతమౌతున్నారు. మధ్య మధ్య అల్లరికుర్రాళ్లు దమ్ములుపీల్చి ముఖాలు ప్రక్కకు త్రిప్పుకొని పొగమబ్బులువదిలి, సిగరెట్లను పాంట్ జేబుల్లో దాచడాన్ని అభినయిస్తున్నారు. ఆరోజు నాటకం పేరుకాని, కథగాని గుర్తులేదు. ప్రదర్శనసమయం కావచ్చింది. మైకుతో మా కార్యదర్శి మహాశయులారా! అని పెద్దగా అరిచాడు. జనమంతా 'ఆ' అరిచారు. కొద్దిక్షణాల్లో నాటకాన్ని ప్రారంభిస్తాము. అందాకా నిశ్శబ్దంగా ఉండమని మా ప్రార్థన-అని రేడియో గొంతుతో అన్నాడు. ఇంతలో తెరలో కలకలం-గ్రీన్‌రూము ఆడిటోరియం కన్న నాలుగురెట్లు క్రిక్కిరిసింది. రంగస్థలం మీద ఒక డ్రాయింగురూము, నాయకుడు కాల్చుకోడానికి (తనను) ఒక తుపాకి, కొందరు నాయకుల బొమ్మలు, నాటకం మధ్యలో అగ్నిజ్వాలలు, తెరవెనుక హాహాకారాలు మొదలైనవన్నీ కావాలని రచయిత దబాయించి వ్రాశాడు. (కథ గుర్తులేని వాడికి రచయితపేరు గుర్తుంటుందా?) అన్నియేర్పాట్లు చేసుకున్నాము. మాలోమేము మాట్లాడుకొనేవన్నీ మైకులో వినిపిస్తున్నాయని ఒక మాస్టరు వచ్చి చెప్పారు. మైకు ఆఫ్ చేశాము. ఓ పచ్చని సైడుకర్టెను వెనకాల ప్రాంప్ట్‌చేయడానికి మాస్టారు, అల్లంతదూరాన ఎలక్ట్రీషియను (చతుర్భుజ శంఖచక్రాల్లాగా స్పాట్‌లైట్ మొదలైన ఆయుధాలతో) లోపల ఇంకోమైకు దగ్గర క్లారొనెట్ విద్వాంసుడు కూర్చుని ఉన్నారు. చచ్చిచెడి బాయింగుల విన్నపాలై తెరతీశాము. మొదట మా నాయకుడు బయలుదేరి ప్రవేశించి, తాను ప్రేమించిన అమ్మాయిని గూర్చి ఆధునికంగా అష్టాదశవర్ణనలూ చేయాలి. ఇది స్వగతం. ఈ వర్ణన చేసేప్పుడు అప్రాంతంలోనే పిల్లతండ్రి ఉండాలి. అతడు ఇదంతా విన్నాడు. తరువాత దృశ్యంలో కూతురును మందలించడం, కూతురు సినిమా నాయికలాగా

పేడవడం, చివరికి నాయకుడు సంఘాన్ని, దేశాన్ని, పవిత్ర ప్రేమనుగూర్చి కొన్ని ఉపన్యాసాలిచ్చి (చేతిలో తుపాకి ఉన్నది కనుక ఆడియన్సు భయభక్తులతో, వింటారు) చివరికి కాల్చుకోబోతుండగా మళ్లీ నాయిక తండ్రితోసహా వచ్చి అతన్ని మళ్లేసుకుని పెళ్ళిచేసుకోడం - ఇలాంటి సన్నివేశాలే కొన్ని ఉన్నవి. తీరా తెరతీశాక ప్రాంప్టరు గొంతు కమ్మగా నటనతోసహా వినిపించిందట. మాకెవరికీ పోర్షనురాలేదు. ఆడవేషం వేసిన కుర్రాడు బొద్దుగా ఇప్పటి సినిమా హీరోయిన్‌ల సైజులో ఉన్నా అలవాటు చొప్పున మీంసమీద ఓ మాటు చేయివేసుకున్నాడు. ఆడియన్సంతా ముక్తకంఠంగా చెయ్యిమార్చు అని అరిచారు. చివరిసీనులో మంచినీళ్ళ గ్లాసు మరచిపోయాం. తన ప్రియురాలు వ్రాసిన ఉత్తరాన్ని చదువుకునే ఘట్టంలో జేబులో ఉత్తరం లేకపోవడాన నాయకుడు గల్లంతయ్యాడు. ఆటోమాటిక్ ఆరుగుళ్ళ పిస్తోలు పేలలేదు. ఎగ్జాసికిగాను ప్రెమిషన్ తెస్తే అది సరిగా పనిచేయలేదు. అగ్నిజ్వాలల కోసం కిరసనాయిలు ఊదితే సైడ్‌వింగ్‌కి నిప్పంటుకున్నది. ఇలాంటి రసాభాసాలు ఎన్నివున్నా నాటకం (వి)రక్తి కట్టింది. చివరలో ప్రిన్సిపాలుగారు తమ అంత్యోపన్యాసంలో (ఇలానే అచ్చయింది. నా తప్పేమీ లేదు.)కొద్దికాలంలో కృషిచేసి యింత మహత్తరమైన నాటకాన్ని ప్రదర్శించి నందుకు అభినందనలు తెలిసివచ్చే అంతర్ కళాశాల నాటకాల పోటీలకు పోబోయే యీ నాటకం ఉత్తమ నాటకంగా ఎన్నిక కాగలదని ఆశించారు. రాత్రి ఒంటిగంటకు రంగుతో సహా ఇంటికి వచ్చాను. (డ్రెమెటిక్ సెక్రటరీ డబ్బంతా తినేశాడనీ అంచేత కొబ్బరినూనె వగైరా సౌకర్యాలను కల్పించలేదనీ ఒకవార్త). నాన్నగారు మేల్కొనే ఉన్నారు. నావేపు తీక్షణంగా చూచి 'రంగు కడుక్కోనిరా, సంతోషించాను' అన్నారు. కొంపదీసి నాన్నగారు నాటకానికి రాలేదుకదా అనుకున్నాను. రాత్రంతా నాటకాన్ని గూర్చిన ఆలాపనలు (పీడ)కలలు, నిద్రపట్టలేదు. ఎలాగో తెల్లవారింది.

మరునాడు ఉదయం పాలుత్రాగి తప్పించుకొని పోయే పిల్లిలాగా పోతుండగా నాన్నగారు పిలిచారు. 'మా నిన్న నాటకం ఆడారుకదా, దానివల్ల ఎవరైనా సంతోషించారా? ఎవరికైనా, రసానుభూతిమాట దేవుడెఱుగు, చక్కని నాటకాన్ని చూచామన్న తృప్తైనా కలిగించేమో కనుకున్నావా? అందాకా అక్కర్లేదు. ఓ పదిరోజులైనాక నిన్నే అడుగుతాను. ఆ నాటకంలో కథగాని, శాశ్వతంగా గుర్తించే సంఘటనగాని సంభాషణగాని నీవే చెప్పగలవా? అని ప్రశ్నలవర్షం కురిపించారు. ఈ ప్రశ్నలకు సమాధానంకూడా మీరే చెప్పాలి. మీరన్నది నిజమే. సంఘటన, సంభాషణ మొదలైనవి గుర్తుండవు. ఏదో తాత్కాలిక చమత్కృతిని పొందుతామనీ, కొన్నివందల నాటకాలు ఇలాంటివి నటించినా నటనకో స్థాయి తరగదు. అన్నీ అంగీకరించాను- అని అనక తప్పిందికాదు. కొంతదోవలో పడ్డాననుకున్నారో ఏమో ఆయన ముఖంలో ఎంతో నిండైన తృప్తి వ్యక్తమైనది. "ఇప్పుడు నేను చెప్పినది ఈ లోకం జాగ్రత్తగా పరిశీలించదగినది. అంతో ఇంతో నాటకరంగంపై శ్రద్ధకలవాళ్ళందరినీ పట్టి చూస్తున్నదీవిషయం. నాటకాలు చూచి చూచి విసుగెత్తిపోయి 'ఇవికావు నాటకాలు' అనే నిరాశావాదం వ్యక్తం చేయడం అందరికీ అలవాటైపోయింది. ఈ విసుగుదల నాటక కళా పరిషత్తుకే తప్పలేదు సుమా! నాటక సమాజాలు పటుజా దేశంలో లెక్కకు మిగిలిపోతున్నారు. ఏటేటా పోటీలు. మహానగరాల్లో సంరంభాలు, ఫ్లడ్‌లైట్ వెలుగులు, పోటీ నాటకాలకు మార్కులు వేయడానికి న్యాయమూర్తులు పడేయాతనలు, బహుమతి పొంది బస్తీమేసవాల్ అనే నాటక సమాజాలు, ప్రైజురాక పెదవి విరిచి ఎక్కడో అన్యాయం జరిగిందని దుఃఖించే నాటక సమాజాలు - ఇదంతా ఓ లీల. ఇన్నాళ్లుగా నడుంకట్టి పనిచేస్తున్నామే నాటక కళాపోషకు ఏడాదికోసారి పాడే పోటీ జోలపాట తప్ప మనకేమన్నా మిగులుతున్నదా? ఓ వేపున కిరాయి కృష్ణభగవానుడు గింగిరాలు తిరగ్గొడుతున్నాడు. ఇంకో వేపున బడిపిల్లలు రంగులు పూసుకొని అల్లరిచేస్తూ నీకు ఉజ్వల భవిష్యత్తుందమ్మా అని చక్కిలిగింతలు పెడుతున్నారు. నీకు నరక్షకులం మేమే నమ్మాతల్లీ - అని పోటీ నాటక కళాపరిషత్తు జోకొడుతున్నది. ఇది యివ్వాళ మనకున్న పరిస్థితి" అని నాన్నగారన్నారు. నాకు మీ సమస్యలు కాదు కావలసినది. ఇందులో ఏ ఒక్క సమస్యకైనా పరిష్కారం చెబితే సంతోషిస్తాను అని గట్టిగా అన్నాను.

"మహాకవి అన్నట్టు నాటకం ఒక చాక్షుషమైన క్రతువు. బ్రహ్మస్వరూప భావనాపరిణతికి సమస్తమైన కళాస్వరూపాలూ సోపానాలవంటివి. యజ్ఞంలో హవిస్సువలె లౌకిక కళల్లో రసానుభవం పారమ్యమని పెద్దల అభిప్రాయం. ఈ రసానుభూతి అన్ని కళలకన్న నాటకకళ వలన అధికంగా సాధ్యం. రసాన్ని కల్పించడానికి నాటకవస్తువు ప్రఖ్యాతమైతే మంచిది. ఉత్పాద్యమైనా ఫరవాలేదు. మన ప్రాక్‌అలంకారికుల దృక్పథంలోవే యీ మాత్రం కుడియెడమ భేద మున్నట్టుగా కనుపిస్తుంది. ప్రఖ్యాత కథలు, ఇందలి పాత్రలు జాతిహృదయంలో తరతరాలుగా సంస్కారాల రూపంలో నిలచి ఉంటారు. వారిపేర్లు చెప్పగానే ఆయా ఉద్దిష్టమార్గాల్లో రసభావభావనా వ్యాపారం దానంతటది కదులుతుంది. దానికో చిన్నకారణంకూడా ఉన్నది. ఆ పాత్రల వలన మనముందు కల్పింపబడే రూపాలు, వాని భావాలు యుగయుగాలనుండి మానవతాపారమ్యాన్ని దర్శించిన మహాద్రష్టల సృష్టులు. కనుక వానికి చలనంలేదు. ఏ రాముడో, భీముడో అనగానే చాలు. ఒక భావనాసంస్కారం ఎంత పామరులకైనా ఉద్బుద్ధమౌతుంది. ఆ మాటకు వస్తే చదువుకున్నామనుకునే సీటుగాండ్రకంటె స్వచ్ఛమైన అమాయకత్వంగల పామరులకే యెక్కువగా ఈ అనుభూతి ఉన్నది. ఈ కథలను గాథలను త్రప్పుకొని మనం దాగా అంకించుకొని జీర్ణంచేసుకొన్న తరువాత ఎన్ని వెంగళాయివేషాలు వేసినా చెల్లుదాటవుతుంది. అందుకనే మనం ఎంత తిట్టుకున్నా ఒప్పుకున్నా పల్లెపట్టుల ఈ పౌరాణిక చారిత్రక నాటకాలకి అంత చలామణి, రాణింపు. (ఇక్కడ మనం అంటే నా ఉద్దేశం నాటకకళా సంప్రదాయాలకు భంగం కలగని రీతిలో నవ్యత్వాన్ని సాధించాలని కలలుగంటున్న పురోగాములని) మా పెట్టివాడి చేతిరాయి గూట్లోనో, నోట్లోనో చెప్పలేము కదూ! అందుకనే నాడునాడు పెద్దలంతా కొత్త [illegible] కల్పించి రచించాలని చూచారు. ఈ ప్రయత్నము; పక్కగా ఇంత సంప్రదాయము, నాటకరచనా శిల్పము, రసదృ

తాండవమాడుకొని మరేదేస్తే బాగుండేది. తీరా యీ క్రొత్తదారి తొక్కుతున్న వేళకి తెల్లవారి చదువులు మనల్ని ముంచి వేస్తాయి. నువ్వు ఎన్ని పేర్లయినా పెట్టు. ఎంత గౌరవవాచకాలతో నయినా స్తోత్రపాఠంచెయ్యి - ఈ కోవకు చెందిన నాటకకవుల్లో వ్రేళ్ళమీద లెక్కించవీలైన ఏ కొద్దిమంది తప్ప తక్కినవారంతా నవ్వులో కాలువేశారు. ఒకరు మధ్యతరగతి బాధల ఎన్‌సైక్లోపీడియా వ్రాస్తే ఇంకోరు పీడిత జనగాథల్ని చెప్పారు. ఒకరు రాజకీయాలు గుమ్మరిస్తే ఇంకోరు పాశ్చాత్య కథలకు తెలుగు రంగులు పూస్తున్నారు. కాకపోతే మాటచమత్కారము, తర్కాలానికి రంజనంచేసే రచనా చమత్కారాలు. అంతా తిరగమోతల కొట్టివంటివి. గట్టిగా నిలదీస్తే ఏ ఒక్కటీ నిలబడదు. అందాకా ఎందుకు? నీవు పుట్టకముందు దేశంలో వ్యాప్తిపొందిన కొన్ని సాంఘికనాటకాల పేర్లు చెబుతాను. ఎక్కడైనా యీనాటి అమల్లో ఉన్నాయేమో కనుక్కో. మచ్చుకుకూడా ఒక్క నాటకము దొరకదు. ఏ హరిశ్చంద్రో, చిత్రనళీయమో అంటే నాటకాన్ని అక్షరశః అందరూ అర్థంచేసుకోలేక పోయినా వానిలో ఒక శాశ్వతమైన భావనాబలం ఉన్నది. ఇవ్వాళ మన నాటకాలకు ఆ బిగువు లేదు. ఇప్పటి రచయితలకు ఆ లగువు బిగువులు తెలీవు. నటులకు ఆ గాంభీర్యము, సాధనాబలము లేవు. నాటక సమాజాలకు ఆ నిలకడా మనుగడా లేవు. కనుక మనమీద ఒక బాధ్యత ఉన్నది. నేనే పామరుణ్ణనుకో. నీవు ఈనాటి నాటక ప్రయోక్తవు. నేను నిన్ను న్యాయం అర్థిస్తున్నాను. 'అయ్యా వెనుకటి దినాల్లో మంచి మంచి నాటకాలు చూచేవాళ్ళం. ఇప్పుడా నాటకాలన్నీ పౌరాణిక పంకంలో మునిగి ఉన్నాయి. కిరాయితప్ప మరోలక్ష్యం లేదు. మీరేదో ఏదో సాజాగ్గా నాటకాలాడుకొని మమ్మల్ని ఉద్ధరిస్తా మనుకుంటున్నారు. మాకు మీ వ్యవహారమేమీ తలాతోకా అందడంలేదు. మాగతి ఇంతేనా?' అని.

నీకు సమాధానంలేదు. ప్రజలకోసం అంటున్నావు. వాళ్లని వేరుచేసి నీకు నీవే రంగస్థలం నిర్మించుకొని కులుకుతున్నావు. ఇది ప్రజాస్వామ్యంలో క్షంతవ్యంకాని మహాపరాధం. వారి అభిరుచి అధఃపతనం చెందినదని మీరు జాలిపడనక్కరలేదు. వారి అభిరుచిని తీర్చిదిద్దవలసినబాధ్యత మీయందున్నది. ప్రభుత్వం కొంతడబ్బు నాటకకళకై వ్యయం చేస్తున్నది. ఎక్కడ వ్యయానికితగ్గ ప్రతిఫలంలేదు. మీరంటున్న సామాన్యులు మీదెబ్బకు తట్టుకోలేక టాకీలగా ఓ పాటలా పాడేసి గంటలకొద్దీ సినిమాలు చూస్తున్నారు. నువ్వేమో నాటకాలకి ముప్పురావడంలేదు. అమెచ్యూరుకళ కింకామంచి రోజులు రాలేదు అని గుటకలు మింగుతున్నావు. ఈ స్థితిలోనుండి బయటపడి ఆంధ్ర నాటకరంగం బ్రతికి బట్టకట్టాలి. దీనికి నా సూచనలుచేస్తాను. నువ్వూ కాస్తో కూస్తో తెలిసినవాడివేగా - ఆలోచించు - మొదట నాటక సమాజాలు నటులు నడుంకట్టాలి. ఇప్పటిదాకా అమల్లోఉన్న యీ అల్లరచిల్లర త్రోవలు వదిలేసి నాటకకళ ఒక తపస్సుగా స్వీకరించాలి. మనం బూజుపట్టిపోయాయనుకున్న నాటకాలను, ముఖ్యంగా పౌరాణిక నాటకాలను-కిరాయిరాయళ్ల చేతుల్లోంచి ఊడతెరుక్కుని భావస్ఫోరకంగా రసవంతంగా ప్రదర్శించాలి. ఇది అన్నంత సులభంగాదు. వాళ్లని ఆక్షేపించినంత చులకనా కాదు. దానికెంతో సాధనకావాలి. కష్టపడాలి. మరి ఇవేమన్నా సాంఘిక నాటకాలా! అరగంటకొకటి అదిపారెయ్యడానికి. ఇంతకష్టపడి పనిచేస్తేనే జనం మళ్ళీ మీవేపు ఆశగాచూస్తారు. ఊరూరా రంగస్థలాలువెలిసి నాటకకళకు కొత్తచిగుళ్ళు పందిళ్లు వేయగలుగుతాం. అందాకా ఒరిగేదేమీలేదు. ఒక్కమాట నువ్వడుగుతావు మరి సాంఘికాలు వద్దాఅని, కావాలి. ఇప్పటికంటె ఎక్కువగా కావాలి-చక్కనికథ, చక్కనిసమస్య. రసవంతమైనటునికి నటించడానికి ప్రేక్షకునికి ఆనందించడానికి అవకాశమున్న రచనలు, సుశిక్షితులైన నటులు, నిలకడగల సమాజాలు, పోషించి విలువకట్టే ప్రభుత్వము, అవునని మెచ్చగల ప్రేక్షకులు కావాలి. ఇవి పౌరాణికాలకైనా, చారిత్రకాలకైనా, సాంఘికాలకైనా కావలసిందే. సాంఘికాలు, తదితరాలు, అన్ని రీతులూ మనకు కావాలి. సాంఘికాలు మనస్సుకు పదునుపెట్టి రసానుభవానికి, నటనకు సాధనరంగంగామాత్రమే పనికివస్తవి. చారిత్రక, పౌరాణికాలు నాటక కళాసాధనకు శిఖరాగ్రంవంటివి. దేవస్థానం దానిదే. సూర్యచంద్రులవలె - ఈసమన్వయం లేనిదే ఎంత తపించినా లాభంలేదు. దానికోసం యీతరం యువకులు నడుం కట్టాలి'' అని నాన్నగారు వెన్నుతట్టారు.

దూరాన్నుంచి నాట్యకళావేశంముంగిట రంగవల్లికలు దిద్దుతున్నట్టు, క్రొత్తతోరణాలు కడుతున్నట్టు, సన్నని సన్నాయి వినిపిస్తున్నట్టు, ఎక్కడో లీలగా ఆశాగీతాలాపనం ముమ్మరించినట్టు అనిపించింది. ఆశతో ఆనందంతో కళ్లు చెమ్మగిల్లాయి.



# పూర్ణా పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్

★

*1931 నుండి చిత్ర నిర్మాతలుగా – డిస్ట్రిబ్యూటర్లుగా ప్రదర్శకులుగా ఆంధ్ర ప్రేక్షకుల మన్ననలందిన పూర్ణాపిక్చర్సువారు శ్రీ సురభి నాటక కళాసంఘ సప్తతి స్వర్ణోత్సవ సందర్భమున తమ హృదయపూర్వక శుభాకాంక్ష లర్పించుచున్నారు*

★

త్వరలో ఆంధ్ర ప్రేక్షకలోకానికి పూర్ణాపిక్చర్సువారు సమర్పింపబోవు

క్రొత్త చిత్రాలు



1. కృష్ణ రాయబారము.
2. మగవారి మాయలు.
3. దేవసుందరి.
4. సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి.
5. దొంగ జగ్గడు.
6. పట్నానికి వచ్చిన జింబో (పూర్తి రంగుల చిత్రం).
7. దీ పా వ ళి.
8. క న్న కొ డు కు.
9. మహాభారతం.
10. జ బా న్ (గేవాకలర్). ఫిల్మాలయావారి గొప్ప హిందీచిత్రం.

LOVE IN SIMLA (Eastman Colour).

పూ ర్ణా పి క్చ ర్సు ప్రై వే ట్ (లి మి టె డ్)
గాం ధీ న గ ర్ (విజయవాడ).